ం

# శ్రీ చాగంటి శేషయ్యగారి

## ఇతర గ్రంథములు

| | | | |
|---|---|---|---|
| ఆంధ్రకవితరంగిణి | 1 వ భాగము | | రు 3—00 |
| (కవులచరిత్ర) | 2 | ,, | 3—00 |
| డిటో | 3 | ,, | 3—00 |
| డిటో | 4 | ,, | 3—00 |
| డిటో | 5 | ,, | 3—00 |
| డిటో | 6 | ,, | 3—00 |
| డిటో | 7 | ,, | 3—00 |
| డిటో | 8 | ,, | 3—00 |
| డిటో | 9 | ,, | 3—00 |
| డిటో | 10 | ,, | 3—00 |
| డిటో | 11 | ,, | 3—00 |
| డిటో | 12 | ,, | 3—00 |

13, 14 భాగములు ముద్రణమగు చున్నవి.

| | | | |
|---|---|---|---|
| విశ్వప్రియత్నము నవల | | ... | 3—00 |
| శ్రీ | ,, ... | ... | 2—50 |
| రాధారాణి | ,, ... | ... | 0—50 |

నూతన గ్రామపంచాయితీల చట్టము

(Act 10 of 1950) 8-00

# ఒక్కమాట



వంగదేశ కవిసార్వభౌముఁ డగు బంకిం చంద్రఛాటర్జీ మొట్టమొదట నీ నవలను వంగభాషలో రచియించెను. చారు చంద్రఘటోపాధ్యాయులు దీని నాంగ్లేయభాషలో కనువదించిరి. ఇంక ననేక భాషలోని కిది పరివర్తనము సేయఁబడినది. క్రీ. శ. 1910 వ సంవత్సరమున చాగంటి శేషయ్యగారు దీని నాంధ్రీకరించి, ఆంధ్రప్రచారిణీ గ్రంథమాలలోఁ బ్రథమ పుష్పముగఁ బ్రకటించితిరి.

ఈ గ్రంథము నిప్పుడు మరల ఏడవకూర్పుగ ముద్రింపించి, యాంధ్రలోకమున కర్పింపఁ గలిగిన భాగ్యము మాకలవడినందుల కెంతయు సంతసించుచున్నాము.

ప్రకాశకులు

శ్రీ రామచంద్ర

# కృతి

తలిదండ్రు లెంము ము ♦ ద్దులు ముచ్చటలు దీర్ప

శాంతయై వెలసిన ♦ సాధుశీల

ఇరువురన్నలకడ ♦ మురిపంబుఁ జూపి సు

భద్రయై యలరిన ♦ భవ్యకీర్తి

అత్తమామలయెడ ♦ నతిభక్తి నెరపి సా

విత్రియై మించిన ♦ విమలహృదయ

పతియెడ ననురక్తి ♦ భక్తిఁ జూపుచు సుస్థి

రాత్మజయై యొప్పు ♦ ననఘచరిత

సర్వమంగళాపదసమా ♦ సక్తచిత్త

శ్రీమతి, వివేకవతి, కీర్తి ♦ శేష. సుగుణ

ధన్య, శ్రీసూరమాంబాభి ♦ ధాన నాదు

సోదరికి నీకృతినొసంగి ♦ సుకృతినైతి.

చాంగటి శేషయ్య

శ్రీరామచంద్ర

# దుర్గేశనందని



## ప్రథమ భాగము

### మొదటి ప్రకరణము

#### దేవాలయము

వంగదేశశకము 998 వ సంవత్సరమున వేసవికాలపు కడపటిదినములలో నొకపురుషుఁ డొంటరిగ గుఱ్ఱము నెక్కి పోవుచుండెను. ఆతఁడేగెడు బాట విష్ణుపురమునుండి జహానబాదునకుఁబోవును. సూర్యుఁడస్తమించు సమయమైనది. ఆతడింకను జాలదూరము పోవలసియుండెను. ఒంటరిపాటు, మార్గమున నెక్కడ నాశ్రయములేదు. ఆఋతువునందు సాయంకాలమగునప్పటికి, ఉఱుము, మెఱుము, లారంభమై గాలియు, వానయు, వచ్చుచుండుట కలదు. అట్లయినచో నాశ్రయ విహీనమైన యాప్రదేశమున నాతఁడు మిక్కిలి కష్టపడవలసివచ్చును. అందుచే నాతఁడు గుఱ్ఱమును బరుగెత్తింప నారంభించెను. సాయంతనమయినది. క్రమక్రమముగ గనఁచీఁకటిపడెను. ఆకసమునంతట నల్లనివారిధరములు కాఱు క్రమ్ముకొనినవి. రాత్రిపడినతోడనే గాఢాంధకారము

చూపానునంత ప్రదేశమును గప్పివేసెను. గుఱ్ఱమునకు దారి చూపుట కష్టమయ్యెను. ఆతఁడు మెఱపుసహాయమున నతి కష్టముతో మార్గమును జూచుచుండెను. కొలఁది సేపటిలోనే వర్షముతోఁగూడి గాలిరోజనమారంభించెను. బాటసారి తుద కెట్లుపోవలయునో యేర్పరింపలేకపోయెను. కళ్ళెమును సడలించెను. గుఱ్ఱము దానియిష్టమువచ్చినత్రోవను బోవుచుండెను. ఇట్లు కొంతదూరమరిగెను. గుఱ్ఱముకాలున కేదో కఠినపదార్థముతగిలి కాలుజారెను. అంతలో విద్యుత్కాంతి తళుక్కుమనియెను. ఆ ప్రకాశమున బాటసారి కన్నులకు సమీపమునఁ డెల్లగ నెత్తయినదేదో యొకటి యటనున్నట్లు కాన్పించెను. ఆతఁడదియొక గృహమనుకొనెను. అశ్వమునుండి క్రిందికి లంఘించెను. క్రిందరాతితో నిర్మింపఁబడినసోపానములున్నవి. వానిచేతనే గుఱ్ఱము కాలుజారి పడెనని యాతఁడు గ్రహించెను. అందుచే నిట నొక్క యాశ్రయముండవచ్చునని తలంచి యాతఁ డాయంధకారమున మెల్లగ నా మెట్ల నెక్కనారంభించెను. విద్యుత్ప్రకాశ సాహాయ్యమునఁ దనయెదుట నెత్తుగ నున్నదొక దేవాలయమని యాతనికి స్పష్టపడియెను. మెల్లగా నాతఁడు దానిద్వారమును సమీపించెను. కాని, యది మూయబడియున్నది. అతఁడు తలుపును దడవిచూచెను. వెలుపలి ప్రక్క గొళ్ళెము వేసియుండలేదు. బాటసారి నివ్వెఱ పడెను. ఆశ్చర్యమగ్నుఁడయ్యెను. "మనుష్య నివాసములేని

ప్రదేశమున నున్న యీ దేవాలయమునందిప్పుడెవరున్నారు? తలుపును లోపల వైచినవారెవరు?” అని తనలోఁ దానను కొనెను. పాపమాతని శిరస్సుపై వర్ష మతికఠినముగఁ మొత్తు చుండెను. “లోన నెవరున్ననేమి” అని యనుకొని యాపాంథుఁడు తన పాణితలమున నతివేగముగఁ దలుపును దట్టనారంభించెను. మరలఁ దట్టెను. మరలఁ దట్టెను. కాని, నిష్ఫలమై నది తలుపులు వీడలేదు. ఒక్కతన్ను తన్ని తలుపులను బద్దలుకొట్టవలయునను నత్యుద్రేక మాతనికిఁ గలిగెను. కాని, తన్మూలమున భగవదపరాధమును జేసినవాడ నగుదునేమో యని శంకించెను. ఓర్పువహించెను. తలుపును విఱుగఁగొట్ట లేదు. కాని, యది పెళుసుకఱ్ఱతోఁ జేయఁబడుటచేఁ గఠిన మగు నాతనిచేతి ప్రేటులకుఁ జీల యూడిపోయెను. బాటసారి తలుపును విసరి త్రోసెను. లోన బ్రవేశించెను. ఏదియో యస్పష్టధ్వని యొకటి యాతనికివినవచ్చినది. ఆతనితో గాలి కూడ లోనఁజొరఁబాఱెను. వెలుఁగుచున్న దీపమారిపోయెను. లోపల నెవ్వరుండిరో, యందున్న విగ్రహ మేదేవునిదో యతనికి బోధపడినదికాదు. నిర్భయుఁడగు నాబాటసారి తనస్థితినిఁజూచుకొని యించుక నవ్వుకొనియెను. భక్తిశ్రద్ధలతో నగోచరముగనున్న యావిగ్రహమునకు శిరస్సువంచి నమస్కార మొనర్చెను. ఆతఁడాచీఁకటిలోనే “ఈయాలయమునందున్నవా రెవరు?” అని యడిగెను. ఎవరును బ్రత్యు

త్తరమీయలేదు. ఆభూషణ క్రేంకారములు మాత్రము విన నయ్యెను. మాటలవలనఁ బ్రయోజనములేదని యాతఁడు తలంచెను. గాలియు, వానజల్లును, రాకుండఁ దలుపులు మూసెను. చీలకుబదులుగ నాతఁడు తలుపునాని కూర్చుండెను. మరల నిట్లు కేకవేసి చెప్పెను.

"ఇందున్న మీరెవ్వరో యిటు వినుఁడు. ఆయుధపాణినై నేనిటఁ గూర్చున్నాఁడను. నా విశ్రాంతికి భంగముఁ దేఁబోకుఁడు, మీరు పురుషులై యట్లు చేసితిరేని మీ కపాయము సంభవింపఁగలదు. గాని, స్త్రీలైనచో మీకేమియు భయములేదు. ఈ రాజపుత్ర వీరునిచేతఁ గత్తియు, డాలు, నున్నంతవరకు మీకు లేశమాత్రమును విచారము కలుగఁబోదు"

"అయ్యా! మీరెవ్వరు?" అను నొకమాట వినవచ్చెను. ఆధ్వని యొకస్త్రీది. బాటసారి యాశ్చర్యముతో "ఈ కంఠధ్వనినిబట్టి నన్నిట్లడిగిన దొకయువిదయని నాకుఁదోఁచుచున్నది. నన్నెఱుంగుటవలన మీకేమి బ్రయోజనము?" అనియెను.

"అయ్యా! మేము చాల భయపడుచున్నారము."

"నేనెవరైననేమి? నన్నుఁ గూర్చి నేఁజెప్పుకొనను. అది మాయాచారముగాదు. అయినను నేనిట నున్నంత వఱకు నబలలగు మీకిసుమంతయేని భయములేదు. నెమ్మదిగనుండుఁడు."

"అయ్యో! మీవాక్యమువలన మాగుండెలు కుదుటఁబడినవి. ఇంతదనుక మాప్రాణములపై మాకాశలేదు. ప్రాణములఁజేతఁ బెట్టుకొని యున్నాము. నాచెలి మూర్ఛపోయినది. ఇంకను దేరలేదు. మేముసాయంతన మీశైలేశ్వరునిఁ బూజింపవచ్చితిమి. వర్షముమూలమున మాపరిచారకులును, బోయవాండ్రును, మమ్ముల దిగవిడిచిపోయిరి. వారెటకేగిరో మే మెఱుంగము."

"మీకేమియు భయములేదు. ధైర్యము వహింపుఁడు. విశ్రాంతిఁజెందుఁడు. ఱేపుదయమున మిమ్ముల మీయింటికి గొంపోయెద."

"అయ్యో! శైలేశ్వరుఁడు మిమ్మురక్షించుఁగాక!"

రాత్రి రెండు యామములయినది. వర్షము, గాలియు, తగ్గెను. బాటసారి యిట్లనియెను.

"అబలలారా! మీర లొక్కింతసేపిట ధైర్యముతో నుండుఁడు. నేనీ సమీపమందలి పల్లెకుఁబోయి దీపమును గొనివచ్చెదను."

"అయ్యో! మీ రెంతదూరమో పోనక్కఱలేదు. ఈ దేవార్చకుఁ డిట కత్యంత సామీప్యముననే యున్నవాఁడు. సుధాకిరణుని ప్రకాశమిప్పు డగపడుచున్నది. అందుచే మీ రవ్వలకేగితిరేని యాతని కుటీరమును గాంచఁగలరు. నిర్జనమైన యీప్రదేశమున నాతఁడొక్కఁడే వాసముచేయుచున్న

వాఁడు. అతనియొద్ద నెప్పుడును దీపమునకుఁ గావలసినవస్తువు లుండును.'' అని మొదటియాపెయే ప్రత్యుత్తరమిచ్చెను.

ఆమెచెప్పినరీతిగ పాంథుఁ డవ్వలి కేగెను. వెన్నెలయం దర్చకుని గృహమును గని తలుపునొద్ద కేగి యాతనినిలేపెను. అర్చకుఁడు భయపడియెను. తలుపు తీయలేదు. రంధ్రము గుండ నీతఁ డెవరోయని తొంగిచూచుచుండెను. బాగుగ బరీక్షచేసిచూచెను. బాటసారియందుఁ జోరుని లక్షణములు గనుపట్టలేదు. ఇంతేకాదు, బాటసారియొంటనున్న యమూల్యాలంకారముల నాతఁడుచూచెను. వానియందు సహస్రాంశమయినను దనయింటలేదు. ఇదియంతయు యోచనచేసి చూచి యర్చకుఁడు తలుపుతెఱచి దీపమును వెలిఁగించెను.

బాటసారి దీపముతో దేవాలయమునకువచ్చి యందు స్థాపించిన విగ్రహమునుజూచెను. అది శ్వేతశివలింగము దాని వెనుక నిరువురు స్త్రీలుండిరి. అందొకర్తు యౌవనవతి ఆమె దీపమును జూచిన తోడనే మేలిముసుంగు వైచుకొని యవనతముఖి యయ్యెను. ఆమె హస్తములు కంకణస్థగితవజ్ర కాంతులచే మెఱయుచుండెను. అవి మార్వారీ దేశపుఁ గంకణములవంటివి. ఆమె దుస్తులు శ్రేష్ఠమైనవి. బుటేదారి పనితోఁ జక్కఁగానున్నవి. వానిపై నామెయలంకారములు మనోహరములై కనుపట్టుచుండెను. పాంథుఁ డామె యెవ్వరో యొక గొప్పయింటివనిత యని స్పష్టముగా గ్రహించెను. ఆ

యువతి ధరించినవానికంటె నారెండవస్త్రీ దాల్చినదుస్తులు తక్కువవిలువగలవి. అందుచే నామె యాయువతి పరిచారికయై యుండునని యాతఁ డూహించెను. అయినను, నామె సామాన్యపరిచారికలకంటె చాల విలువగల నగలనే ధరించి యుండెను. ఆమెవయసు ముప్పదియైదు సంవత్సరము లుండవచ్చును. ఇంతదనుకఁ దనతోడ మాటలాడినదాపరిచారికయే యని యతఁడు తలంచెను. అది స్వభావమేకదా! వారల వేషములను జూచి యాతఁ డాశ్చర్యపడెను. వారిరువురి వేషములునుగూడ వంగదేశపుస్త్రీలవి వలెలేవు. ఉత్తరహిందూస్థానపు స్త్రీలవివలె నున్నవి.

బాలసారి దీపము నక్కడనుంచి వారి కెదురుగ నిలిచెను. దీపపుఁగాంతు లాతనిపైఁ బ్రసరించినవి. ఆయువిద లాతనివయ స్సిరువదియైదు సంవత్సరము లుండుననుకొనిరి. అతనిశరీరము పొడవయినది. ఇతరులెవ్వరైన నింతపొడవుండు రేనియంత సౌందర్యముగ నుండరు. విశాలమయిన వక్షస్థలము. ప్రత్యవయవమును మాంసలమై సముచితౌన్నత్యమును గలిగి యుండెను. అందుచేతనే యాతని యౌన్నత్యము మనోహరముగ నుండెను. వర్షసమయమునం దభివృద్ధినందు మెత్తని పచ్చికవంటి శరీరచ్ఛాయ. కాదేని దానికంటె మనోహరచ్ఛాయగలిగి వసంతఋతువందలి నవమృదు పత్రమువంటి శరీరవర్ణము, దానిపైరక్షు, తాయెతులు, మొదలగు రాజ

పుత్రాలంకారములు ప్రకాశించుచుండెను. నడుమున కాసెకోక. దానఁ గత్తితోఁగూడిన యొఱయొకటి వ్రేలాడుచుండెను. పొడవయిన యాతని చేతియం దొక పెద్దబల్లెమున్నది. శిరమున వజ్రపుదురాయితోఁ గూర్చినయుష్ణీషము. కర్ణముల ముత్యాలతాటంకములు కంఠమున హారమొకటి శోభిల్లుచుండెను.

ఒకరినొకరు చూచుకొనిరి. ఒకరినొకరు పరిచయమొనర్చుకొన నువ్విళూరుచుండిరి. కాని, యెవ్వరు నా విషయమున ముందంజ వేయలేకపోయిరి. అట్లుచేయుట యిరువురకును మర్యాదభంగమే యని యనుకొనిరి.

—

## రెండవ ప్రకరణము

—♦—

### పరిచయము

తుదకు రాజపుత్రుఁడే తనమనస్సును మొదట వెలిపుచ్చెను. ఆతఁడు పెద్దయామెతో "అమ్మా! మీరొకగొప్ప యింటివారని తలంచెదను. మీవంశ నామధేయముల నడుగ నాకు సందియమగుచున్నది. కాని, నావలె మీరు మీ వృత్తాంతములఁ దెలుపనభ్యంతరము లేనివారై యుండ వచ్చును. అందుచే మీరెవ్వరని యడుగ స్వతంత్రించుచున్నాఁడను." అనియెను.

“కాదు. కాదు, అయ్యో! స్త్రీలెప్పుడైన ముందుగఁ దమ్ముఁదా మెఱింగించుకొందురా?”

“పరిచయము గలిగించుకొనుటకు ముందు వెనుక లేమి?”

“తన కులగౌరవాధిక్యమునుగూర్చి చెప్పుకొనఁదగదని స్త్రీతన్ను దానెట్లెఱింగించు కొనఁగలదు? తనగృహమునుండి యివ్వలకు రాఁదగని యబల తనసంగతి నెట్లు చెప్పుకొనును? తనభర్తనామోచ్చారణ మొనర్పననర్హయైన వనితకు తనను దాను దెలుపుకొనుటమాత్రము స్వాతంత్ర్య మెక్కడిది?”

ఈమాటలకాయువకుఁ డేమియు బ్రత్యుత్తర మీయ లేదు. ఆతనిదృష్టి యన్యథా లీనమయియుండెను. ఆరెండవ యువతి క్రమక్రమముగ మేలిముసుఁగును దొలఁగించి తన చెలివెనుకనుండి యాపురుషుని నిరీక్షించుచుండెను. ప్రసంగ సందర్భమున నాతని చంచలవీక్షణ మామెపైఁ బ్రసరించెను. ఆమెమొగమున దృఢముగా నాటుకొనియెను. అట్టిలావణ్య రాశినిఁ జూచుభాగ్యమికఁ దనకెన్నఁడును లభింపదని యాతడనుకొనెను. తోడనే యువతీయువకుల వీక్షణములొండొంటితోఁ గలిసికొనియెను. యువతి యవనతాలోకన యయ్యెను. పరిచారికావాక్యములకు బ్రత్యుత్తరమురాలేదు. ఆమె బాటసారివంకఁ బరికించెను. ఆతఁడు చూచుచున్నవిధమునంతయు గ్రహించెను. తనసఖికూడ నాతని నాత్రముతో నిరీక్షించు

చున్నదని తెలిసికొనియెను. అపవారించి, యామెతో నిట్లని యెను.

“అమ్మాయీ! ఇదియేమి? ఈ యీశ్వరుని సన్నిధిని పెండ్లియాడవలయునని యుద్దేశమా యేమి?

‘చాలునులే’ యని యువతి పరిచారిక నొక్క గిల్లు గిల్లెను.

పరిచారిక నిపుణవతి. సంగతి సందర్భములను జక్కఁగ గని పెట్టెను. తనలో నిట్లని వితర్కించుకొనుచుండెను. “నాకు జాల భయమగుచున్నది. ఈయువకుని రూపసంపద మాచెలి హృదయాకర్షణ మొనరించుచున్నది. ఈమె మనసు నాతని కర్పించెనేని యందువలన నంతచెడుగు సంభవింపకున్నను— అయ్యో!—ఈమెమనసునకిఁక నెప్పటికిని విశ్రాంతియుండదు. ఆహా! ఎట్లయిన నిదివారింప నర్హము. ఔను. అయిన నది యెట్లు?—ఇప్పుడ మేమీతని విడచిపోవ యత్నించెదము గాక!”

కుశాగ్రబుద్ధియగు నాపరిచారిక యిట్లు నిశ్చయించు కొని యాతనితో “అయ్యా! స్త్రీలప్రతిష్ట నశ్వరమైనది. సామాన్యవాయుస్పర్శమునకు సయితము నిలువఁజాలదు. ఇక నీనాఁటి ప్రచండవాయువునుగూర్చి చెప్పనదేమి? గాలియు వానయు నడఁగినవి. మేమింటికి నడచిపోవ యత్నించెదము, మాకనుజ్ఞ నొసంగుము” అనియెను.

ఈయర్ధరాత్రిముననే మీారింటికి నడచిపోవలయునేని నేను మీాకు సహాయుఁడనై వచ్చెదను. ఆకసము నిర్మలముగ నున్నది. నేనిదివఱకే మాయింటి కేగవలసినవాఁడను. అయి నను రక్షకులెవ్వరును లేకుండ మీాసఖివంటి సౌందర్యవతిని విడిచిపోవ నిష్టములేక యింతవఱ కట్టెయుండవలసిన వాడ నైతిని.''

''మీారు మాయెడల మహానుగ్రహముఁ జూపినారు. నామనోభావముల నన్నిటిని మీాకడ విన్నవింప లేకున్న దానను చెప్పిన మమ్ముఁ గృతఘ్నులనుగ భావింతురేమో! అయ్యో! స్త్రీల యదృష్టమునకు శాపమున్నది. ఆవిషయమున మీాకేమి చెప్పుదును? మేమెప్పుడును ననుమానముతోఁ జూడఁబడుట సర్వసామాన్యమయినది. మీారు మాతోఁ గూడవచ్చేయుటకన్న సౌఖ్యమేమికలదు? కాని, యీాబాలిక తండ్రి యీామెనడిగినచో నెట్లువచ్చునో యోచింపుఁడు. ఈ యర్ధరాత్రమున మిమ్ముల నెవ్వరు తీసికొనివచ్చిరని యడుగ నామె యేమి ప్రత్యుత్తరమీాయగలదు?''

యువకుఁడు కొంచెమాలోచించి యిట్లనియెను.

''ఏమి? మానసింహమహారాజుగారి తనయుఁడగు జగ త్సింగుసాహాయ్యమున వచ్చితిమనిన నేమి?''

పిడుగుపడినట్లయ్యెను. అయ్యువిదలిరువురు మహాశ్చ ర్యనిమగ్నలైరి. యేమియుఁ జేయలేకపోయిరి. లేచి నిలువఁ

బడిరి. యువతీమణి శిలావిగ్రహము చాటునకరిగెను. వాజ్మి పుణయగు నాపరిచారిక వేలాడుచున్న చీరచెఱఁగును, కంఠమునకుఁ జుట్టుకొని చేతులు జోడించి "రాజకుమారా! క్షమింపుము. ఎఱుఁగక వేయియపరాధములను గావించితిమి" అనియెను.

జగత్సింహుఁడు నవ్వుచు అట్టియపరాధములకు మన్ననలులేవు. అయినను మీరెవ్వరో నాకుఁ దెలియజేసితిరేని నేనన్నియు మఱచిపోయెదను. లేనిచో యుక్తమయిన దండనము మీకు జరుగకతప్పదు."

మృదువాక్యములు నిపుణవతియగు స్త్రీకి ధైర్యమును గలుగఁ జేయును. ఆమె యిట్లనియెను.

"అయ్యా! అదేదియో యాజ్ఞయిండు; సిద్ధముగ నున్నారము."

"మిమ్ముల నింటికిఁ గొంపోవుటకన్న వేఱేమున్నది?"

పరిచారిక కేమిచెప్పుటకు దోఁచలేదు. ఢిల్లీ సార్వభౌముని సేనాధిపతికిఁ దనసఖినిగూర్చి చెప్పుట కామెకిష్టము లేదు. అందులకొక ప్రత్యేకకారణమున్నది. ఆతఁడు తమతోఁ గూడవచ్చుట యామెకంతకంటె నిష్టములేదు. ఆమె శిరస్సును వేలవైచి యోచించుచుండెను.

ఇంతలోఁ జాలదూరమున నెన్నియోయశ్వముల కాలిచప్పుడులు వారికి వినవచ్చెను. రాజు తటాలున నావలికేగి

చూచెను. నూఱుగురు రౌతులు గుఱ్ఱములపై వచ్చుచుండిరి. ఆతఁడు వారిదుస్తులను గుర్తించెను. వారాతని రాజపుత్రసైనికులే. కొలఁది కాలముక్రిందట నీతఁడు విష్ణుపురమునకు సైన్యసంబంధమైన యొక కార్యముపైఁ బోయియుండెను. నూఱుగురాశ్వికులతో మరలఁ దండ్రికడ గేగుచు మధ్యాహ్నమున నీతఁడు వారినివిడిచి ముందుపయనముఁ జేసెను. పిమ్మట రాజొక త్రోవను నాశ్వికులొక త్రోవను బోయిరి. జగత్సింహుఁ డీమార్గమునవచ్చి వర్షముచే నిట్టిశ్రమకు లోనయ్యెను. ఇప్పుడు మఱల నగపడినవా రాయాశ్వికులే. వారు తన్నానవాలు పట్టినారో లేదో తెలిసికొనుటకై "ఢిల్లీశ్వరునకు జయమగుఁగాక!" యని యొక్క కేకవైచెను. ఆక్షణమే యొకరౌతాతని సమీపించెను. జగత్సింహు డాతనిఁజూచి యిట్లనియెను.

"ధర్మసింహా! వర్షముచే నేనిట నాగిపోతిని."

ధర్మసింహుఁ డతివినయపూర్వకముగ వందనమొనర్చి "ప్రభూ! మీకొఱకుఁ జాలసేపు వెదకితిమి. మీరగపడలేదు. మీగుఱ్ఱపుడెక్కల జాడను గుర్తించుకొనుచు నిట్లు బయలు వెడలితిమి. అదిగో! అట దూరముగనున్న యామఱిచెట్టుకడ మీగుఱ్ఱము గాన్పించినది. దానిని తీసికొని వచ్చినారము" అనియెను.

అశ్వముతోఁగూడ నీవిటనుండుము. ఇరువురు మనుష్యుల నీసమీపమున నున్నపల్లెకు, బోయవాండ్రను బల్లకితోఁగూడఁ దీసికొనిరమ్మని పంపుము. మిగిలిన సైనికులను ముందునకుఁ బొండనుము''

ధర్మసింహుఁడు కొంచెమాశ్చర్య పడియెను. ఆజ్ఞాహేతు వేదియో యతనికిఁ దెలిసినది కాదు. యజమానుని నడుగుట తనకనగత్యమైనపనియని యాతఁడు తలంచెను.

"అయ్యా! మీ యాజ్ఞానుసరణి నొనర్చెద" అనియెను.

రాజాజ్ఞను ధర్మసింహుఁడు సైనికుల కెఱింగించెను. అందొకఁడు తనప్రక్కనున్న యతనితో "అద్భుతమైన యుత్తరవులైన వెందులకో? విశేషములేవియో?" అనియెను. ఇంకొకఁడు "ఏమి? ఎందులకుఁగాఁగూడదు? రాజపత్రశిరోమణియగు మహారాజున కైదువందలకుఁ దక్కువ కాకుండ రాణు లుండవలయుననుమాట జ్ఞప్తియుంచుకొనుము" అని ప్రత్యుత్తర మొసంగెను.

రాజు తనయొద్దలేని సమయమున నా యువతీమణి మేల్ముసుంగునుదీసి తనతోఁగూడ నున్నయాపెతో 'విమలా! రాజునకు నన్నెఱిగింప నీకేల యిష్టములేదు?' అని యడిగెను.

'నీప్రశ్నకుఁ బ్రత్యుత్తరము మీతండ్రిగారికిఁ జెప్పెదను లే! కాని యిపుడాధ్వని యేమిరో?'

"రాజును వెదకుటకై యాతని సైనికులు వచ్చినట్లు న్నది. ఆతఁడు మనతోనున్న నీకు భయమెందులకు?"

పల్లకీ, బోయవాండ్రకొఱ కేఁగిన యాశ్వికు లింకను రాలేదు. ఆయువిదల నటవిడిచి సమీపమందలి పల్లెకు విశ్రమింప నేఁగిన మనుష్యులు మరల వచ్చుచుండిరి. జగత్సింగు వారినిజూచి లోని కేఁగి పరిచారికతో నిట్లనియెను. 'కొందఱు బోయవాండ్రును, ఆయుధపాణులగు మనుజులు కొందఱును, బల్లకితో వచ్చుచున్నారు, నీవావలకేగి వారు మీ సేవకు లగుదురో కారో గుర్తింపుము'

విమల తలుపుసందునుండి వారలఁజూచెను. వారామె మనుష్యులే. జగత్సిం గిట్లు చెప్పెను. "ఇఁక నేను మీకడ నుండరాదు. ఉండిన నేదైననాపద రావచ్చును. మీకు సుఖమగుగాక! నాకనుజ్ఞ. సుఖముగ మిమ్ముల నింటికడఁ జేర్పుమని శైలేశ్వరు నిదె వేఁడుచున్నాఁడను. నాదొక్క ప్రార్థన మున్నది. వారము దినములలోపల మన యీసమావేశమెక్కడను దెలియనీయరాదు. కాని, నన్నుమాత్ర మెప్పుడును మఱవకుఁడు. నన్ను మఱచిపోకుండ నిదిగో దీనిని నీకడ నుంచుము. మీప్రభుతనయ యెవ్వరో నే నెఱుంగ లేకపోయినను మీలక్షణములు నాహృదయముననాటుకొనియున్నవి—' ఇట్లు చెప్పుచు జగత్సింగు తలపాగనుండి ముత్యాలహారము నొకదానినితీసి విమల శిరస్సుపైనుంచెను. ఆయమూల్యా

హారము నామెగ్రహించి తనకబరికిఁజుట్టుకొని యవనతశిర స్కయై వందనమొనర్చి యిట్లనియెను.

'రాకుమారా! మీరత్యంతాభిలాషతో నన్నొక్క విషయమునుగూర్చి యడిగితిరి. దానికిఁ బ్రత్యుత్తరమీయ లేకపోయినందులకు కెంతయో చింత నొందుచున్నదానను. నన్ను మన్నింపుఁడు. మీరడిగినవిషయమున నేనిట్లు మౌనము వహించుటకుఁ దగినంత కారణమొకటి యున్నది. అయి నను మీకంతగాఁ బ్రియతమగునేని పదునేను దినములు గడ చినపిమ్మట మిమ్మెట దర్శింపఁగలుగుదునో యాజ్ఞయిండు.'

జగత్సింగు కొంచెమాలోచించి యిట్లనియెను. 'ఈ యాలయమునందే. ఇట నన్నుఁజూడనేరవేని మరల మన మెన్నఁడును గలిసికొనఁజాలము.'

విమల వందన మొనర్చుచు 'భగవంతుఁడు మిమ్ము రక్షించుఁగాక!' అనియెను.

జగత్సింగు మరల నొక్కమారా యువతీమణిపై జం చలదృష్టి సారించెను. పిదప నశ్వారోహణ మొనర్చి యదృ శ్యుఁడయ్యెను.

—

## మూఁడవ ప్రకరణము



### మొగలాయీలు—పఠానులు

పాఠకులారా! ఆలయమునుండి వెడలిన జగత్సింగే మయ్యెనో, లావణ్యరాశియగు నాయువతి చారిత్రమేదియో, తెలిసికొన మీరు వేడుక పడుచుందురు. కాని యావిషయ మిప్పుడు చెప్పను. జగత్సింగు రాజపుత్త్రుఁడు. ఆతఁడు వంగ దేశమున కేలవచ్చెనో యొంటరిగా నేల ప్రయాణముచేయు చుండెనో, మీకెఱింగించుటకై యాకాలపు వంగదేశ రాజ కీయస్థితి నిటసంగ్రహముగ వర్ణించెదను. అందుచే నీప్రకర ణము చారిత్రాంశములతో నిండియుండును. కావున నోర్పు వహింప లేనిచదువరు లీ ప్రకరణమును జదువకుండ దాఁటిం చెదరుగాక! గాని, యోర్పుతోఁ దుల్యమయినది లేదుసుఁడీ.

భక్తియార్ ఖిల్జి, వంగదేశమున నర్ధచంద్రధ్వజమును నాటినతరువాతఁ బఠానులు దానిని గొన్నిశతాబ్దములు నిరం కుశముగ, బరిపాలించిరి. 932-వ సంవత్సరములో సుప్ర సిద్ధుఁడగు సుల్తాను బేబరప్పటి ఢిల్లీచక్రవర్తియగు యిబ్రి హీమ్‌లోడీని జయించి ఢిల్లీసింహాసనము నాక్రమించుకొని యెను. కాని, యప్పుడును వంగదేశముమాత్రము తామర లేన్ వంశీయుల యధికారముక్రిందకుఁ బోయియుండలేదు.

మొగలాయీవంశదీపకుఁడగు నక్బరు, సింహాసన మధిరోహించువఱకును వంగదేశము పఠానుల స్వతంత్రపాల

నములోనే యుండెను. అవివేకియగు దాయూదుఖానుఁడొక చెడుముహూర్తమున సాహసించి, నిద్రించుచున్న సింగమును దనచేతులతో మేలుకొలిపెను. అతఁడుచేసిన యీ దుడుకు కార్యమునకు ఫలము వెంటనే లభించినది. అక్బరుని సేనాధిపతియగు మణియమ్ఖా ననునాతఁడు రణరంగమున నాతని నోడించెను. దాయూదు సింహాసనమును గోల్పోయెను. 982-వ సంవత్సరములో దాయూదుఖానుతనతోడివారలతోఁ గూడ నోరిస్సా దేశమునకు బాఱిపోయెను. వంగదేశము మొగలాయీలచేతఁ బడియెను. పఠానులోరిస్సాలో రాజ్యము స్థాపించుకొనిరి. వారి నోరిస్సానుండి లేవఁగొట్టుట మొగలాయీలకుఁ జాలకష్టమయిన పనిగానుండెను. తుదకు వంగశకము 986-వ సంవత్సరములో రాజప్రతినిధియగు ఖాన్ జహాఖా ననునతఁడు పఠానులను రెండవపర్యాయ మోడించి యొరిస్సాను చక్రవర్తియధికారము క్రిందికిఁ దీసికొనెను. తరువాత నల్లరులు బయలువెడలెను. వంగదేశమునఁ బన్నులువసూలు చేయుటలో నక్బరొక క్రొత్తసెటిలుమెంటు పద్ధతి నేర్పాటుచేసెను. అందుమూలమున నచ్చటి జాగీరుదార్లును, భూస్వాములును, నసూయజెందిరి. వారిశాశ్వత స్వాస్థ్యములను సంరక్షించుకొనుట కాయుధములను జేతఁ బూనిరి, ఇదేసమయమని పఠానులు మరల ధ్వజమెత్తిరి. తమలో, కటుల్ ఖా ననునతని ప్రధానునిగాఁజేసి యొరిస్సాను మరలఁ దమయధికారముక్రిందికిఁ దీసికొనిరి. సమయమును

గని వెట్టి తమశక్తిసామర్థ్యముల నగపఱచి మిథునపురము విష్ణుపురములను రెండుజిల్లాలనుగూడ పఠానులు వశపఱచు కొనిరి. ఈ రెండుమండలములు నోరిస్సారాజ్యములోఁ జేరి నవికావు.

చక్రవర్తిప్రతినిధియగు ఖాన్ అజీమును, నాతని తరువాత ప్రతినిధి షహాభాజుఖానును గూడశత్రువులనుండి యీ ప్రదేశములను లాగుకొనలేక పోయిరి. తుదకీ దుష్కరకార్య నిర్వహణమునకు హిందూయోధుఁ డొకఁడు నియమింపబడి యెను.

నూతన మతాభిమానావేశమై హిమాలయపర్వత పంక్తినుండి మహమ్మదీయ సేనాప్రవాహము మన దేశమునకుఁ దోసికొనివచ్చినప్పుడు పృథ్వీరాజును, మఱికొందఱు రాజపుత్రవీరులును, తమనిరుపమాన శౌర్యముచే దాని నాఁపి హిందూదేశమును గాపాడిరి. కాని, అయ్యో! హిందూదేశమా! నీవనుగంటుటయే భగవదుద్దేశము కాఁబోలును. రాజపుత్రవీరు లైకమత్యముతోఁ దమ బలమభివృద్ధిచేసి కొనుటకుబదులు తమలోఁడాము గలహించిరి. విసుఁగుజెందకుండఁ బూనికతోఁ జేసిన ప్రయత్నములవలన మహమ్మదీయులు హిందూరాజ్యముల నొక్కటొక్కటిగ నొడిసికొనిరి. తుదకు ఢిల్లీయందు వారిరాజ్యమును స్థాపించిరి. చాలకాలము వఱకిట్లు మహమ్మదీయులు జయముల నందుచున్నను నొక్క-మాఱుగ క్షత్రియజన్మలగు రసపుత్రుల నణఁగఁ దొక్క-

లేకపోయిరి. రాజపుత్త్రులలోఁ జాలభాగ మెప్పుడును స్వాతంత్రులుగనే యుండుచువచ్చిరి. ఇదిమొదలు మహమ్మదీయ ప్రభుత్వము పూర్ణముగ విచ్ఛేదమగు వఱకును బరాక్రమైన జీవనులగు రాజపుత్త్రులు యవనులతోఁ దఱచుగా యుద్ధమునకుఁ గాలుద్రవ్వుచునే యుండెడివారు. అనేకసమయములలోఁ మహమ్మదీయులఁ బలాయనులను గావించుచువచ్చిరి. అయినను గ్రమక్రమముగ ఢిల్లీసార్వభౌమునకుఁ గప్పము గట్టవలయునని చాలమంది రాజపుత్త్రులు నిర్బంధింపఁబడిరి. క్రమక్రమముగ రజపుతుల పరాక్రమమును క్షీణించినది. వారు పురాతనగౌరవప్రతిష్ఠలను నిలుపుకొనుటయందలక్ష్యభావము వహించిరి. చక్రవర్తి కుటుంబముతో సంబంధ బాంధవ్యములు చేసికొనుట మొదలగు నుపాయములచే వారియనుగ్రహసంపాదనముఁ జేయ మొదలుపెట్టిరి. ఇఁకఁ జక్రవర్తులో! పరాక్రమవంతులగునట్టి శత్రువుల నెవ్విధమునైనఁ దనకు లోబఱచుకొనవలయుననుతలంపున రాజపుత్త్రులతో బంధుత్వమును స్నేహము నభివృద్ధి చేసికొనుచుండిరి. ఆకాలమున సామంతరాజులందఱుఁ గ్రమగ్రమముగఁ జక్రవర్తి సేవకులు కాఁజొచ్చిరి. ధీవిశారదుఁ డగు నక్బరుచక్రవర్తి పూర్వపు సార్వభౌములకంటె నన్నివిషయములందును జాలఁ దెలివి గలవాఁడు. హిందూరాజ్యమునుబరిపాలించుటకు స్వదేశస్థులే తగినవారనియు, విదేశీయులనర్హులనియు, యుద్ధమునందుఁ గాని పరిపాలనమునందుఁగాని రాజపుతులతో సమానులు

లేరనియు యక్బరునకు నమ్మకము. కావుననే యక్బరు సర్వసామాన్యముగ హిందూదేశనివాసులనే, యందుముఖ్యముగ రసపుత్రులనే, తనప్రభుత్వమున ముఖ్యోద్యోగులుగ నియమించెను. మనకథాకాలమున నక్బరుకడ నున్నతోద్యోగమున నున్న రాజపుత్రులలో, రాజగు మానసింహుఁడగ్రగణ్యుఁడు. అక్బరునికుమారుఁడగు సలీమున కీతఁడు బావమఱఁది. అజీమ్ ఖానుఁడును, షాబాన్ ఖానుఁడును, విఫలప్రయత్నులై పోవ నక్బరీ పరాక్రమశాలిని బెంగాలు బీహారు దేశములకు, బరిపాలకునిగఁ బంపెను.

997-వ సంవత్సరములో మానసింహుఁడు పాట్నా చేరి యక్కడి యల్లరుల నణచివైచెను. మరుసటి సంవత్సరమున నోరిస్సాపై దండువెడలెను. మానసింగు పాట్నాకు వచ్చి నప్పుడు వంగదేశమునఁ దనకుఁ బ్రతినిధిగ సయ్యదు ఖానునను నతనిని నియమించివచ్చెను. ఒరిస్సాపై కేగుచు నిప్పుడు సయ్యదుఖానునకాతనిసైన్యముతోఁగూడ బరడ్వాను, నొద్దకువచ్చి తన్ను గలిసికొనుమని యుత్తమువ్రాసెను.

మానసింగు బరడ్వాను జేరెను. సయ్యదు రాలేదు. ఇట్లు వర్తమానముమాత్ర మంపెను. 'సైన్యమును సమకూర్చుటలోఁ జాలనాలస్యముగాకతప్పదు. అప్పటికి వర్షకాలము వచ్చును. వర్షకాలమున సైన్యములతోఁ బ్రయాణము సలుపుటదుర్ఘటము. కావున నదిగతించువరకును మీరటవిడిసి

యుండురేని నా సైన్యముతో వచ్చి చేరెదను' అంతకంటె వేరు మార్గము లేనందున నాతఁడు చెప్పినరీతిగఁ దారుకేశ్వర నదీ తీరముననున్న జహానబాదునగరమున, సేనలను విడియించి మానసింహుఁడు సయ్యాదు కొఱ కెదురు చూచుచుండెను.

తానూరకుండుటనుజూచి కటుల్ ఖానుఁడు దేశమును గొల్లగొట్టుటకై బయలుదేరినాఁడనియు సమీపమునఁ గొన్ని మైళ్ళలలోనున్నవాఁడనియు జహానబాదులోనున్న మానసింహునకొక సమాచారము వచ్చెను. మానసింగు పరిపరి విధముల చింతించెను. శత్రువెక్కడనుండెనో, యాతని యుద్దేశమేమియో యాతఁడేమి చేయుచుండెనో మొదలగు వృత్తాంతముల నిజమును తెలిసికొని రానొక యుద్యోగిని బంప వలయునని నిశ్చయించెను. అప్పుడాతని ప్రియపుత్రుఁడగు జగత్సింహు డాతనితోఁగూడ నున్నవాడు. శత్రువుల సమాచారములను తెలిసికొనుటకై పోవలయునని జగత్సింగుకూడ నాత్రము నొందుచుండెను. అది యెఱిఁగి మానసింగునూఱుగు రాశ్వికులతో జగత్సింగును శత్రుసమాచారములను కనుగొనుటకుఁ బంపెను. రాజపుత్రుఁడు తనపనిని నెఱవేర్చుకొని మరలెను. అతఁడు మరల జహానబాదునకుఁ బోవుచు మార్గమధ్యమునఁ జదువరులకు బరిచయుఁ డయ్యెను.

---

## యువకుఁడైన సేనాధిపతి



జగత్సింగు తండ్రికడకు వచ్చెను. 'పఠానులు లించుమించేఁబది వేలున్నారు. వారిప్పుడు ధారాపుర సమీపమున విడిసియున్నారు. చుట్టుప్రక్కలఁబల్లెలఁగొల్లగొట్టుచున్నారు. కొన్నిదుర్గములనుగూడఁ బట్టుకొనిరి. జయమును సంపాదించుచున్నారు. ఎదిరించువారులేక నిర్భయముగ నున్నారు. అనివిన్నవించెను. మానసింహుఁడు వారిదౌర్జన్యము నాక్షణమె యణంచివేయవలయునని యూహించెను. కాని, యా పని సామాన్యమయినది కాదు. మిగులఁ గష్టము. కర్తవ్యమును నిశ్చయించుటకై యాతఁడీ దండయాత్రయందుఁ దనతోఁ గూడవచ్చిన సేనానాయకులందఱఁగూర్చి సభ చేసెను. అందాతఁడిట్లు చెప్పెను.

'ఆదినమున కాదినము, గ్రామముతరువాత గ్రామము పరగణా వెంట పరగణా, క్రమక్రమముగా చక్రవర్తిచేతి నుండి దాఁటిపోవుచుండెను. మనమిప్పుడు పఠానుల నణంచి తీరవలయు, కాని, ఇదియెట్లు? వారిబల మతివిస్తారముగ నున్నది. మఱియు, వారుకోటలోపలనుండి రణమొనర్పఁ గలరు. మనమిప్పుడు వారినెదుర్కొని జయించినను; వారి నాశనమొనర్పఁ జాలము. కోటనుండి వెడలగొట్టలేము. ఒక వేళనట్టియెడమనమే యోడిపోవుటసంభవించెనేని యాశ్రయ విహీనమైన యా శత్రుప్రదేశమున మనమువారిచేఁ జిక్కి-

నాసనముగునుము. ఆలోచనా విహీనమైన యీ సాహస కార్యముచేఁ జక్రవర్తిసైనికుల ప్రాణముల నెన్నిటినో గోలు పోవలసిన యిచ్చుటయేగాక యొరిస్సా నెప్పటికైన జయింపఁ గలుగుదు మనునాశకూడ లేకుండఁ జేసికొనినవార మగుదుము. కావున సయ్యదుఖాను వచ్చువఱకును మనమిట నిరీక్షించుచుండుటయే కర్తవ్యమని నాకుఁ దోచుచున్నది. కాని, యీలోపున శత్రువులు చెలరేఁగకుండ నాపుటకై తగిన యేర్పాటుల శీఘ్రముగఁ జేయవలసియుండును. మీయభిప్రాయఁమేమి?

'సయ్యదువచ్చువఱకును వేచియుండుటయే యుక్తము' అని వృద్ధోద్యోగులందఱుఁ బ్రతివచనం బిచ్చిరి.

మాన—'శత్రుల నాపుటకై సమర్థుఁడగు నొకనియాధిపత్యముక్రిందఁ గొలదిసైన్యము నంపుటమేలని నాయభిప్రాయము. సైన్యమునంతను బంపి కోల్పోవుటకంటె నిది మంచిది'

వృద్ధు—'మహారాజా! యావత్సైన్యము నంపినను గెలుపొనఁగూడదని భయమొందుచున్నప్పుడు వేఱుగఁగొలది సైన్యమునంపినఁ బ్రయోజనమేమి?'

'రణరంగమునకు శత్రువుల కెదురుగఁ బంపవలయునని నాయభిప్రాయముకాదు. పల్లెలపై బఠానులు గుంపులు గుంపులుగఁబడి కడా పాడుచేయుచున్నవారు. కొలఁదిసైన్యమైనను రహస్యముగ దాఁగియుండి రణమొనర్చినచో శత్రు సమూహము నాఁపఁగల్గుదురని నాయుద్దేశము'

'మహారాజా! అమోఘమైన నాశమున కిష్టపడి యెవఁడట్టి సైన్యాధికారమును వహించును?'

మానసింహుఁ డాగ్రహమున బొమ్ములుముడివడనిట్లని యెను. 'ఏమీ! మృత్యువనినఁ దృణప్రాయముగ నెంచెడి నిందఱు రాజపుత్త్రిలలో, నిందఱు మొగలాయీలలో, నొక్కని హృదయకోశమునుండియు నూపిరాడుచుండుట లేదా?'

ఆక్షణమే కొందఱు మొగలాయీలును, గొందఱు రసపుత్త్రిలును, లేచి 'రణమున కేగ మేముసిద్ధముగ నున్నాము' అనిరి. అట జగత్సింగుగూడ నుండెను. అక్కడనున్న యందఱిలో నాతఁడు మిగుల పసివాఁడు. వారి వెనుకనుండి యాతఁడు 'మీయాజ్ఞ యయ్యేనేని చక్రవర్తి కార్యమును నిర్వహించుటకు నేనుగూడ సిద్ధముగ నున్నాఁడను.' అని యెను.

'ఆ! అట్లేలకాఁగూడదు?' అని మానసింగు గారవమున మాఱుపలికెను.

'రాజపుత్త్రిలును, మొగలాయీలును, నింతలో పౌరుషహీనులనిపించుకొనరని నాకు ధైర్యము కలిగినది. అట్లయిన నపాయకరమైన యీపనిని నిర్వహించుటకుమీరందఱును సిద్ధముగ నున్నట్లేకదా? ఇప్పుడిందెవ్వ రీపనికి నియమింతుము?' అని యాతఁ డనియెను.

అందొక సభ్యుడు నవ్వుచు నిట్లు చెప్పెను.

'మహారాజా! ఇప్పుడిటుల చాలమంది ముందంజవేసి వచ్చుట జయసూచకము. వీరందఱు నీపనికై పంతములాడు

చున్నవారు, ఇందెవఁడు కొలది సైన్యముతో నేగుట కిష్టపడునో వాని నీకార్యమునకు నియమింపుడు.'

'ఔనౌను. ఇదిమంచి యాలోచన' అని చెప్పుచు మానసింహుఁడు మొట్టమొదట తనకుఁ దానే యీపనికి ముందండవేసి వచ్చిన యాతనితో 'నీవెంతసైన్యముతో శత్రువులపై కేగెదవు' అనియడిగెను.

'పదునేనువేలతో అట్లనుగ్రహింపుము'.

'అట్లు చేయవలనుకాదు. పదునేనువేల వాహిని నిందుఁడి విడఁదీసితిమేని నిఁక నిటచాలినంతసైన్యముండదు. పదివేలతోఁ బోవసిద్ధముగనున్న శూరుఁడెవఁడు?'

సేనానాయకు లందఱూరకుండిరి. తుదకు యశవంత సింగు పదివేలకును సైన్యాధిపత్యమును దనకిప్పింపుమని యడిగెను. అతఁడు రాజపుత్త్రుఁడు. మానసింహునకిష్టుఁడు. మానసింహుఁడు వారలనందఱ సంతోషముతోఁ గలయఁజూచెను. ఇంతలో జగత్సింగు లేచెను. అతనిదృష్టియాతనిపైఁ బ్రసరించెను. రాజదృష్టియాతనిపైఁ బడెను. ఆతఁడు వినయముతో 'మహారాజా! మీయనుగ్రహముండెనేని నేనయిదువేలసైన్యముతోఁబోయి కటుల్‌ఖానుని సువర్ణరేఖానది యావలియొడ్డునకుఁ దరిమివేయఁగలను' అనియెను.

మానసింహుఁ డూరకుండెను. సభ్యులు గుసగుసలాడుచుండిరి. కొంచెముసేపుండి 'కుమారా! రసపుత్త్రవీరులందఱును నిన్నుఁజూచి గర్వపడవలసినదే. అది నే నెఱుఁగుదును. కాని బిడ్డా! నీవు చాలదుడుకువాఁడవు' అనియెను.

జగత్సింగు చేతులుజోడించి 'తండ్రీ! నా ప్రతినఁ జెల్లించుకొననేరక చక్రవర్తిసేనల వ్యర్థముగఁ గోలుపుచ్చితి నేని నాకర్హ దండనము గావింపుడు' అని ప్రత్యుత్తరమిచ్చెను.

మానసింహుఁ డొక్కించుక యోచించి 'కుమారా! ఇటువినుము. రాజపుత్రోచితమైన నీస్వేచ్ఛా పరాక్రమమునకు నేనేలయభ్యంతరముఁ జెప్పవలయును? అట్లభ్యంతరము కలుగఁ జేయుట భగవదుద్దేశము కానేరదు. కావున నీకార్యమునకు నిన్నే నియమించితి' అనియెను.

ఇట్లు చెప్పుచు మానసింహుఁ డత్యంతాప్యాయముగ నాతనిఁగౌఁగిలించుకొని, సెలవొసంగెను.



## అయిదవ ప్రకరణము

## గరమందరము

జగత్సింహుఁడు ప్రయాణముచేసిన విష్ణుపురమునుండి జహనబాదునకుఁ బోవు బాటయొక్క గుఱుతు లిప్పటికి నున్నవి. ఆబాటకు దక్షిణమున కొంతదూరములో గరమందరమను నగరమొకటి యున్నది. దేవాలయమున జగత్సింహునిగలిసికొనినస్త్రీ లీపట్టణమునకే పోయియుండిరి. ఈ నగరమునఁ బురాతన దుర్గములుచాలఁగనున్నవి. బహుశః దానికాపేరు వానిమూలముననే వచ్చియుండును. ఆమోదరానది దానిగుండఁ బ్రవహించుచుండును. మూఁడుకోణములు

గానున్న యాపట్టణమునకు మలఁపుతిరిగి రెండువైపుల నానది వ్యాపించియుండెను. మూఁడవప్రక్కఁ బర్వతమును దొలిచి నిర్మించిన కోటగలదు. ఆకోటయొక్క శిరోభాగమున, నది మొట్టమొదటఁ బట్టణమున నెటఁ బ్రవేశించియుండెనో యాతావున, నాకసమునంటుచు నీటిలో విశాలమైన దుర్గమొకటి నిర్మింపఁబడియుండెను. అదియంతయు నల్లరాతితోఁ గట్టఁబడినది. అభేద్యమగు నాదుర్గముయొక్క పాడైపోయిన విశాలోన్నతభాగములిప్పుడుకూడ గనఁబడుచున్నవి. కాలమాహాత్మ్యమున నందలికట్టడములన్నియుఁ గూలిపోయి క్రిందిభాగములింకను గన్పట్టుచున్నవి. వెలుపలిభాగములఁ జింత, మఱ్ఱి మొదలగు వివిధవృక్షములును, మాధవియున్నగు పొదలును, నరణ్యముల వలెబెఱిఁగి, పాములకును, దోడేళ్ళు మొదలగు క్రూరజంతువులకును, నివాసస్థానములయ్యెను. నదీతీరమున మఱికొన్ని దుర్గములున్నవి. వానియందేకవంశీయులగు కొందఱు భాగ్యవంతులు కాపురమున్నారు. కాని, మనకథకును వీనికిని సంబంధమేమియును లేదు. మొదటిదుర్గమే మనకు గావలసినది.

ఢిల్లీ సార్వభౌముఁ డగు బాలిన్, వంగదేశమును జయింప నేతెంచినప్పుడు జయధారసింహుఁ డను యోధుఁ డొకఁ డాతనితోఁగూడ నుండెను. బాలినునకు జయమొనఁగూడిన నాఁటిరాత్రి చక్రవర్తిపక్షమున నాతఁ డత్యద్భుత శౌర్యమును జూపియున్నాఁడు. అతఁడొనర్చిన సేవకు సంతసమంది చక్రవర్తి గరమందరమను జాగీరు నాతనికి బహుమాన

మిచ్చెను. ఈజాగీరుదారును వంశీయులు క్రిమక్రిమముగ పరాక్రిమవంతులై కోటలనుగట్టుకొని వంగ దేశప్రభువును నిరాకరించుచువచ్చిరి. వంగశకము 998–వ సంవత్సరములో పైనవివరించిన యాదుర్గము వీరేంద్రసింహుని స్వాధీనమందుండెను. ఈతఁడు జయధారసింహుని వంశీయుఁడు.

ఈతనిచిన్నతనములోఁ దండ్రికిని పితనికిని సరిపడినది కాదు. ఇతఁడు దురహంకారి. తాలిమి లేనివాఁడు. తండ్రి యానతిప్రికార మొకప్పుడును బ్రవర్తించినవాఁడు కాఁడు. అందుచేఁ దండ్రియును దనయుఁడును నెప్పుడును గలహించుచునే యుండిరి. ఎప్పుడును వాదప్రతివాదములాడుచునే యుండెడివారు. వీరియింటి సమీపమున నొకభూస్వామి యున్నాఁడు. ఆతనికి బుత్త్రిలులేరు. ఒక్కకుమార్తె యుండెను. ఆమెను దనకుమారునకుఁ బరిణయము చేయవలయునని వీరేంద్రసింహుని తండ్రి నిశ్చయించెను. ఈసంబంధమును జేసినచో వీరేంద్రునకు గొప్పయాస్తి లభించునని యాతని యుద్దేశము. ఇంతేకాదు, ఆకన్నకూడ చాల సౌందర్యవతి. ఏవిధముచేఁ జూచినను ముసలివానిదృష్టికీవివాహము మిక్కిలి యనుకూలముగాఁ గాన్పించెను. వివాహ ప్రయత్నములన్నియుఁ జేసెను. దీనినంతను ద్రోసివైచి వీరేంద్రసింహుఁడు తమకు సమీపముననున్న నిరాధారురాలును బేదయు నగు నొక యనాధస్త్రీతనయను రహస్యముగఁ బరిణయమయ్యెను. ఈవార్త తండ్రిచెవులఁబడియెను. పట్టరాని కోపమువచ్చెను. తనయుని నావలకుఁ దరిమివైచెను. తండ్రిచే లేవఁగొట్టఁబడి

వీరేంద్రుఁడు ఢిల్లీకి వచ్చెను. సేనలో సైనికుఁడుగా జేరవలయు నని యాతని యుద్దేశము. ఆతని భార్య యప్పుడు గర్భవతి. ఆమెను దనతోఁ దీసికొనిపోలేదు. తల్లి యింటికడ నుంచెను.

కుమారుఁడు వెడలిపోయినపిమ్మట నా ముసలివాఁడు చాల శోకించెను. పశ్చాత్తాపపడెను. కుమారునివృత్తాంతములను దెలిసికొన శ్రద్ధవహించెను. అన్ని విధములఁ బ్రయత్నించెను. కాని, నిష్ఫలమయ్యెను. పిమ్మట గోడలిని సన్మానించి సంతోషపూర్వకముగా పేదరాలగు నామె తల్లి యింటనుండి తనకడకుఁ దీసికొనివచ్చెను. పిదప వీరేంద్రసింహుని భార్య యొక యాఁడుశిశువునుగని కొలది దినములలోనే కాలధర్మము నొందెను.

ఢిల్లీ జేరి వీరేంద్రసింహుఁడు సైనికవృత్తి నవలంభించెని. చక్రవర్తి రాజపుత్రసైన్యములోఁ జేరెను. కొలఁది కాలములోనే తన శక్తిసామర్థ్యములఁజూపి యందున్నతాధికారమును బడసెను. కొన్ని సంవత్సరములు గడచినవి. వీరేంద్రసింహుఁడు చాల ద్రవ్యమును సంపాదించెను. గొప్ప పేరు తెచ్చుకొనియెను. ఇంతలో నాతనితండ్రి మరణించెను. ఆ సమాచారమునువిని యాతఁడిట్లు వితర్కించుకొనెను. "ఇంక మనమింత దూరదేశమున నుండుటనగత్యము. సేవకావృత్తి యునవసరమే" ఆతఁడు మరలఁదన స్వగృహమును జేరెను. ఢిల్లీ నుండి యాతఁడెందఱనో మనుష్యులను దనతోఁగూడఁ దీసికొనివచ్చినాఁడు. అందొక పరిచారికయు, నొక సన్యాసియు నుండిరి. మనకథయందు వీరిరువురతోడను మనకుఁ బనియుం

డును. పరిచారిక పేరు 'విమల' సన్న్యాసి పేరు 'అభిరామస్వామి'.

మనమిదివఱకు విమలను పరిచారికయనిపిలుచుచున్నారము. ముందునునట్లే పిలుతుముగాక! ఆమె వీరేంద్రుని పనికత్తెయని యందఱు ననుకొనెడివారు. వీరేంద్రసింహుని గృహకృత్య విషయములన్నియు నామెయే నిర్వహించుచుండెను. విశేషించి యాతనికుమార్తె విషయమున మిగుల శ్రద్ధ తీసుకొనుచుండెను— కోటలోనామె నివసించియుండుటకింక వేఱు కారణములేవియు గనఁబడవు. అందుచే నేనామెను బరిచారికయని పిలుచుచున్నాఁడను. కాని, యామెయందు బరిచారికాలక్షణము లేవియుఁ గాన్పించుట లేదు. ఆమెను గోటలోనివారందరు గృహయజమానురాలుగ గౌరవించుచుండిరి. మిక్కిలి విధేయతను జూపుచుండిరి. ఆమెముఖలక్షణములనుబట్టిచూడ యౌవ్వనమున నామె యత్యధిక సౌందర్యవతియని చూపట్టుచున్నది. ప్రత్యూషసమయమున నస్తమింపనున్న చంద్రరేఖవలె నామె సౌందర్యతేజోకిరణ లేశమిప్పటికిని బ్రకాశించుచున్నది. గజపతి విద్యాదిగ్గజుఁడను నతఁడొక డాకోటలో నివసించియుండెను. అతఁడభిరామస్వామిశిష్యుఁడు. శాస్త్రపాండిత్య సంపాదనవిషయమున నెట్లున్నను, చాతుర్యముగా మాటలాడి హాస్యగాఁ డనిపించుకొనవలయునని యతనికిఁ జాల నభిలాషకలదు. అతడు విమలనుజూచి "ఈపనికత్తె నేతిముద్ద తపేలావలె మనోహరమయినది. మోహాగ్ని చల్లారినకొలఁదిని యీామె శరీరమంతకంతకు బింకమునొందుచున్నది" అని చెప్పుచుండును.

తన్నీరీతిగ నెగతాళిమాటలాడినది మొదలు విమల, యాతనికి 'రసికదాసస్వామి' యను నెగతాళి నామమొసఁగి పిలుచుచుండెను. రూపము నడవడి యటుండనిండు. విమల నాగరికత, సంభాషణతీరుఁ బరికించినచో నామెను సామాన్య పరిచారికయని భావింపవలనుపడదు. ఆమె చాలాకాలము చక్రవర్తి జనానాలో నుండెనని చాలమంది చెప్పెదరు. అది సత్యమో యసత్యమో విమలయే చెప్పవలయు. కాని, యీ విషయమునమాత్ర మెప్పుడును నామె యే సూచనయుఁ జేసి యుండినట్లు కనబడదు.

విమల వితంతువా? భూషణములనుధరించిన దే! విధవ వలె పర్వదినముల నుపవాసము చేయుచుండుట లేదే! అయి దువవలెనే సంచరించుచున్నది.

తిలోత్తమ నామె యతిగారాబముతోఁ జూచుచుం డును. నిజముగా నామెయెడల నెంతో ప్రేమ, ఆమెస్వభావ మాలయములో స్పష్టపడినదికదా! విమలయన్నఁ దిలోత్త మకుగూడ నతిప్రేమ. వీరేంద్రసింహునితో వచ్చిన యభి రామస్వామి సర్వదా యింటికడనుండఁడు. తఱచు దేశము తిరుగుచుండును. ఒకటి రెండుమాసములు గరమందరమున నున్న నొకటిరెండు నెలలు తిరుగుచుండును. కోటలోని వారును, దదితర జనులును, నభిరామస్వామి వీరేంద్రసింహు నకు నాధ్యాత్మికగురువని తలంచెదరు. అందులకుఁ దగినట్లే వీరేంద్రుఁడాతని యెఱుక లేకుండ నేకార్యమును జేయఁడు. అతని నెంతయో పూజించుచుండును. ఆతఁడు చెప్పినట్లు

ప్రతివిషయమును జరుగుచుండును. అభిరామస్వామియనుభవశాలి. కుశాగ్రబుద్ధి మఱియు జితేంద్రియుఁడు. ప్రాపంచకవిషయములపై మనసుపోనీయఁడు. అవసరమున్నప్పుడింద్రియవృత్తులను సాధించి శాంతముగ లోకవ్యాపారములఁ జొనిపి నడిపింపఁగలఁడు. ఇఁక నట్టిమహనీయుని యాలోచనలు కొనసాగుట కేమికొదవ? అహంకార స్వభావుఁడై తాలిమిలేని వీరేంద్రసింహుని యోచనలకంటె నాతని యోచనలు జయప్రదములనిన నందాశ్చర్యమేమున్నది?

విమలయు నభిరామస్వామియునే గాకుండ నాష్మాని యను నింకొక పరిచారికకూడ వీరేంద్రసింహునితో వచ్చి యుండెను.



## ఆఱవ ప్రకరణము

### అభిరామస్వామి యాలోచన

విమలా తిలోత్తమలు సుఖముగా నింటికిఁ జేరిరి. మూఁడు నాలుగుదినములు గడచెను. ఒకనాఁడు వీరేంద్రసింహుఁడు గృహకార్య నిర్వహణస్థానమున మసలందుపైఁ గూర్చుండ నభిరామస్వామి విచ్చేసెను. వీరేంద్రుఁడు లేచి స్వామికొక దర్భాసన మొసంగెను. అభిరాముఁ డందుపైఁ గూర్చుండెను. ఆతనియనుజ్ఞఁగైకొని వీరేంద్రుఁడు మరల మసలందుపై నుపవిష్టుండయ్యెను.

"వీరేంద్రా! ఈదినమున నీతోఁ గొన్నిముఖ్యములైన సంగతులు మాటలాడవలసియున్నది"

'స్వామీ! అవహితుఁడను. అనుజ్ఞయిండు'

'మొగలాయీలకును బఠానులకును గొలఁది కాలములో నొక గొప్పయుద్ధము జరుగనున్నది.'

'ఔను. ఏదోఒక గొప్పయుపద్రవము బహుశః జరుగఁగలదు..'

'ఇప్పుడు నీవేమి చేయ నెంచినాఁడవు?'

'ఈహస్తము శత్రుహతముఁ జేయకుండ నూరకుండు నదికాదు. రానిండు.'

'వీరేంద్రా ! నీవాడినవాక్యములు నీవంటి వీరాగ్రేసరునకుఁదగినవే. అయినను, జయముమాత్ర మొక్కపరాక్రమ విలాసమువలననే సమకూడునదికాదు. సంధివిగ్రహములను గూర్చినపద్ధతులను బాగుగ నెఱుంగుటనుబట్టి యుండును. నీవు పరాక్రమశాలివి. వీరాగ్రగణ్యుఁడవు. కాని, నీ సైన్యము వేయికి మించిలేదు. శత్రువులు నీకంటె నూఱు మడుఁగులధికబలమును గలిగియున్నారు. ఎంత యోధుఁడయినను నట్టిశత్రువితో యుద్ధమునకు డీకొనునా ? లెక్కకు నీ సైన్యముకంటె మొగలాయీల యొక్కయు బఠానుల యొక్కయువాహినులు చాలహెచ్చుగనున్నవి. నీవందొక్కరి సాహాయ్యమును గలిగియుండినఁగాని రెండవవారి చేతినుండి నీవెట్లు దాటిపోఁగలవు? నేనిట్లంటినని కోపింపకుము. బాగుగ యోచింపుము. నీకిరువురును విరోధులైన నేమి ప్రయోజ

నము! ఎవరితోనైన శత్రుత్వమనర్థకమే. అట్టియెడ నొకరికి బదులిరువురితో వైరమెందులకు? కావున నందొకరితో నిష్ట ముగనుండిన మేలని నాయభిప్రాయము.'

వీరేంద్రసింహుఁడు చాలసేపూరకుండి యిట్లనియె.

'అయ్యా! అయిన నన్నెవరితోఁ జేరుమనియెదరు?'

'జయమెప్పుడును న్యాయపక్షమున నుండును, ఏపక్ష మున న్యాయముండునో, యాపక్షమునఁ జేరుము. రాజద్రోహము మహాపాపము చక్రవర్తిపక్ష మంగీకరింపుము.'

'చక్రవర్తి యెవరు? మొగలాయీలును, పఠానులును రాజ్యమునకుఁ బోరాడుచుండుట లేదా?'

కప్పమెవరు గైకొనుచుందురో వారే చక్రవర్తులు.'

'అక్బరా?'

'నిశ్చయముగ నక్బరే.'

వీరేంద్రుని మొగమునఁ గోపచిహ్నములు కాన్పించెను. క్రమక్రమముగఁ గన్నులెఱ్ఱవడియెను. ఆ లక్షణములఁ జూచి యభిరామస్వామి యిట్లనియెను.

'వీరేంద్రా! కోపమునణంపుము. ఢిల్లీ సార్వభౌము నితోఁ జేరుము. మానసింహునితోఁగాదు'

వీరేంద్రుఁడు కుడిహస్తమునుజూఁచి యెడమ వ్రేలితో దానినిజూపుచు 'అయ్యా! మీ యాశీర్వచన ప్రభావమున నీహస్తమును మానసింహుని రక్తములో ముంచెదఁగాక!' అనియెను.

'శాంతింపుము. శాంతింపుము. అహంకారమభివృద్ధికి

భంగకరము. మునుపటి తప్పిదమున కేయుపాయముచేనైన మానసింహుని దండింపుము. అక్బరుతో నీకువైరమేల?'

'నేను చక్రవర్తింజేరి యేసేనాధిపతి చేతిక్రింద రణమొనర్చెదను? ఎవరికి సాయమొనర్తును? ఎవరిని గౌరవింతును? మానసింహునా? అట్లైనన్నఁడును సరిపడదు—కాలుచేయి యాడుచున్నంతవఱకు—కంఠమున జీవమున్నంతవఱకు—వీరేంద్రసింహుఁ డట్టిపని చేయఁబోఁడు' అని క్రోధముగా ననెను.

అభిరామస్వామి ఖిన్నుఁడై యూరకుండెను. అట్లు కొంచెముసేపుండి 'అయినఁ బఠానులలోఁ జేరుటయే మంచిదనెదవా!' అనియెను.

'ఎవరితోనైన మైత్రి సంపాదించుట నాకంత యగత్యమా?'

'ఔను. అగత్యమే'

'అయినఁ బఠానులపక్షమే యవలంభించెదను.'

స్వామి నిట్టూర్పువిడిచెను. మౌనము వహించెను. అతనికి నేత్రముల బాష్పము లుదయించెను. వీరేంద్రుఁడు మహాశ్చర్యముతో 'స్వామీ! నాయపరాధములను క్షమింపుఁడు. ఎఱుంగక నేనేమి నేరములఁ జేసితినో యానతిచ్చి నన్ననుగ్రహింపుడు' అనియెను. అభిరామస్వామి నేత్రముల దుడిచికొని చెప్పెను.

'వినుము. కొన్నిదినములనుండి జ్యోతిశ్శాస్త్ర గణితము జేయుచున్నాఁడను. నీకుమార్తెయందు నీకంటె నా

కెక్కువ ప్రేమయున్నదని నీ వెఱుంగుదువుగదా! ఆమె గ్రహ స్థితిని గణితము చేసినాఁడను.'

వీరేంద్రుఁ డూరక చూచుచుండెను. ఆత్రముతో 'అయ్యా! గ్రహస్థితి యెట్టులున్నది? మీ రేమి కనిపెట్టితిరి?' అనియెను.

'ఒక మొగలాయీ యుద్యోగస్తునివలన నా కొక గొప్ప యుపద్రవము రానున్నది.'

వీరేంద్రుని ముఖము నల్లవడియెను.

మొగలాయీలు నీకు శత్రువులుగా నుండిననే వారి మూలమున నీకాపద వచ్చును. వారికి నీవు స్నేహితుఁడ వైనచో నట్టిదేదియు సంభవింపదు. ఇందువలననే మొగలాయీల పక్షమున నుండుమని నీకు బోధించుచున్నాఁడను. ఈ రహస్యమును వెలిపుచ్చి నీకు వ్యథ కలుఁగ జేయుట నా యుద్దేశము కాదు. అయినను, మనుష్యప్రయత్నములు పనికిరావు కదా! యోగమును దప్పింప నెవ్వరితరము? అది జరుగక తీరునా? లేకున్న నీవస్లిందులకు నిశ్చయించుకొని యుందువు?

వీరేంద్రసింహుఁడు మూకీభావము వహించెను.

'వీరేంద్రా! కటుల్ ఖానుని రాయబారి యొకఁడు వచ్చి ద్వారముకడ నున్నాఁడు. నేనాతనిఁ జూచియే యిటకు వచ్చితిని. నేను వలదని చెప్పుటచే ద్వారపాలకుఁ డాతనిఁ జాల సేపటినుండి నీకడకు రానీయలేదు. నేను చెప్పవలసిన దేదియో చెప్పితిని. నీ వాతని నిప్పుడు రప్పింపవచ్చును అర్హమైన ప్రత్యుత్తరంబీయవచ్చును.'

వీరేంద్రుఁడు మోమెత్తి నిట్టూర్పుతో నిట్లనియెను.

'అయ్యా! తిలోత్తమను నేను చూడనంతవఱకు, నామె నాతనయయని భావింపనేలేను ఇప్పుడో! ఆమెదక్క నాకీప్రపంచమున నెవ్వరునులేరు. నేను మీయాజ్ఞానువర్తినై మెలంగెద. గతమునంతను మఱచిపోయెదను. మానసింహుని పక్షమవలంభించెదను. రాయబారిని గొనిరమ్ము.'

వీరేంద్రునాజ్ఞను సరణిని దూతను లోనికిఁ దెచ్చిరి. ఆతఁడొక యుత్తరమునిచ్చెను. అది వీరేంద్రసింహునకు, కటుల్ ఖాఁ వ్రాసినది. ఆ యుత్తరమునందలి సారాంశమిది.

'వేయిగుఱ్ఱపుదళమును, నయిదువందల మొహరీలును శీఘ్రముగఁ బంపుము. లేకున్న గరమందరముపై నిరువదివేల సైన్యముతో నెత్తివచ్చెదము.'

వీరేంద్రుడుత్తరముం జదివి యిట్లుజెప్పెను.

'రాయబారీ! మీరాజు సైన్యమును బంపనిమ్ము'

దూత, యవనతశిరస్కుండై వందనమొనర్చి పోయెను విమల చాటుననుండి యీప్రసంగమును వినెను.

—*—

## ఏడవ ప్రకరణము

### పరధ్యానము

తిలోత్తమ కోటలోని యొకగది గవాక్షములోఁ గూర్చుండియుండెను. ఆగదియామోదరానదినంటియున్నది. అదివేగముగఁ బ్రవహించుచు మర్మరధ్వనులను చేయుచుం

డెను. ఆమె ప్రవాహమందలి యొకసుడివంక వీక్షించుచుండెను మనసుమాత్ర మక్కడలేదు. పరధ్యానముతో నుండెను. సాయంతనమైనది. అస్తమించుచున్న సూర్యుని మృదుకిరణములచే నాకసమునఁ బశ్చిమాశయందలి మేఘములకు బంగారు పూఁత పూయఁబడెను. ఆబంగారు మేఘములీ నిరంతరప్రవాహోదకమున నాట్యము జేయుచుండెను. నది కావలియొడ్డున నత్యున్నత సౌధరాజియు, వృక్షపంక్తియు, నాకాశపటముపై జిత్రింపఁబడినట్లుండెను. కోటలోపల శుకపికశారికామయూరాది విహంగము లవ్యక్తమధురధ్వనులు సేయుచుండెను. రాత్రిసమీపించినతోడనే యొక విహంగ మాకసమునఁ దన ఱెక్కలవిప్పి నిశ్శబ్దముగఁ జరించుచుఁగూటికై వెదకుచుండెను రసాలవృక్ష వనమందు నామోదరానదీ జలములందును విహారమొనర్చిన మందమలయా నిలుండిప్పుడు తిలోత్తమ కుటిలాలకములతోడనో, యామెభుజములపై సొగసుగనున్న పయ్యెదతోడనో, యాటలాడుకొనుచున్నవాఁడు. తిలోత్తమ లావణ్యవతి, ఆమెనిరుపమాన రూప సంపదలను బాఠకమహాశయుల దృష్టిపథమునఁ బెట్టవలయునని నాకెంతయో యభిలాషకలదు. కాని, యది గొంతెమ్మకోరిక. నాకది సాధ్యపడునా? ఓపాఠకమహాశయా! నీయావనమున నెప్పుడైన మోహావలోకనమున శాంతమృదుప్రకాశవిశిష్టనవయావనవతీ లావణ్యమును జూచియుంటివా? ఆమెమాధురీరూపము నీ హృదయ భావములయందెన్నటికిఁబోవకుండునట్లు ముద్రించియున్నదా? ఆయప్సరసన్నిభవిగ్రహము నీయావనమున, కౌమా

రమున, వృద్ధత్వమున, కార్యభారముచే నిరవకాశముగనున్న ప్పుడు, విశ్రాంతిసమయమున, నిద్రయందు, మేలుకువను, స్వప్నమున లోపల వెలుపల నంతట నెప్పుడును, గన్పట్టు చుండెనా? అట్లు కన్పట్టుచున్నను లేశమైన హృదయకళంక మును గలుగఁజేయని పరిశుద్ధవ్యక్తియగునట్టి కన్నియ నెప్పు డైనఁ జూచియుంటివా? చూచియుండిననే తిలోత్తమ యెట్టిలావణ్యవతియో నీవు గ్రహింపఁ గలుగుదువు. కొన్ని మనోహరాకృతులు తమ యుజ్వల లావణ్య ప్రభాజాలముల మన యజ్ఞానాంధకారమును బాఱఁదోలును. మఱికొన్ని తమ శరీరకాంతిచ్ఛటలఁ గపటవిన్యాసములు నెఱపుచు మన హృదయముల విషపూరితములుగ జేయుచుండును. తిలో త్తమ రూపరేఖావిలాస మట్టిదికాదు. ఆ మధురాకృతి కుసు మపేసలము. అది తన కోమలామయ రూప సంపదల మన మనోవీధి హర్షామృతబిందువుల గురియుచుండును. వసంత కాలమున సాయం సమయమందా నీలంబులఁదూఁగాడు మంజుల మాకందాంకురంబుచాడ్పున నాకోమలాకృతి మన తలంపుల నర్తనము సేయుచుండును.

తిలోత్తమ పదునారేండ్లది. ఆమెశరీరమింకను నిండు యౌవనవతికివలెఁ బూర్ణముగ నభివృద్ధిఁ జెందియుండలేదు. ఆమె రూపరేఖలయందింకను బాల్యచిహ్న మగపడుచునేయు న్నది. ధనురాకారమై మనోహరముగనున్న యామెఫాల ప్రదేశము సంకుచితమునుగాదు. విశాలమునుగాదు. స్నిగ్ధ జ్యోత్స్నవలె శాంతిప్రపూర్ణము. ఆమె నీనీలచూర్ణ కుటిల–

కుంతలముల, భ్రూలతలను, గండభాగములను, కంఠప్రదేశమునను, భుజతలంబులను, వక్షస్థలమునను, విహరించుచుండెను. మిగిలిన కచపంక్తి వెనుకభాగమున మౌక్తికహారమున ముడువఁబడియుండెను. ధనురాకారముగఁ దీర్చినట్లున్న యాభ్రూలతలు చిత్రకారుఁడు చిత్రించినట్లొప్పుచుండెను. ఇఁక నొకఛాయామాత్ర మిచ్చియుండినయెడల నవి యేలోపమును లేక పరిపూర్ణత్వమునుబొంది యుండును. చదువరీ! హాసవిలాస పూరితములగు చంచలనేత్రములు మాత్రమే నీకుఁ బ్రియతమములా? అట్లయినఁ దిలోత్తమ నీహృదయాకర్ష మొనర్పనిరాశపడవలసినదే. ఆదృష్టులు ప్రశాంతములు. తనచూడ్కుల నామె విద్యుత్కాంతులఁ బ్రసరింపఁజేయనేరదు. ఆ కోమలనేత్రము లతి విశాలములు, నిరంతర శోభా పరిపూర్ణములు, పరిశాంత తేజో విభాసితములు. అవి పరిత్యూషసమయ నిర్మల గగనభాగంబు కరణిసుందర నీల కాంతుల మెఱయుచుండును. వీక్షించునప్పుడాసుందరి నిర్మల విశాలనేత్రముల యందెందును గాపట్యలేశమయినను గానఁబడదు. కుటిలవీక్షణముల నామె యెఱుంగదు. ఆచూడ్కులు ధారాళములు, కాపట్యశూన్యములు, హృదయభావ పరిబోధకములు, అవియే యామె హృదయనైర్మల్యము నెఱుకసేయున మోఘసూచకములు. ఆసుందరివదనము నెవ్వరైనఁ దేఱిపాఱఁజూచిన నామె యవనతముఖియగును చూడ్కులధోముఖంబులగును. తిలోత్తమ సమగ్రనాసిక యలంకార భారవహనక్లేశ మించుకయిన నెఱుంగదు.

కెంజాయరంజిల్లు నాయుల్లసితోష్ఠపుటంబు మాధురీరసార్ద్రమయి యొప్పారుచుండెను. ఆయోషములు శిరీషకుసుమపేశలములు, కించిద్వక్రభావవిలసితములు, నిరంతరమందహాసరేఖా విభాసితములు, ఆహా! మృదు మందహాసాలంకృతంబగు నాసుకుమారాధర కిసలయంబును గాంచు భాగ్యమొక్కతరినైన నీకన్నులకబ్బెనేని, నీవుసన్యాసివైనను, తత్త్వవేత్తవైనను, యువకుఁడవైనను, వృద్ధుఁడవయినను, నీజన్మమధ్యమున దానినిమఱపొందఁజాలవు. అయిన నమాయకత్వమును, బాలికాత్వమును, దప్ప నంగు వేఱొకటేదియు గోచరింపదు.

పోతఁబోసినరీతి బాగుగఁ దీర్చినట్లొప్పుచున్నను, తిలోత్తమ సుకుమారావయవములు పరస్పరానుగుణముగఁ బరిపూర్ణత్వమును బొందియుండలేదు. యౌవనప్రాదుర్భావముననో, నైసర్గిక గుణవిశేషమువలననో, యాసుందరగాత్రి మణుమాత్రమైన స్థూలమైనట్లగపడదు. అయిన నాసుకుమారశరీరావయవమ్ములన్నియుఁ బరిపూర్ణ వలయాకారమునొంది యతికోమలముగఁ గన్పట్టుచుండెను. ఆనిండయిన మణిబంధమున మార్వారీకంకణములు, నానిండయిన దండల వజ్రదీపితములగు భుజాలంకారములు, నానిండయిన వ్రేల నంగుళీయకము, నానిండయిన కటిసీమ బంగారు మొలనూలు, నానిండయిన భుజముల భుజకీర్తులు, నా నిండయిన కంఠమున రత్నహారము మెరయుచుండెను. ప్రత్యవయవమును బరిపూర్ణసౌందర్య విభాసితమైయుండెను.

తిలోత్తమయామెభవనమున గవాక్షమునఁగూర్చుండి యేమిచేయుచున్నది? సంజకెంజాయ నొప్పారుచున్నయాకసమును జూచుచుండెనా? అయిన నామె సుందరావలోకనము భూమిపైఁబ్రసరించుచున్న దేమి? నదీతీరమునుండివచ్చుమందమలయానిల సౌరభము ననుభవించుచుండెనా? అయిన, నామె ఫాలభాగమున స్వేదబిందువు లుదయించు చున్న వేమి? మలయానిలుం డామెవదనమున నొకప్రక్కనుమాత్రమే సోఁకుచున్నాఁడు. పొలములమేయుచున్న పశుగణమునుజూచుచుండెనా? అదియునుగాదు. పశుగణమింతకుఁబూర్వమే 'అంబా' యని యఱచుచుఁ దమయిండ్లకుఁ బోయియే యుండెను. కోకిలాగీతమును వినుచుండెనా? అట్లయినచో దీర్ఘాలోచన సేయుదానివలె నట్లుచూచుచున్న దేమి? లేదు. ఆమె యేమియుఁజూచుటలేదు. వినుటలేదు—తాననుభవించిన కష్టసుఖముల నెమరువేసికొనుచుండెను.

ఈబాల్యప్రాయమున నెట్టియాలోచన లామెహృదయమునాకర్షించి యుండును? ఆమె హృదయమున నేదయిన మోహాంకుర ముదయించి యపూర్వ వికారమునకు లోనుజేసెనా? అయియుండును.

ఒకపరిచారిక దీపమును గొనితెచ్చెను. ఆలోచనల విడిచి తిలోత్తమ యొకపుస్తకమును గైకొని దీపముకడఁ గూర్చుండెను. ఆమె చదువఁగలదు. అభిరామస్వామికడ సంస్కృతము నభ్యసించెను. ఆమె యేమిచదువుచున్నది? కాదంబరి. ఆపుస్తకమామెకు సంతోషజనకము కాలేదు.

కొంచెము చదివి దానినటనుంచెను. పిదప సుబంధువిరచితం బగు వాసవదత్తం గైకొనియెను. ఒక్కించుక చదివి పరధ్యానముతో నాలోచించుచుండెను. మరలఁజదివెను. మరలయోచించెను. వాసవదత్త కూడ నామెకంత మనోహరముగ లేకపోయెను. పిదప గీతగోవిందమును గైకొనెను. కొంతసేపటి వఱకది యింపుగ నేయుండెను. కాని,

'ముఖరమధీరమ్ త్యజమంజీరమ్ రిపుమివ కేళీలోలమ్'

అను గీతమును చూచునప్పటి కామెకు సిగ్గువచ్చెను. పుస్తకమును క్రిందఁబడవైచెను. ఆమెకొంతవఱకు శయ్యపైఁ గూర్చుండెను. అట, కలమును సిరాబుడ్డియు నుండెను. పరధ్యానముతో నామె యదియు నిదియు వ్రాయనారంభించెను క—స—మ — గది — తలుపు — చెట్టు — మనుష్యుఁడు ఇంక నేమేమియో——క్రమ క్రమముగ నాశయ్యయందొక భాగమంతయు నట్టివ్రాఁతలతో నిండిపోయెను. ఇఁక వ్రాయుటకుఁ దావులేదు. ఆమెచేయుచున్న దేదియో యిప్పుడు గ్రహించెను. తానుచేసినపనికయి నవ్వుకొనియెను. తానేమి వ్రాసెనో చదువుకొనియెను. ఆమె యేమి వ్రాసినది? వాసవదత్తా—— మహాశ్వేతా —— క—స—మ—ప—చెట్టు—సంజాతి—శివా—గీతగోవింద—విమలా—పొదలు—ఆకులు—కొన్నియడ్డగీతలు కొన్ని నిడుపుగీఁతలు—కొన్ని వంకరటింకరగీతలు—కోట—అది—ఇది—ఇంకను నేమివ్రాసినది?

"కుమార జగత్సింహ"

తిలోత్తమముఖము సిగ్గుచే నెఱ్ఱవడియెను. తెలివితక్కువపిల్లా! నీవు సిగ్గుపడుట కిక్కడ నెవరున్నారు?

'కుమారజగత్సింహ' తిలోత్తమ యీమాటకొకసారి రెండుసారులు, మూఁడుసారులు, లెక్క లేనన్నిసారులు చదివెను. దొంగతనముచేయునప్పటి దొంగవలె నామె తలుపు వంక జూచెను. మరలఁజూచెను. మరలజదివెను.

తనకృత్యము నెవ్వరైనఁజూచిపోవుదురను భయముచే నామెకుఁ జాలసేపు చదువధైర్యము లేకపోయెను. అతిశీఘ్రముగ జలమునుదెచ్చి వ్రాసినదంతయు, గడిగివైచెను. కాని ప్రయోజనము లేకపోయెను. ఆమె తనవస్త్రముతోఁ దుడిచివైచెను. ఇంక నేదయిన స్పష్టముగఁ గన్పట్టుచుండెనేమో యని పరీక్షించెను. ఒక గుర్తైన దానిపై లేదు. కాని, ఇంక నేదియో యున్నటులామెకుఁ గాన్పించుచుండెను. ఆమె మరలఁగడిగి శుభ్రముగఁ దుడిచివైచెను. ఇంకను నింకను గన్పట్టుచునేయున్నది. ఏమది?

'కుమారజగత్సింహ'



## ఎనిమిదవ ప్రకరణము

### విమలయాలోచనము

అభిరామస్వామి తనకుటీరములోఁ బవిత్రాసనముపైఁ గూర్చుండెను. విమల యటఁనిలువబడియుండెను. జగత్సింగునితో వారెట్లు కలిసికొనిరో యాకథనంతయు నాతనితో జెప్పుచుండెను.

'ఈదినము పదునాల్గవదినము. రేపటితో పదునేను దినములు పూర్తియగును.'

'మంచిది నీవేమినిశ్చయము చేసుకొంటివి?'

'ఈవిషయమున మీయాలోచన కావలయు, అందు లకే మిమ్ముల దర్శించితిని.'

'అట్లయిన నావిషయమున నీక నేమియు నాలో చనము సేయరాదని నా యభిప్రాయము'

విమల యూరకుండెను. మిగుల విచారమునొందెను.

'ఏల? అట్లు విచారముతో నున్నదాన వేమి?'

'ఇఁక తిలోత్తమ నేమిసేయవలయు?'

'ఏమి! తిలోత్తమ హృదయక్షేత్రమున మోహాం కురములుదయించెనా?'

కొంచెముసేపుండి విమల యిట్లనియెను.

'స్వామీ! నేను మీకడ నెంతని యీవిషయమును వెలిపెట్టుదును? ఈపదునాలుగు దినములనుండియు నహర్ని శము నామెచేష్టలంగనిపెట్టుచున్నదానను. మోహవికారము లామెహృదయమున బాగుగా వృద్ధినొందినవి.'

'నీ వాఁడుదానవు. అనురాగచిహ్న మొక్కించుక కనఁబడినతోడనే యదియెంతోఘనముగనున్నదని యూహిం తువు. విమలా! తిలోత్తమ భావిసుఖమునుగూర్చి విచా రింపకుము. ఆమెబాలిక. ప్రథమావలోకమున నామెహృదయ మించుకంత యొక్కప్రక్కకొఱఁగినది. ఈవిషయమగు ప్రసం

గము నామెకడఁ దేవకుండ నుండినచోఁ గొలఁది కాలము లోనే యూమె జగత్సింహుని మఱచిపోగలదు.'

'స్వామీ ! ఇదియట్లుకాదు. ఆమెలక్షణములను బరికింప మీరనుకొనినట్లులేవు. ఈపదునేనుదినములలోపల నామె స్వభావమున నెంతయో మార్పుజెందినది. సఖులతోఁ గాని నాతోఁగాని యుల్లాసముగా మాటలాడుటలేదు. మాతోడనే కాదు ఈనడుమనామె తఱచుగ మాటలాడియేయెఱుఁగదు. చదువుకొనుటలేదు. పుస్తకములు శయ్యాక్రింద నిద్రించుచున్నవి. పూలచెట్లెండిపోవుచున్నవి. నీరు పోయువారెవరు ? ఉపేక్ష వహించుటచే వినోదవిహంగములు కృశించుచున్నవి. వేయేల ఆమె భుజించుటలేదు. నిద్రించుటలేదు. పరిశుభ్ర వస్త్రముల ధరించుటలేదు. ఆమె మున్నెన్నఁడు నాలోచన చేసి యెఱుంగదు. ఇప్పుడో! షష్టిఘటికలు నాలోచనా నిమగ్నయై యుండెను. ఆమెవదనము వాఁడిపోయియున్నది.'

అభిరామస్వామి చాలసేపు మాటలాడలేదు. 'ఒక్కమాఱు చూచినంతమాత్రమున నంతదృఢానురాగ మేర్పడదని నానమ్మకము. ఐనను, స్త్రీహృదయము దురవగాహము. అందు ముఖ్యముగ నవయౌవనవతుల హృదయములు భగవంతునకేయెఱుక. ఒరులెఱుంగఁజాలరు. కాని, నీవిప్పుడేమి చేయుదువు. ఆ సంబంధమునకు వీరేంద్రుఁడెన్నటికిని సమ్మతింపఁడు.'

'నేనాభయము మూలముననే యీవిషయము నింతవఱకు వెలిపుచ్చలేదు. జగత్సింగునకు మా వంశనామము

తెలియంగించి యుండలేదు.' విమల మొగ మొక్కింత మార్పు జెందెను. ఇట్లనెను. 'ఇప్పుడు మనమహారాజు మానసింహునితోఁ జెలిమిచేయ నిశ్చయించుకొనియెనుగదా! జగత్సిండల్లుఁడగుటకు సమ్మతించిన నందునుపద్రవమేమున్నది?'

'మానసింహుఁడుమాత్ర మా వివాహమున కెట్లంగీకరించును?'

'అతఁడంగీకరింపకున్న జగత్సింగే స్వతంత్రింపగలడు'

'వీరేంద్రసింహుని తనయనాతఁడు మాత్రమేల పరిణయమాడును?'

'కులగౌరవ విషయమున నీ రెండు వంశములలోను నంత లోటుపాట్లు లేనివంశమేది? జయధార సింహుని పూర్వులు యదువంశములోనివారేకదా!'

'అట్టివంశమున జననమొందిన తిలోత్తమ మ్లేచ్ఛుని బావమఱఁదిని బెండ్లియాడునా?'

'విమల యాతనిపై దృష్టి సారించెను.

'ఎందులకుఁ బరిణయమాడరాదు? యదువంశమునకంటె హీనమగు వంశమేది?'

ఈమాట యనినతోడనే సన్యాసి నేత్రము లగ్నిగురియసాగెను.

'దుష్టురాలా! నీదుష్టగుణమును నీవు పోనిచ్చుకొంటివికావు. నాయెదుటనుండి యావలకుబొమ్ము' అని కఠినముగా ననియెను.

—౧౦౧—

## తొమ్మిదవ ప్రకరణము

### కులాలంకారము

జగత్సింగు తండ్రికడ సెలవుగైకొని బయలు వెడలెను. ఆతని సమాచారములు పఠానుల కత్యంతభయమును గలుగ జేసెను. వారికి దిగులుజనియించెను. కటుల్ ఖానుని నేఁబది వేల సైన్యముతోఁగూడ సువర్ణరేఖానదియావలకుఁ దరిమివేయుదు ననికదా యాతఁడు శపథముపట్టియున్నాఁడు. ఆతండింతవఱకు నట్టిజయమును గాంచకపోయినను జహనబాదునుండి బయలు దేరిన పదునైదు దినములలోపల సేనాధిపతిగనుండి చూపిన వ్యూహరచనాది యుద్ధనైపుణ్యమును విని మానసింహుఁడపరిమితానందమును బొందెను. 'పరాక్రమశాలియగు నాతనయునిమూలమున రాజపుత్రుల ప్రాచీనయశస్సు పునరుద్ధారణము నొందగలదు' అని మెచ్చుకొనెను.

జగత్సింగు పరిపంథిచమూ సాగరముపైఁ దన కొలఁది సైన్యముతోఁబోయి బహిరంగముగ రణమున నెదిరించుట తగనిపనియని యెఱుంగును. అట్లెదిర్చిన నపజయమో మృత్యువో తప్పదు. అందుచే శత్రుసేనల కెదుటఁబడి రణమొనర్పకుండుటకై జగత్సింహుఁడొక క్రొత్త పద్ధతి నవలంభించెను. తనసైన్యమును సాంద్రారణ్యముల యందును, విశాల పర్వతగుహాలయందును, దాచియుంచుచువచ్చెను. అట్టితావులా దేశముననున్నవి. పటకుటీరములకుఁ గూడ నట్టి ప్రదేశములనే యేర్పఱచెను. అవి ఎత్తైనగుట్టల మఱుఁగుననుండి యత్యంత సమీపముననున్న మనుష్యునకుఁగూడఁ గాన

రాకుండనుండెను. ఇవ్విధంబున దాఁగియుండి పఠానులగుంపే దైన సమీపముననున్నదని తెలిసినతోడనే సముద్ర తరంగమువలె బైఁబడి వారిని నిర్మూలముఁ జేయును.

వివిధవేషములతో వేగువాండ్రనుబంపి శత్రువుల సమాచారములఁ దెప్పించుకొనుచుండెను. వేగువాండ్రు పండ్లమ్మువారిపోలిక, చేపఁలమ్మువారివిధమున, యాచకులభాతి, మతసన్యాసులరీతి, బ్రాహ్మణులవైఖరి, వైద్యులవలె, బోయి శత్రువుల యుద్దేశములను, ప్రయత్నములను, దెలిసికొని వచ్చుచుండిరి, అతఁడిట్లు వార్తలనెఱింగి యనువైన తావున కతిశీఘ్రముగ రహస్యముగ సైన్యమును భవితవ్య మెఱుఁగకుండవచ్చు పఠానులఁ దాఁకుటకై పంపుచుండెడివాఁడు. ప్రస్తుతావస్థనుబట్టి యొక చిన్నయపజయము సంభవమైనను నది తన సంపూర్ణనాశనమునకుఁ గారణమగునని జగత్సింహుఁ డెఱుంగును. అందుచే నామార్గమున నొకవేళ పఠానులబల మధికముగ వచ్చెనేని యెదుర్కొనెడివాఁడుకాఁడు. వారు దృష్టిపథమును దాఁటినపిదప మెల్లగవారిని వెంబడించి, యశ్వముల నాహారపదార్థముల నాయుధసామగ్రులఁ గొల్లగొట్టుకొని పోవుచుండును. అట్లుగాక వారు స్వల్పముగ నుండిరేని యనువగు ప్రదేశమునకు వచ్చువఱకును బొంచియుండి రాఁగనే వారిపైఁబడి యాకలిగొన్న పెద్దపులివలె ముక్కలు ముక్కలుగ వారిని నరికించుచుండెను. ఇట్లుచేయుచుండుటచే రాజపుత్త్రబలము సమీపమున నున్నదని యెఱుంగక పఠానులు యుద్ధసన్నాహముచేయకుండ నుండుచు

వచ్చిరి. పాపము వారాకస్మికముగ రాజపుత్రులచేఁ జిక్కుబడి పోరాటములేకయే ప్రాణములను గోల్పోవుచుండిరి.

ఈవిధముగా నెందఱో చాలఁగలవడిరి. పఠానులు నాశనమైరి. తుదకు బహిరంగరణమున జగత్సింగు సేనల నిర్మూలముఁ జేయవలయునని వారుదృఢనిశ్చయులైరి. కాని, వారెక్కడనున్నారో యెవరును జెప్పలేరు. యమభటులవలె పఠానులవశానకాలమున వారంతట వారగపడి వారి మరణ కార్యములు సమాప్తినొందినతోడనే మరల నదృశ్యమై పోవుచుండిరి. జగత్సింహుఁడు వ్యూహరచనాది విద్యలఁ బరిపూర్ణుఁడు. అతఁడెప్పుడును దన యయిదువేల వాహిని నొక్కచోఁ గూర్పలేదు. ఇక్కడ వేయి—అక్కడ నైదువందలు మఱియొకచో—రెండువందలు ఇంకొకచో రెండువందలు—ఈరీతిగ నుంచుచువచ్చెను. శత్రువు వచ్చుచున్నాఁడని తెలియుటతోడనే యెక్కడకెంత పంపవలయునో యక్కడకంత సైన్యము నంపుచుండెడివాఁడు. కార్యము ముగిసినపిమ్మట నిఁక నాతావునఁ దనసేనల నుంచెడివాఁడు కాఁడు. రాజపుత్రులెక్కడనుండిరో యెక్కడలేరో పఠానులు తెలిసికొనలేకపోయిరి. ప్రతిదినమునను, ప్రతినిమిషమునను, పఠానుల నాశనసమాచారములే కటుల్ఖానునకు వచ్చుచుండెను. ఏదియెట్లున్నను కోటలోనుండి కొలఁదికొలఁదిగ సైనికు లీవల రాను జంకుచుండిరి. వారి దుండగములణఁగిపోయినవి. వారికి కోటయే శరణ్యమయ్యెను. తుదకాహారపదార్థ సంపాదనమే వారికి దుర్ఘటముగ నుండెను. పఠానులవలన దేశమున

కుపద్రవము గలుగకుండ వారింపఁబడెననియు, వారు జగత్సిం హుని చేతిలోఁ జిక్కికొనిరనియు, మానసింహునకు సమా చారమువచ్చెను. ఆతఁడు తనయునకిట్లుత్తరము వ్రాసెను.

'క్షత్రియకులాలంకారమా! కుమారా! చక్రవర్తి దేశమును పఠానులచేతినుండి విడిపింపగలవని నమ్మిచున్నాఁ డను. నీకు సాహాయ్యమునకై యింకను బదివేల సైన్య మంపితిని.'

దానికి జగత్సింగిటులఁ బ్రత్యుత్తరము వ్రాసెను.

'తండ్రీ! మీచిత్తము. ఇంకను నధికముగ సేనలు వచ్చినమేలే. రాకపోయినను మీ యనుగ్రహమున నీయైదు వేలతోడనే నాశపథముఁ జెల్లించుకొనియెదను.'

జగత్సింగు వీరావేశుఁడయ్యెను. అవిచ్ఛిన్నవిజయాభి లాషియై యేగెను.

'ఓశైలేశ్వరా! నీ యాలయమున నే యువతీమణి యొక్క ప్రేమావలోకమున కీతఁడవశ్యుఁడయ్యెనో, యా భువనైక సుందరి యీసంగర కలకలారావమధ్యమున జగ త్సింహుని మనసునకుఁ దలఁపునకువచ్చునా? అదృశ్యమయి పోవునా? అదృశ్యమైనచో నాతఁడును నీవలె రాతితో సృజి యింపబడినవాఁడే.

పాఠకులారా! రండు. మనము విమలయొద్ద కేగుదము. జగత్సింగు రాయియో మనుష్యుఁడో చూతముగాక! రణనాగుణధ్వనులతో మనకేల? ఈయన్నిటికంటె విమల యొక్క తెయే మనోహరమైనది.

---

## పదియవ ప్రకరణము

### ఆలోచనాంతర ప్రయత్నము

అభిరామస్వామి విమలను బొమ్మనిననాఁటి సాయం కాలమామె తనభవనమున నలంకరించుకొనుచుండెను. ఆమె ముప్పదియైదేండ్ల వయసుగల స్త్రీగదా! అలంకరణమునం దింకను నామెకుత్సాహముండునా? ఏమి? ఎందుల కుండదు? యౌవనమున కిన్నియేండ్లతోఁ బోవునను నియమమున్నదా? ఎప్పుడునుండదు, మోహసౌందర్యము లెంతకాల ముండునో యంతకాలమును యౌవనముండును. అవి పోయిన నదియుఁ బోవును. సౌందర్య విహీనయగువనిత నిజముగా యువతి యైనను పలితయే. యువతి సౌందర్యవతియయ్యేనేని యామె నిరంతర యౌవనవతియగును. ఎవతెహృదయము మోహో ల్లాసముల కపరిచయమో యామె యువతికాదు. వానియం దనుభవమెవతెకుండునో యామె కేండ్లతోఁ బనిలేదు. ఇప్పు డునువిమలశరీరముల్లాసభావములచేనుప్పొంగుచునే యున్నది. ఇంకను నామె యంతరంగము మోహ పరిపూర్ణమయియే యున్నది. ఇప్పటికిని మోహప్రేరితములగు భావములామె హృదయమును వీడనేలేదు ఇంతేకాదు. ఏండ్లుగడచినకొలది సుకుమార సౌందర్యము మృదుభావము నొందుచుండును. చదువరులు కొంచెము వయస్సుగడచినవారుగ నుందురేని, యీమాటకుఁదప్పక సమ్మతించెదరు.

ఆమె యోష్ఠములు పక్వబింబ ఫలసదృశములు తాం బూలరాగసంయుతారుణ కాంత్యుజ్వలములు, వానిసౌందర్య

మును జూచిన యేమనుజుఁడామెయౌవనవతి కాదని చెప్పగలఁడు! కజ్జల సంయుతవిశాల నేత్రములనుండి వెడలుచున్న యాచంచల కటాక్షవీక్షణములం జూచిన, నామె యిరువది యైదేండ్లయువతికంటెఁ దక్కువవయస్సుగలదికాదని యెవడు చెప్ప సాహసించును? ఆహా! ఏమి యా నేత్రద్వయ సౌందర్యము! ఏమి యానిర్మాణకుశలత! ఏమి యాసుందరతర వీక్షణము ఏమి యాప్రకాశము! కొందఱు స్త్రీలనేత్రములాశాప్రపూర్ణములు. అనవరత కేళీవిలాస తత్పరాయత్త చిత్తసంసూచికములు.

విమలనేత్రములిట్టివే. పాఠకులారా! విమల నిశ్చయముగ యౌవనవతి. ఇంతేకాదు. అమె నిరంతర యౌవనమనుభవించుచున్నదని చెప్పవచ్చును. చంపక కుసుమచ్ఛాయతో మెఱయుచున్న యామె మృదుగాత్రమును గాంచి, పదునాఱేండ్ల యువతీమణి యింతకంటె కోమలశరీర యని యెవ్వఁడు చెప్పగలఁడు? ఆమెకర్ణముల మాటుననుండి వచ్చి గండభాగములపైఁ బడు చూర్ణకుంతలములను జూచిన నామెనుజవ్వనియని చెప్ప సందేహమెందులకు? యువతికిమాత్ర మట్లు కపోలములపైఁ బడుచుండవా? ఓపాఠక మహాశయులారా! నాదొక్కప్రార్థనము. నామనవి చెల్లింపుఁడు. మీ మనోనేత్రము నొక్కమాఱు వికసింపఁజేయుఁడు. విమల దర్పణముకడ తలదువ్వుకొనుచు నెట్లు గూర్చుండి యుండెనో చూడుఁడు!. సాంద్రములగు శిరోజముల వామహస్తమునఁ బట్టుకొని యెట్లు దువ్వెనచేఁ జిక్కుదీయుచున్నదో పరికిం

పుఁడు. ఆమెయౌవన మనోహరవేషమును దర్పణమునఁ జూచికొని యెట్లు మందహాసముఁ జేయుచున్నదో వీక్షింపుఁడు. నడుమనడుమ నామె యోష్ఠములనుండివచ్చు మృదుమధుర గానామృతమును మెల్లిగఁ జెవియొగ్గివినుఁడు. ఇంతే కాదు. మీకభిలాషకలదేని కామోద్రేక జన్యములగు నామె వక్షోజవైభవ దర్శనమున మీనేత్రములకు విందొనర్పుఁడు. పిమ్మట నవి కాలమునుజయించెనో లేదో నిష్పక్షపాతముగఁ జెప్పుడు. ఇవియన్నియుఁ గనివినిమీరిప్పుడామెకంటెనేయువతీరత్నముమీహృదయము నాకర్షింపగలదో యోచింపుఁడు.

ఆమెశిరోజములను జడయల్లుకొనియెను. జడ ముడి వేయలేదు. వీపున వ్రేలాడవైచెను. పరిమళోదకములలోఁ దడిపిన చేరుమాలచే వదనము దుడిచికొనియెను. సుగంధద్రవ్యములతోఁ గూడిన తాంబూలరాగముచే నామెయోష్ఠములు ప్రకాశించుచుండెను. ముత్యములచేఁ జెక్కఁబడిన కంచెల దొడిగికొనియెను. ఆమెశరీరమంతయు సువర్ణమయాలంకారములు ధరించెను. పిమ్మట నాలోచించి మరల నామె యందు కొన్నిఁటిని దీసివైచెను. బుటేదారి యంచులతో నున్న మనోహరవస్త్రముల ధరియించెను. పగడములచేఁ బొదుగఁబడిన పాదరక్షలఁ దొడిగికొనియెను. జగత్సింహునిచే నియ్యఁబడిన ముత్యాలహారమును జక్కగదువ్విన యామె శిరోజములఁ జుట్టుకొనియెను.

అలంకరించుకొనుట యయినది. విమల తిలోత్తమ యున్న గదిలోనికిపోయెను. ఆమె వేషముజూచి తిలోత్తమ యాశ్చర్యపడి యిట్లనియెను.

'విమలా! ఇదేమి? ఈయలంకార మెందులకు? విశే
షము లేమి?'

'ఆగోడవయంతయు నీకేల? నీకుఁ జెప్పదగినది కాదు'

'చెప్పవా? నిజము చెప్పు! నీవెట కేగెదవు?'

'నేను వెళ్ళిపోయెదనని నీతో నెవరు చెప్పిరి?'

తిలోత్తమ కలవరపడియెను. విమల యామెయాకుల పాటు గ్రహించి నవ్వుచు నిట్లనియెను.

'నేను చాలదూర మేగుచున్నాను'

తిలోత్తమ వదనము పూర్ణముగ వికసించినకమలము వలె నయ్యెను.

'నీ వెట కేగెదవు?'

'చెప్పకో!'

తిలోత్తమ యామెవదనమునఁ జూడ్కులునిలిపెను.

విమల యామెహస్తమును గ్రహించి గవాక్షముకడకు దీసికొనివచ్చి యిట్లు చెప్పెను.

'నేను శైలేశ్వరుని యాలయమున కేగుచున్నదానను. అచ్చట నేనొక రాజోత్తమునితోఁ గలిసి మాటలాడవలసి యున్నది.'

తిలోత్తమ శరీరము కంపమొందెను. ఏదియో గొప్ప మనోవికార ముదయించెను. ఆమె ప్రత్యుత్తర మీయలేదు. విమల చెప్పఁదొడంగెను.

నేనభిరామస్వామితో మాటలాడితిని. జగత్సింహునకు నిన్నిచ్చి పరిణయ మొనర్ప మీతండ్రిగారెన్నఁటికి నిష్ట

పడదు. అట్టిప్రస్తావము నాతనికడఁ దేరాదు. ఇంకనీవిషయ మాతనిచెవిఁబడిన నేమి ముప్పువాటిల్లునో? ఎంతయాగ్రహ మొందునో? ఎట్టిదండన విధించునో! ఈగండము గడచిన భగవంతున కనేక వందనములొనర్చెద.'

తిలోత్తమ యవనతముఖియై 'అయిన నెందుల కేగ దవు' అనెను.

'ఈదినమున వచ్చెదనని యాతనితో వాగ్దత్త మొనర్చి యుండలేదా! మనవృత్తాంతము నెఱింగించెదనని చెప్పియుండ లేదా! మనల నెఱింగినంతమాత్రమున నతనికగు ప్రయోజన మేదియో నెఱుంగను. ఐనను మన యుదంతమాతనికిఁ దెలి పెదను. ఈసందర్భమున నాతఁ డేది శ్రేయస్కరమని తలం చునో చూతముగాక! నిజముగా నిన్నాతఁడు ప్రేమించిన--

ఆమెను సంపూర్తిగ నుడువనీయలేదు, తిలోత్తమ వస్త్రపుఁ జెఱఁగుచే నామెనోరును మూతవైచి 'విమలా! ఈమాటయేమి! సిగ్గు! సిగ్గు! నీయిష్టమువచ్చిన చోటకుఁ బొమ్ము అంతేకాని నావిషయ మెవ్వరివద్దను తలపెట్టకుము. ఒకరి విషయమును నాకడ నుడువకుము' అనియెను.

విమలకు నవ్వువచ్చెను. 'నీవు బాలికవు; పాప మీ వయసున నిన్నిసందర్భమున మునుఁగుమని యెవ్వరు చెప్పెదురు?'

'పో! ఇంక నీమాటలు నేను వినను పొమ్ము.'

'అయిన నేనాలయమునకుఁ బోను.'

'ఎక్కడకును బోవలదని నిన్ను పట్టుకొంటినా యేమి? నీ వెక్కడకుఁ బోవలయునన్న నక్కడకుఁ బోవచ్చును.'

'అయిన నేను వెళ్ళనే వెళ్ళను' అని విమల నవ్వుచు చెప్పెను,

తిలోత్తమ యవనతావలోకనయై 'వెళ్ళు' అనెను. విమలకు మరల నవ్వువచ్చెను. ఒక్కించుక సేపూరకుండి యామెతో 'నేను వెళ్లెదను. మరల వచ్చువఱకును నిద్ర బోకుము.' అనియెను. తిలోత్తమ మోమునఁ జిరునగవంకురించెను. అది 'నేనెట్లు నిద్రపోఁగలను.' అని చెప్పుచున్నట్లుగ పడియెను. విమల దానిని గ్రహించెను. ప్రయాణోన్ముఖ యయ్యెను. తిలోత్తమభుజముపైఁ జేయివైచి రెండవచేతితో నామెగడ్డమును బట్టుకొని ఒక్కమాఱామె ముఖమువంకఁ బరికించెను. నిండుప్రేమమున నామెను ముద్దుపెట్టుకొనెను. తిలోత్తమ బాష్పలోచనయై చూచుచుండెను. ఇంతలో నాపాన్మనీ గదితలుపునొద్దకువచ్చి 'విమలా ప్రభువువారి సెలవయినది' అనియెను.

తిలోత్తమ యామాటవిని విమలతో రహస్యముగ 'నీవు నీదుస్తులను మార్చుకొని మఱియటకుఁబొమ్ము' అని చెప్పెను. విమల 'భయములేదు' అని బదులునుడివి వీరేంద్రసింహుని శయనాగారమున కేగెను.

ఆయన పండుకొనియుండెను. పరిచారికయొకతె పాదములు పట్టుచుండెను. ఇంకొకర్తు విసరుచుండెను. విమల పానుపుకడ కేగి 'ఏమిసెలవు' అనియెను. వీరేంద్రుఁడు తల యెత్తి చూచి యాశ్చర్యమునొంది యిట్లనియెను.

'విమలా! నీవేదైన పనిమీదఁ బోవుచుంటివా?'

'చిత్తము. యేలికయాజ్ఞయేమి?'

'తిలోత్తమ యేమిచేయుచున్నది? ఆమెకు దేహా రోగ్యము చెడినది. ఇప్పుడు నెమ్మదిగ నున్నదా?'

'ఉన్నది'

'విమలా! నీవొక్కింతవిసరెదవా? ఇంతలో నాస్వామినీ తిలోత్తమను దీసికొనివచ్చును.'

ఇంతవరకు విసరుచున్నస్త్రీ యవ్వలికేగెను. విమల యాస్వామిని నావల వేచియుండుమని సైగచేసెను. వీరేంద్రుఁడు కొండొక పరిచారికతో 'లక్ష్మి! తాంబూలమును గొనిరమ్మ' అనియెను. పాదసంవాహన మొనర్చుచున్న యామె తాంబూలమును దేఁబోయెను.

'విమలా! ఈదినమున వేషమువైచితి వెందులకు?'

'పనియుండి'

'ఏమిపని? నేను వినరాదా?'

'అయిన వినుఁడు'

విమల యాతనిపై మోహవికార బీజములగు వీక్షణములఁ బఱపి యిట్లనియెను. 'నేను జారిణినిగదా! నేనిప్పుడొక స్థానమునకుఁ బోవలయు.'

ఇట్లు చెప్పుచు నటనుండి యామె తత్క్షణము వెడలిపోయెను.

—♦o♦—

## పదునొకండవ ప్రకరణము

### ఆషా్మనీ దౌత్యము

విమలసైగ ప్రకార మాషా్మని యామెకొఱకు వేచి యుండెను. విమలవచ్చి యిట్లుపలికెను.

'నీతో రహస్యమయిన మాటయొకటి చెప్పవలసి యున్నది.'

'నీ వేషమునుజూచి యీదినమున నేదో గొప్ప విశేష మొకటి యుండియుండునని యిదివరకే యనుకొంటిని'

'నేనిప్పుడొక కార్యముమీఁదఁ జాలదూరము పోవలసి యున్నది. ఒంటరిగఁబోలేను అన్యులఁగూడ దీసికొనిపోవుట శ్రేయము గాదని తోఁచెడిని. నీవిప్పుడు తప్పక నాతో రావలయు'

'నీ వెటకేగెదవు'

'ఆషా్మని! నన్నింతగా నీ వెప్పుడు నడుగలేదే?'

ఆషా్మని కలవరపడియెను. విమలయిట్లుచెప్పెను.

'కొంచెమాఁగి నేజెప్పునది వినుము. నేను కొన్ని గృహకృత్య వ్యవహారములనిమిత్త మేగుచున్నదానను. అవి నిర్వహించుకొని మరలవచ్చెదను. ఆషా్మనీ! ఇంక నొక మాట. ఈదినమున నీపూర్వపరిచయు నొక్కనిని నీవు చూచెదవనుకొమ్ము. అతఁడు నిన్నానవాలు పట్టగలఁడా!' ఆషా్మని యాశ్చరముతో 'అదేమి?' అనియెను.

'నీవు రాజా జగత్సింగును జూచెదవనుకొమ్ము.'

ఆషాఢ్మనీ యూరకుండెను. గద్గదస్వరముతో నిట్లనెను.

'అంతటిభాగ్యము నాకు లభించునా?'

'లభించుననుకొనుము.'

'రాజపుత్త్రుఁడు నన్నుఁదప్పక గుర్తించును'

'అయిన నీవు రానలదు. ఇఁక నేనెవ్వరిని దీసికొని పోవుదును? ఒక్కతెను పోలేనే?'

'రాజపుత్త్రిని జూడ నాకుఁజాల నభిలాషగలదు.'

'ఆకోర్కె నిప్పుడణంచుకొనుము. నేనిప్పుడేమి చేయుదును? ఏమియును దోఁచుటలేదు.'

విమల యాలోచింపఁ దొడంగెను. ఆకస్మికముగ నాషాఢ్మనీ విమలకుఁ దెలియకుండ నవ్వమొదలుపెట్టెను.

'నిర్నిమిత్తముగ నవ్వుచున్నా వెందులకు?'

'నాకొకయూహ వొడమినది. మన దిగ్గజుని గూడఁ దీసుకొని పోఁగూడదా?'

'మంచిమాట చెప్పితివి. ఆరసికుని దీసికొనిపోయెదను'

'నేనూరక హాస్యముకొఱకంటిని.'

'పరిహాసముకాదు. ఆమందుని:గూర్చి నాకేమియు ననుమానములేదు. గ్రుడ్డికన్ను దెఱచినను మూసినను సమానమే. దానికి రాత్రింబవళు లనుభేదమేమి? ఆబ్రాహ్మణుఁడేమియు గ్రహింపలేఁడు. కాని యూతఁడు వచ్చుట కిష్టపడఁడేమో? ఏమిచేయవలయు?'

'ఆపనినాపైఁబెట్టుము. నేనాతనిఁదోడి తెచ్చెదను. కొంచెముసేపీద్వారముకడ నాఁగుము' అని ఆషాఢ్మనీనవ్వుచుఁ జెప్పి కోటలోని కుటీరమువంక కరిగెను.

అభిరామస్వామి శిష్యుఁడగు గజపతి విద్యాదిగ్గజునిఁ జదువను లెక్కఁగినచో, యున్నారు. విమల యాతనిని 'రసిక దానస్వామి' అని యెందులకుఁ బిలుచుచుండెనో కూడ పాఠకు లెఱుఁగుదురు. ఈసుప్రసిద్ధపురుషుఁ డాకుటీరములో నివసించి యుండెను. ఇంచుమించాతఁడు తొమ్మిదడుగులపొడవుండును కొంచెము తక్కువగా నొక యడుగు విశాలము. కటిప్రదే శము మొదలు పాదమువఱకాతని కాళ్ళపొడ వాఱడుగులు, వానిపుష్టినిగూర్చి చెప్పనక్కఱలేదు. రెండును రెండుపుల్లల వలె నుండును. ఆతని శరీరకాంతి సిరాను బోలియుండును. అతని కాళ్ళను కఱ్ఱలనుకొని యొకప్పుడగ్ని మ్రింగివేయ యత్నించెను. కాని, వానియందు రసమేది? రసవిహీనమని విసర్జించుటచే నవి కొరకచ్చులయ్యెను. ఆతఁడు చాల పొడ వగుటచే పంగి మడతఁబెట్టుటకు సిద్ధముగ నున్నట్లుండెను. ఆతని యవయవము లన్నిటిలోను ముక్కు ప్రధానస్థానము గైకొనినది. శరీరమునందంతట నుంపవలసినపుష్టి నంతయు నటనుంచినట్లు కన్పట్టుచుండెను. ఆతనిశిర స్సోఢ్రదేశపు బోయవానివలె క్షౌరము చేయఁబడియుండెను. ఇప్పుడిప్పుడే వెలుఁగుచున్న వెంట్రుకలాతని శిరస్సుపై ననేకముగ సూదు లను గ్రుచ్చినట్లున్నవి. లలాటముననుంచిన తిలకసౌందర్యము కొంచెము చక్కగనున్నది.

'గజపతి విద్యాదిగ్గజ' మనుబిరుదు మాతని కూఱక విచ్చినది కాదు. ఆతనిబుద్ధి యసాధారణమైనది. బాల్యకాల మునఁ జతుష్పతి విద్యాశాలయందు వ్యాకరణ మభ్యసింప

నారంభించెను. ఏడుమాసముల పదునేను దినములైననుగాక పూర్వమే యాతఁడు 'వృద్ధిరాదైచ్' అను సూత్రమును మూలవ్యాఖ్యానములతోఁ గూడఁ వల్లించివైచెను. భట్టాచార్యులవారి యనుగ్రహము వలననైననేమి, సహాధ్యాయుల విద్యాపఠన ధ్వనులవలననైననేమి, పదునేను సంవత్సరముల లోపల నాతఁడామూలాగ్రముగ నామవాచక సంబంధమయిన విద్యనంతను బూర్తి చేసెను. వేఱువిషయమునఁ బ్రవేశింపక పూర్వము గురువు నామవాచకమునఁ పీఁడెంతగడిదేరెనో పరీక్షింతమని 'నాయనా! రామశబ్దమున కంతమున 'అమ్' చేర్చిన నేమివచ్చునని యడిగెను. గజపతి చాలసేపాలోచించి 'రామాంత' అని బదులుచెప్పెను. (సరియైన రూపము రామమ్)

'బిడ్డా! నాయొద్ద నేర్చుకొనఁ దగినదంతయు నేర్చుకొన్నాఁడవు. విద్యసంపూర్ణమయినది. ఇఁక నీకుఁ జెప్పుటకు నాకడ సమర్థతలేదు. నీవింటికిఁ బోవచ్చును.'

'గురువర్యా! నాదొక్కమనవి. నాకు బిరుదమో!'

'నీవసామాన్యవిద్యను సంపాదించితివి. బిడ్డా! అందులకై నీకొక యపూర్వబిరుదము నీయవలసియున్నది. విద్యాదిగ్గజమను బిరుదమును గైకొనుము.'

గజపతి గాలఁ దృప్తినొందెను. గురునకు వినయపూర్వకముగ వందనమొనర్చెను. ఇంటికిఁబోయి యిట్లు యోచించుకొనెను. 'వ్యాకరణశాస్త్రమునఁ బరిపూర్ణుఁడనైతినికదా! కొంచెము ధర్మశాస్త్రముకూడ నభ్యసించెదను

గాక, అభిరామస్వామి యాశాస్త్రమున గొప్పపండితుఁడని వినియున్నాఁడను. సూర్యకిరణప్రసార మున్నంతవఱకీ ప్రపంచమున నాతఁడుదక్క నాకు బోధింపఁదగిన వారెవ్వరున్నారు? నేనాతనియొద్దకే పోయెదను'

ఇట్లు నిశ్చయముఁ జేసికొని యీకోటలోనికి వచ్చెను. అభిరామస్వామికడఁ జాలమంది శిష్యులున్నారు. అతఁడెవ్వరిని నిరాకరించెడివాఁడు కాఁడు. అందుచే దిగ్గజుఁడేమేని నేర్చుకొనినను నేర్చుకొనకపోయినను నాతనికి విద్యఁజెప్పుటకు నిరాకరింపలేదు.

పవిత్రుఁడగు నీగజపతి కేవల వ్యాకరణజ్ఞుఁడేకాఁడు న్యాయవాదియును, సాహిత్యమును, హాస్యశాస్త్రమును గూడ నీతఁడు చదివిచూచినాఁడు. వీనియందీతఁడు ప్రవీణుఁడనుట కుదాహరణము 'నేతిముద్దతపేలా' ఈతఁడీ విద్యాయుధములన్నియు నాష్మానీపైఁ జూపుచుండెను. దీనికొక రహస్యకారణమున్నది. ఆతఁడొకప్పు డిట్లూహించుకొనెను. 'నేనిటకు వచ్చినది వినోదముకొరకుగదా? ఇదే నాదివ్యమైన బృందావనము. నేనెకృష్ణుఁడను. ఈయాష్మాని నా రాధిక' ఆష్మానీకి హాస్యమనిన నతిప్రియము. ఆమెకీ మదనమోహనుఁడు వినోదార్థము పెంచుకొను మర్కటముగా నుండెను. విమలకూడ నీవాసన గ్రహించినది. అప్పుడప్పుడీకోతి నాడించుట కామెయు వచ్చుచుండును.

'ఇదిగో! నాచంద్రావళి ఏమి! ఎందులకుకాదు? దీనికి నేతిముద్దతపేలాయని బిరుదమిచ్చితినిగదా? ఇది తెచ్చిపెట్టుకొన్నదని విమలకుఁ దెలియకుండుటెంత యదృష్టము.'

మాధవుని యదృష్ట మేమోకాని యాదినమున నొక గొప్పయానందము గలుగనున్నయది. వృషభానుతనయ తనంతటఁదా నాతని కుటీరమున కేగుచున్నది.



## పండ్రెండవ ప్రకరణము

### ఆష్మానీ సాంకేతిక స్థానము

దిగ్గజమనోహారిణియగు నాష్మానీ సౌందర్య మెట్టిదియో తెలిసికొనఁజదువరు లువ్విళులూరుచుందురు. వారి వినోదార్థ మీప్రకరణమున నామెఁగూర్చి తెలిపెదగాక! స్త్రీలలావణ్యము నిదివఱకెందఱో కవులభివర్ణించి యున్నారు. నేనును నీ ప్రాతమార్గమునఁ బోయిన నది హేయముగ నుండును. గ్రంథచౌర్యము కూడనగును. కావున నేనిట ప్రార్థనమును ముందుగ నారంభించి పిదప నామె లావణ్యమును వర్ణించెద.

ఓ వాగ్దేవతా! ఓ పద్మాసనా! ఓశరద్రాత్రికాచంద్రినిభానా! ఓకృపాప్రపూర్ణ! ఓమృదుపదాధరీకృతపంకజా! నే నాష్మానీసౌందర్యము నభివర్ణింపఁ దలపుఁ గొన్నాఁడను. నీమృదుపదాశ్రయమిచ్చి రక్షింపుము. ఓ సుందరయువతీజన గర్వభంజనీ! నీవు బహుమృదు సమాసపదనిర్మాతవు నేను సౌందర్యమును వర్ణింపఁ బోవుచున్నాఁడను. నాకొక్క మాఱు నీ లలితపదాశ్రయమిచ్చి రక్షింపుము. పండితజన

మనోభీష్టప్రదాయినీ! ఓదీనజన సంరక్షిణీ నీవువిద్యావిహీనుల నెప్పుడును ప్రేమింపనిదానవు. బాలబాలికలయందు విద్యాదీప మును బ్రకాశమొందించిన తల్లి వినీవే. ఒక్కసారి నాలో నున్న యజ్ఞానాంధకారమును బాపి నన్ననుగ్రహింపుము.

తల్లీ! నీకు రెండు వేలురూపములున్నవి. రఘువంశ కుమారసంభవ మేఘదూత శాకుంతలాదులు రచియించు నప్పుడు కాళిదాసునం దేరూపముచే నుంటివో, యేరూప ముచే నావేశించి మహాకవి వాల్మీకిచే రామాయణమును రచింపఁ జేసితివో, యేరూపముచే భవభూతిభారవులయందుఁ బ్రవేశించి మాలతీమాధవీ కిరాతార్జునీయములను విరచింప శక్తినొసఁగితివో, యట్టిరూపమున నాయందుఁ బ్రవేశించి నాభుజములకు, నొప్పియెత్తింపకుము. ఏరూపముచే శ్రీహర్షు నావేశించి నైషధకావ్యమును, తనయసమాన్య విద్యాప్రభా వముచే విరచింప నొనర్చితివో, వంగదేశమునకంతకు హృద యాకర్షణముగావించిన భరతచంద్రునియందు దశరథరాయి యందు నేయాకారముచే నుంటివో, బాలబాలికలయందు పుస్త కాలయములయం దేరూపముచే నధివసించియుంటివో, యట్టి రూపమున నాశిరసునఁ బ్రవేశింపుము. అమ్మా! నేనాప్మానీ సౌందర్యమును వర్ణించెదను.

ఆప్మానీ వేణి చాలపొడవయినది. పామువలెనున్నది. దానిని జూచుటతోడనే సర్పముయొక్క గర్వమణగిపోయి నది. అది చుట్టచుట్టుకొనిపోయి యిట్లు విచారించెను.

'అయ్యో! ఆప్మాసీజడచే నేను పరాభవింపఁబడితిని. లజ్జలేక నా మొగమును మరల నీలోకమున కెట్లుచూపుదును? పాతాళమునకుఁ బోయెదఁగాక' అని పుట్టలోఁదూరిపోయెను. అదివిని బ్రహ్మ 'ఓహో! లోకమునకు గొప్పయుపద్రవము సంభవించినదే! ఇఁక జనులను గఱచువారెవ్వరు. అని యోచించి దానితోఁకఁబట్టుకొని యివ్వలకు లాగెను.' తన ముఖము మరల ప్రజలకుఁ జూపవలసివచ్చుననెడి సిగ్గుచేఁ బాము తన తలను బుట్టనుబెట్టి కొట్టుకొనియెను. అందుచే దానితల చదునైనది. అప్పటినుండియు పాములకు పడగలేర్పడినవి. కళాహీనమయిన తనరూపమును జంద్రుఁడామె వదనముకడఁ జూపవెఱచెను. సిగ్గుపడి తలయెత్తలేకపోయెను. సృష్టికర్తకడకేగి మొఱపెట్టుకొనెను. విధాత 'సుధాకరా! భయపడకుము. వెళ్ళుము; లెమ్ము. ఇఁకమీఁద స్త్రీలవదనములు మఱుగుపరచెదనులే' అని భయముదీర్చి పంపివేసెను. అప్పటినుండియు స్త్రీలకు మేలిముసుఁగు లారంభమయినవి. ఆప్మాసీనేత్రములు రెండును రెండుకాటుకపిట్టలవలెనుండెను. విధాత సూక్ష్మబుద్ధిగలవాఁడు. ఆపక్షులు తమఱెక్కలనుజాపి యెగిరిపోవునను భీతిచేఁ బంజరమునకుఁ దలుపులవలె గనుఱెప్పల నేర్పఱచినాఁడు. ఆమెనాసిక తానే యధికురాలనని గరుత్మంతునితోఁ బోరాడుచుండెను. అతఁడు పక్షులకురాజు. పక్షిరాజు భయపడి తత్క్షణము వృక్షాగ్రమునకుఁ బాఱిపోయెను. ఆకాలమునుండియు విహంగములకు ధరిణిజములమీఁదనే జీవింపవలసివచ్చినది. ఒకానొకకారణమున నొక దాసిమ్మో

పండు వంగదేశమునుండి పాట్నాకు వలసపోయెను. ఒక యేనుఁగు దానితో వెంటఁబడెను. ఆగజము దానితోండ ముతోఁగూడ బర్మాకు వలసపోవుచున్నది. ధవళగిరిమాత్ర మక్కడనే యుండెను. ఆ మహీధరము తనలోనిట్లు వితర్కిం చుకొనెను. 'నేను ఎంతయెత్తున్న దానను? అయిదుమైళులా? ఇవియో; ఇవి యాఱుమైళ్లున్నవే?' ఈవిషయముంగూర్చి యది దీర్ఘాలోచనచేయ మొదలుపెట్టెను. అందుచే దాని తల వేడియెక్కెను. అప్పుడాపర్వతముపై హిమము మతిదట్ట ముగ వర్షించుచుండెను. అప్పటినుండియు నాకొండమంచుఁ గురియుచుండును. ఆషాన్మానీ సౌందర్య మిట్లున్నది.

అదృష్టదేవత యాషాన్మానీపై ద్వేషము వహించెను. పాపమామె విధవయయ్యెను. ఆమె దిగ్గజుని కుటీరముకడకు వచ్చెను. తలుపు వేసియున్నది. లోపలదీపము వెలుఁగుచుం డెను.

'ఏమండోయి మహాశియా!'

ఎవరును మాటాడలేదు.

'ఏమండో గోసాయిఙ్'

ఎవరును మాఱుపలుకలేదు.

చంపుడు. ఈమాయలాఁ డేమిచేయుచున్నాఁడు? ఓహో! రసికదాసస్వామీ!'

ఇప్పటికిని ప్రత్యుత్తరములేదు.

ఆషాన్మానీ తలుపుసందునుండి తొంగిచూచెను. అతఁడు భోజనము సేయుచుండెను. అందుచే మాటలాడలేదు.

బ్రాహ్మణులు భోజనసమయమున, మాటలాడుట సంభవించె నేని వారిఁక భోజన మొనర్పరుకదా!

'ఇతఁడు మిగులనాచారము నడుపుచున్నాఁడు. ప్రసంగానంతరమున, భోజన మొనర్చునో లేదో చూచెదఁగాక!' అని యూష్మానీ తనలోననుకొని యిట్లనియెను.

'నేను విటదాసిని'

ప్రత్యుత్తరములేదు.

'ఓ రసికాగ్రగణ్యా!'

'హమ్'

'బ్రాహ్మణుఁడు కబళము నోటనుంచుకొని మాటలాడెను.'

'అది మాటలాడుట కాదు' అనుకొని 'ఓహో! ధైర్యదర్పణమా!' అనిపిలిచెను.

'హమ్'

'ముందు మాటలాడుము. పిదపఁ దినవచ్చును.'

'హమ్, హమ్'

'ఇట్లైనా? నీవు బ్రాహ్మణుఁడవు కావా? ఇట్టిపని చేయుదువా? ఇదియంతయు నిప్పుడే స్వామికి విన్నవించెదను. గదిలో నెవరిని పెట్టుకొని యున్నాఁడవు?'

బ్రాహ్మణుఁడు భయపడి గదియంతయుఁ జూచెను. ఎవ్వరునులేరు. మరల భోజన మొనర్ప నారంభించెను.

'ఇదేమి మరల తినుచున్నావు. మాటలాడిన పిదప మరల భోజనము చేయుదురా?'

'ఏది? నే నెప్పుడు మాటలాడితిని?'

ఆస్మానీ పక్కున నవ్వి యిట్లనియెను.

'ఇప్పుడు మాటలాడలేదా!'

'ఎప్పుడు'

ఆస్మానీకి మరల నవ్వువచ్చెను.

'ఇదిగో యిప్పుడు మాటలాడలేదా?'

'ఔనౌను. లేదు. నేనింక తినను.'

'ఇంకఁ దినరాదు. ఆలస్యమేల, లెమ్ము తలుపుఁ దీయుము'

ఆస్మానీ మరల తొంగిచూచెను, నిజముగా నాతఁడు విస్తరికడనుండి లేవఁబోవుచుండెను.

'వలదు. వలదు. మిగిలిన కుంభమునుగూడఁ జెల్లించి మఱిలెమ్ము.'

'కాదు కాదు. అట్లుచేయరాదు. నేను మాటలాడితిని'

'నాతోడు నీవుతప్పక తినవలయును.'

'మహాపాపము, మాటలాడినపిదప భోజనము చేయుదునా?'

'నేను నీతోఁ గొన్ని రహస్యపుమాటలు చెప్పవలయునని వచ్చితిని, నీవుమరల భోజనము జేయకున్న నవి నీతోఁ జెప్పను. ఇదిగో వెళ్లిపోవుచున్నదానను.'

'వలదు, వలదు. ఆస్మానీ! కోపపడకు. నేనుతినెదను.'

బ్రాహ్మణుఁడు మరల తిన నారంభించెను. రెండు మూఁడు కబళములు తినినపిదప నాస్మానీ యిట్లనెను.

'చాలు. తిన్నాఁడవు. లెమ్ము, తలుపుఁదీయుము.'

'చేతిలోనున్నది తిననిమ్ము.'

'చాలునని యెప్పుడును నీకడు పేఁడువదు. లెమ్ము. లేనిచో మాటలాడినపిదప భోజనముచేసెనని యందఱితోఁ జెప్పెదను.'

అబ్బ! ఏమితొందర? ఇదిగో! లేచుచున్నాఁడను'

బ్రాహ్మణుఁడు పరిషేచనముచేసి లేచితలుపుఁదీసెను.



## పదమూఁడవ ప్రకరణము

### అప్పాన్ని వ్యభిచారము

తలుపు తీసినపిదప నాప్పాన్ని లోనఁబ్రవేశించెను. తన ప్రేమాస్పదయగు నాయువతికి రసికులొనరించురీతిగ స్వాగత మొసంగుటకై యాతఁడు మిగుల సంతసముతో తనచేయి యెత్తి యిట్లుపాడెను.

'ఓం గాయత్రీ వరదా దేవీ'

'ఇది చక్కని పద్యభాగము. దీని నెక్కడినుండి సంపాదించితివి?'

'నేనీదినమున నీకొఱకు రచియించితిని'

'నీవిఁక విటసార్వభౌముఁడ వని పిలువఁదగినవాడవు.'

'రసికాః! కౌశికోవాసః' 'సుందరీ! కూర్చుండుము. హస్తప్రక్షాళన మొనర్చుకొని వచ్చెదను.'

ఆప్మాని తనలో 'అభాగ్యుఁడా! చేయికడుగుకొనుము. మిగిలిన యన్నమునుగూడ నీచేఁ దినిపింపకుండిన నన్నీ పేరున బిలువకుము' అని యనుకొని ప్రకాశముగా—

'ఏమి ప్రక్షాళన మెందులకు? తిను. తిను.' అనియెను.

'ఏమనెదవు? పాత్రముకడనుండి లేవలేదా? మరలఁ దినుటయెట్లు?'

'ఎందులకు తినరాదు. ఇఁక నక్కడ నన్నములేదా? విసర్జించి కడుపు మాడ్చుకొనెదవా?'

'నేనేమి చేయుదును? నీవంత తొందరనిచ్చితివి' అని విచారముతోఁ జెప్పుచు బ్రాహ్మణుఁడన్నమువంక నత్యాతురతతోఁ జూచుచుండెను.

'అయినఁ దప్పక నీవు తినవలయు'

'ఎంతపాపము! నేను పరిషేచన మొనర్చితిని. అట నుండి లేచితిని, మరల నెట్లు తినెదను?'

'నీవు తినితీరవలయు, నేనుజూచెదను' అని చెప్పుచు నాప్మాని యతనిచేయిని గ్రహించి బలాత్కారముగ నీడ్చుకొనిపోయి భోజనపాత్రికముకడఁ గూర్చుండఁబెట్టెను.

'ఛీ! ఛీ! ఏమిపనిచేసితివి? మాతి కడుగుకొనకుండ నన్ను ముట్టుకొనెదవా?'

ముట్టుకొనిన నుపద్రవమేమి? మోహవిషయమునట్టి యభ్యంతరములేదు.'

బ్రాహ్మణుఁ డూరకుండెను.

'తినుము'

'నేను ఉత్తరోపాశన మొనర్చితిని, అన్నముకడనుండి లేచితిని. మఱియు నన్నుముట్టుకొంటివి. ఇఁక నేనెట్లు భుజించెదను.'

'నీవు తినవలయు, ఇంత మాత్రమేకాదు. ఈ పాత్రమున నేను తినినపిమ్మటఁగూడ నీవు భుజింపవలయును.'

ఇట్లుచెప్పుచు నాపాప్మని యొకముద్దనుగయికొని నోటఁ బెట్టుకొని భుజించుచు మిగిలినయన్నమును పాత్రమునుంచి 'రమ్మ్మతినుము' అనియెను. బ్రాహ్మణుఁడు తెల్లబోయి చూచుచుండెను. 'మాట, విను' అని యాపాప్మని దిగ్గజుని చెవిలో నేమియో చెప్పెను.

బ్రాహ్మణుఁ డొక్కగంతువైచి 'హాయి! హాయి! అయినఁ దప్పక తినెదను' అని కేకలువేయుచు పశువువలె నపవిత్రమయిన యాయన్నమును, మ్రింగ నారంభించెను. కనురెప్ప వేయునంతలో నదియంతయు నదృశ్యమయ్యెను.

'ప్రియా! ఇఁక—'

'తొందరపడకుము. ఆనోటియందేనా?'

'కానేను. ముఖప్రక్షాళన మొనర్చుకొని వచ్చెదను' అనిచెప్పుచుఁబోయి యతివేగముగ వచ్చెను. నోరు కొంత భాగము కడుగుకొనియెను. కొంతభాగమునకు జలదర్శనమే లేదు. ఒకమెతుకు పండ్లసందున నిరుకుకొని యుండెను.

'కాంతా! ఎక్కడ? నీయధరామృతమేది?'

'నీకు హాని సంభవించును. ముందు మూతిని దుడిచి కొనుము'

తొందరతో నాతఁడు చేతులును మొగమును దన వస్త్రముయొక్క ముందటి చెఱఁగుతోఁ దుడిచికొనియెను.

'ప్రియా! ఇఁక—'

'ఈప్రక్కకురమ్ము'

దిగ్గజుఁడామెయొద్దకేగెను. ఆమె ప్రక్కను గూర్చుండెను.

'నోరుఁ దెరువుము'

దిగ్గజుఁడు మాటాడుటలేదు. చెప్పినట్లెల్ల చేయుచుండెను. అతఁడు తన రెండు పెదవులను విప్పి దాకవలె పెట్టెను. ఆస్మానీ చేరుమాలునుండి తాంబూలద్రవ్యములఁదీసి నమల నారంభించెను. దిగ్గజుఁడు నోరునట్లే విప్పియుంచెను. ఆమె నోరంతయు తాంబూలద్రవ్యములతో నిండియుండెను. ఆమె యాతమ్మ నాతనినోట నుంచెను. పాపము గజపతి యిరుకునఁబడెను. దుఃఖాకరమయ్యెను. ప్రియురాలొసంగిన తాంబూలము నమియలేడు ఉమిసిన విరసుఁడందురేమో! పోనిండు! దానిని మ్రింగనులేఁడు. అతఁడప్పుడే భోజనముచేసెను. పాపము నోటినిండనున్న యాతమ్మ నెట్లు మ్రింగగలడు? అందుచే నీలకంఠుని గళమందున్న హాలాహలమువలె నది యక్కడనే యుండెను.

ఇదియే సమయమని ఆస్మానీ దంతశోధకితో నాతని విశాల నాసికారంధ్రముల నట్టెపొడిచెను. ఆతనికొక్క తుమ్మువచ్చెను. తత్క్షణమే యాతనినోటనున్న యమృతము

పక్షివాహరూపమున నతివేగముగ బయలువెడలి యాతని శరీరమునంతను ముంచివైచెను.

సందేహావస్థనుండి విడివడి బ్రాహ్మణుఁడు శరీరమును గడిగికొని యీక్రింది మనోహరగీతమును బాడెను.

'దక్షిణే పశ్చిమే వాపి నకుర్యాద్దంతధావనమ్'



## ప దు నా ల్గ వ ప్ర క ర ణ ము

### దిగ్గజుని బలాత్కార ప్రయాణము

అట విమల యాష్మానీ యెంతసేపయినను రాలేదని తొందరపడుచుండెను. ఇఁక నిట వేచియుండినఁ గార్యములేదని తలంచి గజపతిని స్వయముగ వెదకుటకామె బయలువెడలెను. కుటీరములోనికి వచ్చుచుండుటంగని యాష్మానీ 'రమ్మ! చంద్రావళి! రమ్మ' అనియెను.

గజపతి 'ఈదినము సుదినము. ఉదయమున శయ్యనుండి నేనేశుభముహూర్తమున లేచితినో? ఒకటేచాలును. రెండువచ్చినవి. శాస్త్రమిట్లు చెప్పుచున్నది.'

'ఏకచందస్తమోహంతి నచమూఢశతైరపి'

ఆష్మానీ—'ఈరసిక శేఖరుఁడు వర్ణభ్రష్టుఁడయ్యె, వింటివా?'

గజపతి—'అదియెట్లు?'

ఆ—నేనెంగిలిచేసిన యన్నమును నీవు భుజింపలేదా?

గ—'ప్రపంచక విషయమయిన యుపద్రవమందే మున్నది? అన్నము పవిత్రమయినది. నీవు తల్లి భగవత్స్వ రూపిణివి'

'ప్రో! ప్రో!'

విమల యూష్మానీ చెవిలో రహస్యముగ 'ఇతఁడు రాఁడా?' అనియెను.

'ఆవిషయమింకను ఇతనితోఁ జెప్పలేదు.'

'అయిన నేఁజెప్పెదను. ఓరసికశేఖరా! నేను ముఖ్యముగ నొకమాట చెప్పవలసియున్నది.'

'అదియేమి'

'నీకు మాయందుఁ బ్రేమకలదా?'

'ఆహా! ఏమిప్రశ్న?'

'మాయిరువురియందును'

'ఇరువుర! ఇరువురియందును'

'నేఁజెప్పినట్లు చేయుదువా?'

'సందేహమేమి?'

'తత్క్షణమేనా?'

'తత్క్షణమే?'

'ఈనిముసము నేనా?'

'ఈనిముసముననే'

'మేమిరువుర మిప్పుడెందులకు వచ్చితిమో నీవెఱుంగుదువా?'

'నేనెఱుఁగుదును'

'మేము నిన్నుఁ దీసికొని లేచిపోయెదము' అని యూషాన్మనీ చెప్పెను.

బ్రాహ్మణుఁడు మూఁగవానివలె నయ్యెను. నోరు దెఱచుకొని యట్లుకూర్చుండెను. విమల యతిప్రియత్నమున నవ్వునాఁపుకొని 'మాటాడవేమి?' అనియెను.

'న్యా—న్యా—న్యా—ట—ట—ట'

'అయిన నీవు రావా?'

న్యా—న్యా—న్యా—ట— ట—ముందు స్వామి యొద్దకేగి చెప్పవలదా?

'ఆయనతో నేమి చెప్పెదవు? మీ గురువుగారితో యోచించుటకిది మీయమ్మ తద్దినమనుకొంటివా?'

'కాదు, కాదు. అయిన, వెళ్ళనక్కఱలేదు. కాని, మీ రేదినమున వెళ్ళెదరు?'

'ఏదినముననోనా? ఇప్పుడే, నేనలంకృతనై వచ్చితిని చూడలేదా!'

'ఇప్పుడీనిమిషముననేనా?'

'ఔను. ఎందులకుఁగారాదు? నీకిష్టములేదని చెప్పుము మేము మఱొకనిని వెదకుకొనెదము. మా మనస్సులు మాత్రము నీపయిననే యున్నవి.'

గజపతి చాలకాలమోర్పు వహింపలేకపోయెను.

'మంచిది నేను సిద్ధముగనున్నాఁడను'

'అయిన వస్త్రమును బుచ్చుకొనుము'

దిగ్గజుఁడు నమబలిపుచ్చుకొనియెను. విమల ప్రయాణోద్యుక్తమయ్యెను. గజపతికూడఁ బోవసిద్ధపడి 'సుందరీ'

'ఏమనియెదవు'

'మనము మరలవచ్చుటెప్పుడు?'

'మరల వచ్చుటయా? మనముస్థిరముగఁబోవుట లేదా? మనము ముప్పురమును మఱియొక దేశమున దంపతులమై చరింతము.'

దిగ్గజుఁడు పరమానందమునొందెను.

'అయిన నీవస్తువులన్నియు నిట వదలి వేయనా?

'అవశ్యము. అవి నిరర్థకములు.'

'ఈయి త్తడిపాత్రిలను నెట్లయిన విడువవలసినదేనా?'

'భయపడకుము. వీని నన్నిఁటిని నేను మూల్యము నిచ్చి పుచ్చుకొనెదను.'

బ్రాహ్మణుఁడు కొంచెము విచారపడియెను. కాని యేమిచేయగలఁడు? వారియిష్టము ననుసరించి ప్రవర్తింప వలయునుకదా! లేనిచో వారియెడఁ దనకుఁ బ్రేమలేదను కొందురేమో యని యాతని సందేహము. అతఁడు విమలతో నిట్లనియెను.

'పోనిమ్ము. ఈఖుంగిపతియో?' (పుస్తకములుంచు కొనెడి యీతాకులపెట్టె)

'ఇట్టివి బండ్లకొలఁది నున్నవి' అని విమలయనుకొని 'త్వరపడుము'

విద్యాదిగ్గజున కున్నవి మొత్తమున రెండుపుస్తకములు. అందొకటి సంస్కృతవ్యాకరణము. ఒకటి హిందూధర్మ శాస్త్రము. 'వ్యాకరణముతో నిఁక నాకేమి పనియున్నది. అదియంతయు నాకుఁ గరతలామలకమే గదా! ధర్మశాస్త్రము మోసికొనిపోయెదఁగాక' అని యాతఁడు దాని నాపెట్టెయం దుంచెను. దుర్గా! శ్రీహరీ! అని కేకవైచి విమలతోడను, నాషామ్మనితోడను, బయలువెడలెను. కొంతదూర మరిగినపిదప నాషామ్మని 'నడచుచుండుఁడు నేను పిదపవచ్చి కలిసికొనెదను' అనిచెప్పి యామె గృహమునకుఁబోయెను. విమలాగజపతులు పోవుచుండిరి. చీఁకటిలో వారు తెలిసికొననే లేదు. అప్పుడే కోటఁదాటిపోయిరి. కొంచెము దూరమరిగినపిదప దిగ్గజుఁ డిట్లనియెను. 'అషామ్మనీ రాలేదేమి?

'ఆమె రాదుగాఁబోలు! నాయొక్క తెతోను వచ్చుటకు నీకిష్టములేదా?'

బ్రాహ్మణుఁడు మౌనము వహించెను. కొంతసేపుండి నిట్టూర్పువిడిచి 'అయ్యో! పాత్రములారా!' అనియెను.

---

## పదునేనవ ప్రకరణము

—♦—

### దిగ్గజుని ధైర్యము

విమల త్వరగత్వరగ నడచుచుండెను. గరమందరము దాఁటెను. రాత్రి గాఢాంధకారము. నక్షత్రములకాంతినామె

జాగ్రత్తగా నడచుచుండెను. పొలమునఁ బ్రవేశించెను, కొంచెము దిగులువడియెను. గజపతియొక్క మాటలైననాడుట లేదు. అట్టిసమయమున మనుష్య కంఠధ్వని యెంతసంతోష దాయకము! ఎంతభయనివారకము! ఎంతసుఖకరము! అందుచే విమల దిగ్గజునిట్లు పలుకరించెను.

'రసికాగ్రగణ్యా! ఏమియాలోచించుచున్నావు?'

'నాయిత్తడిపాత్రములఁగూర్చి'

విమల మాఱుపలుకలేదు. తనలో నవ్వుకొనుచుండెను. మరల కొంతసేపటికి 'దిగ్గజా! దయ్యములనిన నీకు భయము కలదా?' అని ప్రశ్నించెను.

'రామ. రామ. రామ. రామనామోచ్చరణ మొనర్పుము' అని కేకవైచుచు విమల కొకగజము సమీపమునకు వచ్చెను.

ఈమార్గమున దయ్యములబాధ చాలఁగ నున్నది'

దిగ్గజుఁడు మిక్కిలి సమీపమునకువచ్చి వ్రేలాడు చున్న యామె చీరచెఱఁగును బట్టుకొనియెను. విమల యిట్లు చెప్పుచుండెను.

'అనాఁడు మేము శైలేశ్వరుని యాలయమునుండి వచ్చుచున్నప్పు డాత్రోవప్రక్కనున్న మఱ్ఱివృక్షముకడ నేదియో కనఁబడినది. చాలభయంకర రూపముకలది'

ఆమెచీర లాగఁబడుచుండుటనుబట్టి బ్రాహ్మణుఁడు రావియాకువలెఁ గంపించుచున్నాఁడని యామె తెలిసికొని యెను. ఆవిషయమునుగూర్చి యింకను జెప్పినచో నిఁకచల

నమేయుండదు. అందుచే నాప్రసంగమును జాలించి "రసిక శేఖరా! నీవేమయినఁ బాడఁగలవా?" అని యడిగెను.

"ఆ! పాడఁగలను"

"కూనిరాగమును దీయని రసికుఁడుండునా? పాడుము"

♦ దిగ్గజుఁడిట్లు పాడఁదొడంగెను.

శ్యామలగాత్రుఁ కదంబస్థితుఁగను
సమయము చెడ్డదియే సఖివామలో
చనయిటు వినవే పరవశనయి
పోయితినే

ఈవిపరీతపుధ్వనిని వినియాపక్రిక్కను నెమరువేయుచు మెల్లగఁ బండుకొనియున్న యొక గోవతివేగముగఁ బ్రాణ సంరక్షణార్థమై పరుగెత్తనారంభించెను. ఏదియెట్లున్నను నాతఁ డింక నీరీతిని పాడుచునేయుండెను.

(*) తత కేకికలాపకునిర్ఘ మురళీధరుఁ
గనివెనుకన్ మతిదప్పిపోయిననాఁడే
కులమున మచ్చనుడెచ్చితినే

---

♦ ధా స ధ సా రి రి గా మా రి రి గ మ ప
ప రి రి గ రి స ని సా గ మ పా ధ బా
మ మ గ గ రి రి గా మ మ ధ ధ ధ ధ
ప మ గ రి సా

(*) ప ప సా స స రీ స రి గా మ గ రీ గ మ సా రి రి
గ రి స ని సా గ మ పా ధ పా ప మ గా రీ
గ గ మ మ ధా ధ ప మా గ రి సా

• చెలిమాతని నవ్వులు వెన్నెలలే పలుకాడిన తేనెలు
చిప్పిలునే చెలియాతనినవ్వులు ముద్దులపల్కులు గని
మతిచెడిన దిఁకేమందురా.

దిగ్గజుఁ డెంతయోకాలము పాడలేదు. ఆకస్మికముగ నాతనిచెవి కప్పరోంగనా వీణాగానస్వరసమ్మేళనమై యతి మనోహరమై యమృత తుల్యమైన మధురగానధ్వనియొకటి వినవచ్చెను. విమల హెచ్చుస్థాయిని పాడుచున్నది. ఆగాన మామెదియే.

అత్యంతమనోహరమై మహోల్లాసకరములగు సప్త స్వరములను, నారాత్రియందు నిశ్శబ్దమయిన యాకాశము నంతట వ్యాపింపఁ జేయుచుండెను. ఆగానధ్వని మందమలయ మారుతముతోఁ జేరి నేతెంచుచుండెను. దిగ్గజుఁ డాగీతము నత్యంతశ్రద్ధతో వినుచుండెను. ఆమె మానివేయుటతోడనే "మరల" అని దిగ్గజుఁ డనియెను.

"మరల నేమి"

"మనోహరమైన కీర్తనయొకటి పాడుము."

"ఏమి పాడుదును"

"వంగదేశపు కీర్తనము పాడుము"

"అట్లే" ఇట్లు చెప్పుచు విమల పాడనారంభించెను.

ఇంతలో నామెధరించినవస్త్రముచెఱఁగు గట్టిగ లాగ

---

•స రి గా గ గ గా రి గ మా మ మ మా గ పా ప ప పా మ గ రీ రి రి రీ ప మ గా గ గ గా మ గ రీ రి రి రీ గ మ ప ధ ప మ గ మ గ రి సా సా సా

బడియెను. ఆమె వెనుకకుఁ దిరిగిచూచెను. బ్రాహ్మణుఁడు వేలాడుచున్న యామె చీరచెఱఁగును గట్టిగఁ బట్టుకొని పాదపమీపమున ప్రాణములన్నియు బిగబట్టుకొనియుండెను. విమల యాశ్చర్యపడి 'అది యేమి?' అట్లుపడిపోయినాఁడవు మరల దయ్యము కనఁబడెనా యేమి'—అనియడిగెను.

బ్రాహ్మణుఁడు మాటాడలేకపోయెను. వ్రేలితోఁ జూపుచు "అక్కడ" అనియెను. విమల యావైపునకుఁ జూచెను, కష్టముమీఁదవచ్చు నుచ్ఛ్వాసము లామెచెవులం బడియెను. తోఁపకుసమీపమున నేదియో యున్నదని యామె కనిపెట్టెను

ధైర్యము తెచ్చుకొని బాగుగఁ బరికించెను. అది చక్కగ నలంకరింపబడిన యొక యశ్వము. ప్రాణావసాన సమయమున నెగయూపిరి విడుచుచున్నదని యామె తెలిసికొనెను.

విమల నడువ నారంభించెను. ఆగుఱ్ఱమును జూచినప్పటినుండియు నామెఏమికీడుమూడునో యని భయమొందుచుండెను. చాలసేపు నిశ్శబ్దముగ నుండెను. అర్ధక్రోశము నడచిరి. దిగ్గజుఁ డామెను మరలలాగెను. విమల "ఏమి" అని యడిగెను. గజపతి యొకవస్తువు నామెకుఁ జూపెను.

"ఇదియొక సైనికుని తలపాగ" అనిచెప్పి విమల యోచనాసముద్రమున మునింగెను.

చంద్రోదయమైనది. విమల యింకను నేదియో యోచించుచునేయుండెను. చాలసేపు గడచినపిమ్మట దిగ్గజుఁడు

ధైర్యము తెచ్చుకొని యిట్లనియెను. "సుందరీమణీ! నీవు మాటాడుటలేదేమి?"

"ఈత్రోవపైనున్న గుర్తులను జూచినావా?"

గజపతి సవిమర్శదృష్టితో మార్గమునుజూచి ఇట్లు బదులుచెప్పెను.

"ఔను. ఎన్నియోగుఱ్ఱపుడెక్కల గుర్తులున్నవి."

"ఆ! వివేకమన నిట్లుండవలయును. దీనినిబట్టి నీవేమ యిన గ్రహించితివా."

"లేదు"

"అదిగో మరణించిన గుఱ్ఱము, ఇదిగో సైకికుని తల పాగ, ఇదిగో నిటనశ్వముల కాలిచిహ్నములు. వీనినన్నిటిని జూచియు నీవేమియును గ్రహించుకొనలేదా? నేను వేఱెచెప్ప వలయునా?"

"అయినవిశేషము లేమి?"

"ఇప్పుడే యెందఱో సైనికులీమార్గమున నడచినారు'

"అయిన, వారు మనలను మించి చాలదూరముపోవు వఱకును మనము మెల్లగఁబోవుదము" అనియాతఁడు భయ ముతో ననియెను. విమల విచారముతో నిటు బదులు చెప్పెను.

"ఓయి మందబుద్ధీ! మనలను మించిపోవుటనుచుచెప్పు చున్నావేమి? ఆచిహ్నము లెటువైపునకున్నవో చూడ లేదా? ఈసైనికులు గరమందరము ప్రక్కకేగినారు"

విమల విచారపడెను. శైలేశ్వరాలయము దృష్టిపథ

మునఁ బడియెను. విమల యిట్లు యోచించెను. "ఈ బ్రాహ్మణుఁడు జగత్సింగును జూడరాదు. చూచిన కీడు మూడఁగలదు. ఈతనిని దప్పించుకొను టెట్లు?" ఆమె యిట్లు యోచించుచుండ బ్రాహ్మణుఁడా మెకుఁ దప్పించుకొనుమార్గమును జూపెను. చీరచెఱఁగును మరల లాగెను. ఆమె తిరిగిచూచి "ఏమి" అనియెను.

"దానికది యెంతదూరమున్నది?"

"దేనికి?"

"ఆమఱ్ఱిచెట్టునకు"

"ఏమఱ్ఱిచెట్టునకు?"

"నీవాదినమున దానినెక్కడఁ జూచితివో యాచెట్టునకు."

"దేనినిజూచితిని"

"రాత్రులయందు పేరు చెప్పరాదు."

విమల యాతనియుద్దేశ్యమును గ్రహించెను. సమయమునకు బాగుగ జ్ఞప్తికివచ్చెనని తలంచి పెద్దకంఠధ్వనితో "ఓహో" అనియెను.

"అదియేమి? అదియేమి" చెప్పవా? అని యాతఁడాత్రముతో నడిగెను.

విమల శైలేశ్వరుని యాలయముకడనున్న మఱ్ఱిచెట్టును జూపి "అదిగో యదే మఱ్ఱిచెట్టు" అని మెల్లగా ననియెను. దిగ్గజుఁడొకయంగుళమైన ముందున కడుగిడలేదు. ఇఁక నడుగిడలేదు. నిశ్చయము.

ఆకులవలెఁ గంపింపఁజొచ్చెను. విమల యిట్లనియెను.

"నాతోఁగూడరమ్ము"

"నేనిఁక నొక్క యడుగైన వేయఁజాలను." అని యాతఁడు వడకుచుఁ జెప్పెను.

"ఔను నేనుకూడ భయపడుచుంటిని."

బ్రాహ్మణుఁ డొకయడుగు ముందునకు వైచి పరుగెత్తిపోవ సిద్ధపడియెను. విమల చెట్టువైపునకుఁ జూచెను. ఆవృక్షముకడ తెల్లని రూపమొకటియున్నది. అది శైలేశ్వరుని నందివాహనమని యామె యెఱుంగును. గజపతితో నిట్లు చెప్పెను.

"నిన్నుఁ గాపాడునీయిష్టముదైవమును స్మరించుకొనుము. చెట్టుక్రిందనున్న దానిని జూచితివా?"

"ఓభగవానుఁడా! రక్షింపుము, రక్షింపుము" అని కేక వేయుచు నాతఁడు వెనుకకుఁ బరుగెత్తెను. ఆతని కాళ్లుచాల పొడవైనవి. వాని యనుగ్రహమున నాతఁడొక క్షణికములో నర్ధక్రోశము దాఁటిపోయెను.

విమల గజపతి స్వభావముబాగుగ నెఱుంగును. ఆతఁడు దిన్నఁగ దుర్గద్వారముకడకుఁ బోవునని యాలోచించెను. అందుచే నించుకేనియు సందేహమొందక యామెయాలయము వైపునకు నడచెను.

విమల యింతకుఁబూర్వమాలోచింపని విషయమొకటి యిప్పుడు జ్ఞప్తికిఁ దెచ్చికొనెను. "జగత్సింహుఁ డాలయమునకు వచ్చియుండునా?" ఈయాలోచన మామెకుఁ జాలవిచా

రము గలిగించెను. అతఁడు తప్పకవచ్చెదనని వాగ్దత్తమొసగియుండలేదు. అతఁడు చెప్పిన దేమి? "ఈయాలమునను నన్నుఁ జూడఁగలవు. లేనిచో నన్నెప్పుడును గనలేవు" అనికదా! ఈవాక్యములఁబట్టి చూడనాతఁడు వచ్చుటకంటె రాకపోవుటకే యెక్కువయవకాశమున్నది. అతఁడు వచ్చియుండనిచో వృథాప్రయాసముకదా! ఆమెయిట్లు చింతించెను.

"అయ్యో! నేనీవిషయము నింతకుముందేల యాలోచింపనైతిని? బ్రాహ్మణు నేల మరలఁ బంపివైచితిని? ఈ యర్ధరాత్రిమున నేనొక్కతెను మరలి పోవుటెట్లు? ఓ శ్రీశైలేశ్వరా? ఏమిచేయుచున్నావో కదా!"

ఆలయముకడకుఁ బోవలసినచో నామఱ్ఱివృక్షముక్రింద నుండియే పోవలసియుండెను. విమల యెట్లో పోవుచుండెను. అట నందివాహనములేదు. ఇంతకుఁ బూర్వముచూచిన తెల్లని రూపమును లేదు ఆమె కొంచెమాశ్చర్యపడెను. వృషభముండిన నట నెక్కడనో స్పష్టముగ నగపడవలసినదే కదా!

విమల యాతపప్రికాండము వంక వీక్షించెను. దాని కావలప్రక్కనున్న మనుష్యుని తెల్లదుస్తులయొక్క యొక భాగముకనుపట్టెను. ఆమెచాలభయపడియెను. అతిశీఘ్రముగ నామెట్లనుదాఁటి యాలయము కడకుఁబోయి శక్తికొలఁదిని దలుపును ద్రోసెను. అది వేయఁబడియుండెను. "ఎవరక్కడ" అని కేకవైచెను. విలువంపైన యాకట్టడమునుండి "ఎవరక్కడ?" అని ప్రతిధ్వని వినవచ్చెను. విమల ధైర్యమును దెచ్చుకొని యిట్లనియెను.

"మార్గాయాసము నొందియున్న యబలను."

తలుపువీడెను. లోనదీపము వెలుగుచున్నది. ఆమె ముందున్నతుడగు మనుష్యుఁడొకడు నిలువఁబడెను. ఆతని చేతఁగత్తితోనున్న యొఱయొకటియుండెను. విమల యాతనిఁ జూచెను. ఆనవాలుపట్టెను. ఎవరు?

రాజాజగత్సింహుఁడు.

---

పదునాఱవ ప్రకరణము

—♦—

శైలేశ్వర సన్నిధానము

విమల విశ్రాంతిఁజెందుటకై కూర్చుండెను. శైలేశ్వరునకును రాజునకును వందనములొనర్చెను. కొంతసేపటి వఱకును ఇరువురునుమాటలాడలేదు. వారిహృదయములోకరి కొక రెట్లుతెంగింపవలయునో వారెఱుంగలేకపోయిరి. ఇరువురును గలవరమొందిరి. మాటలాడ నారంభించుటెట్లు? ఇట్టి విషయములలో విమల పూర్ణప్రజ్ఞకలది. మాటలాడనుగలదు. ఊరకుండనుగలదు. చిఱునగవుతో నామె యిట్లనియెను.

"శైలేశ్వరుని యనుగ్రహమున మిమ్ము మగలఁజూడఁ గలిగితిని."

ఈయర్ధరాత్రిమున నాకుఁ జాల భయమయినది. మిమ్ములనుజూచుటతోడనే మరలధైర్యము గలిగినది.

"మీకందఱకు క్షేమమా?"

జగత్సింహుడు తిలోత్తమయందు నిజముగ బద్ధానురాగుఁడైయుండెనో లేదో ముందు తెలిసికొనినపిదపఁ దక్కిన విషయములను బ్రసంగింపవలయునని విమల తలంచి యిట్లు చెప్పెను,

"చిత్తము, మీక్షేమముకొఱకే శైలేశ్వరుని బూజింప నిటకువచ్చితిని కాని, మీరలొనర్చిన యర్చనలచే దేవుఁడు సంప్రీతుఁడయినాఁడు. ఇఁక మాపూజ లంగీకరించునా? కావున సెలవుఁగైకొని మరలిపోయెదను."

"మంచిది. నీవొక్కతెవుఁబోలేవు. నేను నీకు సహాయము వచ్చెదను."

జగత్సింగు కేవల మాయుధవ్యాపార తత్పరుఁడయి యుండలేదని విమల గ్రహించెను.

'నేనొక్కతె నేలపోలేను?'

'మార్గమందే దేని యుపద్రవము గలుగవచ్చును'

'కలిగిన మానసింహ మహారాజుకడకుఁ బోయెదను'

'ఎందులకు?'

'మీచే నియమింపఁబడిన సేనాధిపతి రాష్ట్రప్రజలకు మార్గమధ్యమునఁ గలుగు నుపద్రవముల నణంప నశక్తుఁడుగ నున్నవాఁడు; శత్రునిర్మూలనా సామర్థ్య మాతనికడలేదు' అనిమహారాజుతో విన్నవించుకొనెదను.

'శత్రువులను నాశనమొనర్ప నీశ్వరునకైనను సాధ్యముకాదు. ఇఁక మనుష్యుడన నెంత? చూడుము. ఈశ్వరుఁడు తనకోపాగ్నిచే నగజుని భస్మముచేసినాఁడుకద! పదు

నేనుదినములక్రిందట నీయాలయమునందే యామన్మథుఁడే యద్భుతముగఁ దనప్రతాపము నగపఱచుచు కలవర మొందించినాఁడు. ఈశ్వరుని పరాక్రమట్టిది. ఇఁక మనుష్యుఁడన నెంత?' అని సైన్యాధిపతి సమాధానము చెప్పుకొనెను.

'ఎవరిని గలవర మొందించినాఁడు' అని విమల చిఱునగవుతో నడిగెను.

'సేనాధిపతినే'

'ఏమి? మహారాజీయసాధ్యకార్యమును నమ్మునా?'

'నాకు సాక్షులున్నారు?'

'ఎవరు?'

'నీవు. మంచిస్వభావముగల—'

"ఈమీపరిచారిక దుస్స్వభావముగలది. నన్నువిమలా యని పిలువవచ్చును'

"నాకుసాక్షి విమల'

'కాదు. విమల యెప్పుడు నట్టిసాక్ష్యమీయదు'

'కావచ్చును. పదునేనుదినములలోపలనే తాను చేసిన వాగ్దత్తమును, మఱపుఁ జెందినయామె. యెప్పుడును సరియైన సాక్ష్యమునీయదు.'

'నేనేమి వాగ్దత్త మొనర్చితిని?'

'మీసఖి వంశనామము లెఱింగింప వాగ్దత్తమొనర్చియుండలేదా?'

'విమల కంఠధ్వని యింతలో మార్పుచెందెను.'

"రాకుమారా! ఆవిషయమును మీకడఁ దెలుప సం

దియమందుచున్నదానను. ఆమె యుదంత మెఱింగించి మీ మనస్సునకు సంతాపము గలుగ జేసినదాన నగుదునేమోయని భయమగుచున్నది'

రాజపుత్త్రుడొక్కించుక యాలోచనముచేసెను. పరిహాస వచనములు చాలించి యిట్లనెను.

'విమలా! ఆమెవృత్తాంత మెఱింగించుట వలన నా కసౌఖ్యముగలుగుననియే తలంచుచుంటివా?'

'ఔను'

జగత్సింగు కొంచెమాలోచించి మరల నిట్లనియెను. 'ఏమిరానున్నదో రానిమ్ము. నామనోరథ మీడేర్పుము. ఆమెయెవ్వరో యెఱుంగఁజాలకపోవుటచే దుస్సహపరితాపతప్తుఁడ నగుచున్నాఁడను. ఈపరితాపమునకంటె వేఱుపద్రవ మేమియునుండదు. ఒకవేళ నీవు తలంచినదియే సత్యమైనను నిప్పుడు నేననుభవించుచున్న వేదనకంటెనదియధిక బాధాకరముగనుండదు. పిదప నేనెట్లో చూచుకొనియెదను. ముందీ పరితాపాగ్నిఁ జల్లార్పుము. విమలా! నేను వినోదముకొఱకిటకు రాలేదు. వినోదముగా యథేచ్ఛతోఁ జరించుటకు నాకిప్పు డవకాశములేదు. ఈపదునేను దినములనుండియు గుఱ్ఱముపీఁపుదక్క వేఱుశయ్య నెఱుంగను. నాహృదయమునకు విశ్రాంతిలేదు. నీకొఱకు యత్నించుచున్నాఁడను''

అతని గుట్టుఁదెలిసికొనుటకే విమల యిదివఱకట్లు మాటలాడెను. ఆమె యభీష్టము నెఱవేఱినది. జగత్సింహుని యభిప్రాయమును దెలిసికొనియెను. అయిన నింకను నాతని హృదయమును దెలిసికొనఁగోరి యామె యిట్లనియెను.

"రాజపుత్త్రీ! నీవు రాజనీతివిదుఁడవు. ఈయుద్ధసమయమున నీకులభ్యముకాని యొకయువిదయందు బద్ధానురాగుడవై పరితాపమందుచుందువా?"

'నీవామెనుమఱచిపోయితివా, ఇరువురకును శ్రేయమే, నీకుయుద్ధమున జయముగలుగును.'

'ఆఁ! ఎవరిని మరచిపోవుట?' ఆతని యధరోష్ఠము మనోవ్యాకులభావ గర్భితమైన మందహాసమును సూచించుచుండెను. "ఆఁ! ఎవరిని మఱచిపోవుట? మీచెలిరూపము ప్రథమావలోకన సమయముననే నాహృదయమున మలఁచినట్లు స్థిరముగ నాఁటుకొనినది. ఈశరీరము భస్మమయినఁగాని యాహృదయమునుండి యారూపము విడిచిపోవుటెట్లు జనులు నన్ను కఠినహృదయుఁడటందురు. ఆాతిమీఁద మలఁచినది. ఆాయి నశించినప్పుడుదక్క నశింపదని నీవెఱుంగవా? యుద్ధమునుగూర్చి యేదియో మాటలాడితివి. నేనా లావణ్యరాశిని జూచినదిమొదలు రణములోననే యుంటిని. రణరంగమున నున్నను నింటికడనున్నను నామె ముఖలావణ్యమొక్కనిమిషమైన నాహృదయమునకు మఱపురాలేదు. పఠానుఁడు నాతల నఱుక చేయియెత్తినప్పుడు నాహృదయమునకు ముందుగ నీవిషయమే జ్ఞప్తికివచ్చెడిది. 'అయ్యో! ఇట వీరమరణము నొందితినేని యిఁక నీజన్మమున నాకాయువతీరత్నమును దర్శించుభాగ్యము లభింపకపోవునుగదా! ప్రథమావలోకనమే కడసారి చూపగునుగదా!' అని విచారించెడివాఁడను. 'విమలా! మీచెలిఁజూడ నేనెచ్చటికుఁ బోవలయును?'

విమలకు సంశయ విచ్ఛేదమయ్యెను. ఇఁక నాతని హృదయమును దెలిసికొననగత్యమేమికలదు? అమె యాత నితో నిట్లనియెను. 'నీవాసుదతీమణిని గరమందరమునఁగాం చఁగలవు, ఆమెపేరు తిలోత్తమ. వీరేంద్రసింహుని తనయ.'

జగత్సింగునకు సర్వదష్టమైన ట్లయ్యెను. అవనతశిర స్కుండై ఖడ్గమునకుఁ జేరగిలఁబడి నిట్టూర్పువిడిచెను. చాల సేపటికి 'విమలా! నీవనినమాట నిజమైనది. తిలోత్తమ నాతిలోత్తమకానేరదు. రణమునకుఁ బోయెదను. నాభవి ష్యత్సౌఖ్యమునందలి యాశలన్నియు శత్రువుల రక్తములోఁ గడిగివైచెదను'' అని విచారముతో ననెను.

విమలయుఁ జాలవిచారమొందెను. ''రాజకుమారా! ఈప్రపంచమున వాస్తవానురాగముగలవారెప్పుడైన జయ మొందిరేని నీవును తిలోత్తమను బరిణయమాడఁగలవు. ఇంత లోనే నిరాశఁజెందనేల? అదృష్టమీదినమునఁ బ్రతికూల ముగ నుండిన రేపనుకూలముగ నుండవచ్చును'' అనియెను.

ఆశావాక్య మెంతో మధురమయినది. ఆశాదేవత మహాగాఢాంధకార దినమున మానవుని చెవియందు రహస్య ముగ నేదియో మాటలాడును. ''మీరంతగా చింతించు చున్నారెందులకు? నామాట వినుఁడు. మబ్బును వానయు శాశ్వతముగా నుండవు.''అని యాశాదేవత విమలాముఖ మున వాక్రుచ్చెను. జగత్సింహుఁ డామాటలు వినెను. భగవ దుద్దేశము నెవ్వరు చెప్పఁగలరు? అదృష్టవిధానములను ముం దుగ నెవరు తెలిసికొనఁగలరు? ప్రపంచమున నసాధ్యమగు

కార్యమేదికలదు? ఎన్నియసాధ్యకార్యములు ప్రపంచమున సాధ్యమగుటలేదు.

జగత్సింహుఁడాశాబద్ధుఁ డయ్యెను. ఇట్లనియెను.

"ఈదినమున నాకు మనస్స్థిమితములేదు. కర్తవ్యనిశ్చయము సందసమర్థుఁడను. విధివిధానము జరిగితీరును. అది యవిలంఘ్యము. హృద్గతమును వెలిబుచ్చుచున్నాఁడను. ఇది శైలేశ్వరుని సన్నిధిని శపథ మొనర్చుచున్నాఁడ. తిలోత్తమను దక్క మఱియెవ్వరిని నేను పరిణయమాడఁబోను. విమలా! నామాటలన్నియు మీచెలితో విన్నవింపుము. ఆమె నిఁక నొక్కమాఱు చూడవలయునని చాలగనభిలాష కలదు. ఇఁక నెప్పుడును నిట్టికోరికఁ గోరను.

విమల ముఖము సంతోషముచే వికసింప నిట్లనియెను.

"మాసఖయిచ్చు ప్రత్యుత్తరము మీకుఁ జేరుటెట్లు?'

"నిన్ను మరల శ్రమపుచ్చుకొనుమని కోరుటకు నాకు సాహసము గలుగకున్నయది. అయినను నానిమిత్తమొక్కమాఱు మరల శ్రమపడి యీయాలయమునఁ గలిసికొంటివేని నేను నీఋణమందుండెదను. ఎప్పుడో యొకప్పు డర్హమైన ప్రత్యుపకార మొనర్చి జగత్సింగు నీఋణమును దీర్చుకొనగలఁడు"

"రాజతనయా! నేను నీసేవకురాలను, నన్నిన్ని విధముల వేఁడుకొన బనిలేదు. అయినను, రాత్రిలయందీత్రోవనురా నాకుఁ జాలభయమగుచున్నది. నావాగ్దత్తమును జెల్లింపక పోవుదుననుభీతిచే నేనీనిశియందు సాహసమునవచ్చితిని. దేశమున శత్రుబాధ లధికముగనున్నవి. నేను మరల రాలేను"

జగత్సింహుఁడు కొంచెమాలోచించి యిట్లనియెను. 'విమలా నేనొక్కమాట చెప్పెదను. నీకుఁదప్పగానుండనిచో నేను నీతోఁగూడ గరమందరమునకువచ్చి యనువయినప్రదేశమున రహస్యముగ నుండెదను విూచెలిహృదయము నట నాకెఱింగింపవచ్చును"

"అయినరమ్ము" అని విమల యాహ్లాదముతో నని యెను.

వారాలయమునుండి నిర్గమింపనుద్యుక్తులైరి. ఇంతలో నాలయమున కావలప్రక్క నెవ్వరో మెల్లగ నడచుచున్న ట్లడుగులధ్వని వారికివినవచ్చెను.

జగత్సింహుఁడు. "నీవెవరినైనఁగూడఁ దీసికొని వచ్చితివా?" అని విమల నడిగెను.

"లేదు"

"అయిన మనమిప్పుడు వినినధ్వని యెవరిది? మన ప్రసంగము నవ్వలనుండి యెవ్వరును వినలేదుగదా!" అని చెప్పుచు నతఁడీవలకువచ్చి యాలయముచుట్టును దిరిగెను. ఎవ్వరును గనఁబడలేదు.

---

## పదునేడవ ప్రకరణము

### వీరపంచమి

శైలేశ్వరునకు వందనమొనర్చి వారిరువురును గరమందరమునకుఁ బ్రయాణమైరి. అతివేగముగ నడచుచుండిరి. ఇరువురును మాటలాడుటలేదు. ఒక్కింతసేపటికి రాజిట్లనియె.

"విమలా! నాకొక్కవిషయమునుగూర్చి మహాశ్చర్యముకలుగుచున్నది. అదివినిన నీవేమిచెప్పెదవో నాకుఁ దెలియదు."

"ఏవిషయము"

"నీవు పరిచారికవు కావని నాయుద్దేశము"

"అట్లు తలంచుచుంటిరేల?" అని విమల మందహాసముతో నడిగెను.

"వీరేంద్రసింహుని తనయ అభిరు ప్రభువు కోడలు కాకపోవుటకొకప్రత్యేక కారణమున్నది. అదిచాలరహస్యము. కేవలము సేవకురాలవేయైనచో నీవాకారణమును దెలిసికొనఁజాలవు"

విమల నిట్టూర్పు విడిచెను.

"కుమారా! నిజమును గ్రహించితివి. నేను పరిచారికనుగాను. అయినను నాదురదృష్టముచే నట్లు సంచరింపవలసి వచ్చినది. అదృష్టమును నిందింపనేల? అది యంత చెడ్డదియునుగాదు." అనివిచారముతో బదులుచెప్పెను.

ఈప్రసంగమామెకు విచారకారణ మని జగత్సింహుఁడు గ్రహించెను. ఆప్రస్తావనను మానివేసెను.

రాజపుత్రా! ఇప్పుడుకాదుగాని మఱియొకప్పుడు నావృత్తాంతమును దెలిపెదను. ఆధ్వనియేమి? మనల నెవఁడైన వెంబడించుటలేదుకదా?"

మనుష్యుల యడుగులధ్వనియుఁ, నిరువురు మనుష్యులు గుసగుసలాడుకొనుధ్వనియు, వారికి వినవచ్చెను. వారొక

మైలు నడచిరి. జగత్సింగు "విమలా! నాకు చాల ననుమానముగనున్నది. చూచి వచ్చెద నుండుము" అని చెప్పి కొంచెము వెనుక కరిగెను. చుట్టును బరికించెను. ఎవ్వరును గనఁబడలేదు. మరలవచ్చి విమలతో నిట్లనియెను. "ఎవఁడో కుటిలుఁడొకఁడు మనతోఁగూడ వచ్చుచున్నట్లున్నది. మెల్లగ మాటలాడుము"

ఒరులకు వినఁబడకుండ మాటలాడుచు నిరువురును గోటయొద్దకు వచ్చిరి.

"నీవిప్పు డీదుర్గమున నెట్లు ప్రవేశించెదవు? అర్ధరాత్రము. ద్వారము బంధించియుండును కదా!"

"నేనివ్వలకు వచ్చునప్పుడందులకుఁ దగిన యేర్పాటు గావించియే వచ్చితిని"

"రహస్యమార్గ మేదయిన నుండెనా?"

"చోరుఁడున్నచోట కన్నముండదా?"

"విమలా! నేనిఁక ముందునకు రానక్కరలేదు. ఈ సమీపముననున్న రసాలవనమునం దుండెదను. తిలోత్తమతో నామాటలుగ నిట్లనుము. "నినొకమాఱు దర్శింపనభిలాష మెండుగఁగలదు. నాకన్నుల కట్టిభాగ్య మలవడఁజేయ వేవిధముల వేఁడుకొనుచున్నాఁడను. అది యిప్పుడు కాకపోయిన పదునేను దినములు—ఒకమాసము—తుదకొక సంవత్సరము గడచిన పిమ్మటనైనను సరియే"

"అవన మంత రహస్యమైనదికాదు. నాతోఁగూడ రమ్ము"

"ఇంక నెంతదూరము?"

"దుర్గములోపలను"

రాకుమారుడు కొంచెము యోచించెను.

"విమలా! నేనట్లు చేయఁజాలను. యజమానునియాజ్ఞ లేకుండ దుర్గమునఁ బ్రవేశింపను."

"నీకు భయమేమి"

"క్షత్రియజన్మ మెప్పుడును భయమన్నమాట యెఱుంగదు కాని, యబ్నిమప్రభువు తనయుఁడు దుర్గేశుని యెఱుక లేకుండ దుర్గమునఁ బ్రవేశించిన నది చౌర్యమనిపించు కొనదా?" యని కోపముతోఁ బలికెను.

"నేను నిన్నుఁదీసికొనిపోవుచుండఁ జౌర్య మెట్లగును?"

"నేనిట్లనుచున్నానని యన్యథా భావింపకుము. నీవు పరిచారికవు. నన్ను కోటలోని కాహ్వానము సేయుటకు నీకు స్వాతంత్ర్యమేమికలదు?"

"నాకు స్వాతంత్ర్యముకలను. ఆవిషయమున నీకు నమ్మకము కలిగినపిమ్మటనే రావచ్చును"

"అట్లే!"

విమల రహస్యముగ నాతనితో నేదియో చెప్పెను.

"అమ్మా! దయచేసి నడువుము. నేనును వచ్చెదను"

"నేను సేవకురాలను నీవట్లనరాదు. నాకాజ్ఞాపింపుము"

"నీయిష్ట మెట్లట్లే"

వారు నడచుచున్నతోవ దుర్గద్వారముకడకుఁబోవును.

ఆఫ్రికా మామిడితోఁటకలదు. ప్రధాన ద్వారముకడ కది స్పష్టముగ నగపడదు. ఆమోదరానది వైపునకుఁ బోఁదలఁచిన వా రీతోఁట మార్గముననే పోవలసి యుండును. విమల ప్రధానమార్గమును విడిచి తోఁటలో ప్రవేశించెను. రాజా మెతోఁగూడ నడచుచుండెను.

వారందుఁ బ్రవేశించిన తోడనే క్రింద రాలియున్న యెండుటాకులు నలిగి యెవరో మనుష్యులు నడచుచున్నట్లు ధ్వని వినవచ్చెను. విమల 'మరల' అనియెను.

"ఒక్కించుక సేపిట నాఁగుము. నేనుచూచివచ్చెదను" అనిచెప్పుచు జగత్సింహుఁడొఱనుండి కత్తిదీసి ధ్వని విన వచ్చిన త్రోవఁబట్టి పోయెను ఎవ్వరును గానరాలేదు. ఆ మామిడితోఁపునందడుగు భాగమంతయు నడవి మొక్కల పొదలతో నిండియుండెను. మఱియు వృక్షచ్ఛాయచేగాఢాంధకారమయము. ఏమిగాన వచ్చును? మృగములయొక్క కాలిచప్పుడుచేనైన నీధ్వని కలుగవచ్చును. ఎట్లయినను సంశయవిచ్ఛేదము కర్తవ్యమని నిశ్చయించుకొని జగత్సింహుఁడొక వృక్షాగ్రమున కెక్కెను. చుట్టునవలోకించెను. చాల సేపటి కిరువురు మనుష్యులు గనఁబడిరి. వారిశిరస్సులపైఁ జంద్రకిరణోజ్వలితంబులగు తలపాగ లుండెను. వారొక యత్యున్నత వృక్షచ్ఛాయ గాఢాంధకారమున దాఁగియుండిరి.

జగత్సింహుఁడు వారలను బాగుగ గుర్తించెను. ఇరువురుండుట స్పష్టము. వృక్షమునుగూడ నానవాలు చూచు

కొనియెను. మెల్లగదిగి విమలయొద్దకువచ్చెను. చూచిన దంతయుఁ జెప్పెను.

"ఇప్పుడు రెండుబల్లెములుండెనా"

"బల్లెములున్న నేమి"

"వారెవరో బాగుగ గుర్తించెదను. వారుధరించిన యుష్ణీషములఁబట్టి చూడ దుర్మార్గులగు పఠానులని తోఁచెడిని. వారేదో దురుద్దేశముతో మనలను వెంబడించియుండురు"

విమల కప్పుడు చచ్చిపోయిన యశ్వమును, తలపాగయు, గుఱ్ఱపుకాలి గుర్తులును స్మరణకువచ్చెను.

"మీరిటనుండుఁడు. ఆయుధములను గైకొని వచ్చెదను" అని చెప్పుచు విమల కోటక్రిందకుఁ బోయెను. ఆమె యలంకరించుకొనిన గదియొక్క గవాక్ష మీవనమున కెదురుగ నున్నది. ఆమె యాగవాక్షముకడ కేగి తనకడ నున్న తాళముచెవి ద్వారబంధమునకు వ్రేలాడఁబడియున్న తాళమునఁ బెట్టితిప్పెను. పిదప గడియనుబట్టుకొని గవాక్షమును గోడలోనికిఁ ద్రోచివైచెను. అదియొక క్రొత్తపద్ధతి గవాక్షము కమ్మలసహితముగ గోటలోనికిఁబోయి మార్గమేర్పడియెను. విమల గదిలోఁ బ్రవేశించెను. గవాక్షము నెప్పటియట్లు తీసి తాళము వైచెను. లాగిచూచెను. తాళము సరిగా పడినది. అవ్వలివారలకు రాదని నిశ్చయించుకొనెను.

త్వరితముగ నడచి యాయుధశాలకరిగి యారక్షకునితో నిట్లనియెను.

"నాకు రెండుకుంతములిప్పుడు కావలయు. ఇమ్ము. మరల నవి నీకిచ్చెదను. ఇట్లడిగి పుచ్చుకొంటినని యెవ్వరి తోడను జెప్పకుము"

"అమ్మా! వానితో మీకుఁ బ్రయోజనమేమి?"

"ఈదినమున వీరపంచమి వ్రతమును జేయుచున్నదా నను. స్త్రీలు శూరుఁడగు తనయుఁడు గలుగవలె నని యీ వ్రతమును జేయుదురు. అందాయుధపూజ ముఖ్యము. నాకట్టి తనయుఁడు కలుగవలయునని యభిలాష. ఇదియొరులతోఁ జెప్పకుము"

ఆయుధశాలాధికారి గ్రహింపఁ గలిగినంత గ్రహించెను. ఆదుర్గమునందలి సేవకులందఱు మెకు విధేయులే. ఈతఁడును మఱుమాటాడకుండ రెండు వాఁడికుంతములఁ దెచ్చి యిచ్చెను.

విమల యతివేగమున గవాక్షముకడకు వచ్చి మును పటివలెనే దానిని తెఱచి జగత్సింహునియొద్ద కేగెను.

మిక్కిలి తొందరగఁ బోవుచుండుటవలన, మరల శీఘ్రముగ వత్తమను నుద్దేశముతోడనో విమల గవాక్షమును వేయకుండఁగనే పోయెను. ఇది యపాయమునకు దారిచూపు టయేగదా! గవాక్షమునకు సమీపమున నొకవృక్షముకడ నాయుధపాణియై యొకమనుష్యుఁడు కూర్చుండియుండెను. ఇది యంతయుఁ గనిపెట్టెను. విమల దృష్టిపథమును దాఁటి పోవునఱకు నాతఁ డటనుండి కదలలేదు. పిదపనాతఁడు పాద రక్షలనటవిడిచి మెల్లగనడచి గవాక్షమును సమీపించెను.

లోపల నెవ్వరైన నున్నారేమోయని పరికించెను. ఎవ్వరును లేరు. నిశ్శబ్దముగ లోపలకేగెను. గదిద్వారమునుదీసి కోట లోపలఁ బ్రవేశించెను.

ఇఁక నిట జగత్సింహుఁ డాయుధములను విమలయొద్ద నుండి గైకొని యథారీతిగ వృక్షాగ్రము నధిరోహించెను. తానానవాలుంచుకొనిన వృక్షమువంక వీక్షించెను; ఇప్పు డక్కడ నిరువురు లేరు, ఒకతలపాగయే కన్పట్టుచుండెను. రెండుచేతుల రెండుబల్లెములఁ దాల్చి యాతలపాగకై గుఱి చూచి శక్తికొలది విసరివేచెను. ఎండుటాకుల మర్మరధ్వనులు విననయ్యెను. ఏదియో యొకపదార్థము క్రిందపడినట్లయ్యెను. ఇఁక నక్కడ పాగలేదు. జగత్సింగు గుఱితప్పునా? చెట్ల కొమ్మలనుండి యామనుష్యుని క్రిందపడవైచి మఱితృప్తి నొందెను.

జగత్సింగు వేగముగవృక్షమునుదిగి యామనుష్యుని కడ కరుదెంచెను. అతఁ డాయుధపాణి యగు నొకమహమ్మదీయసైనికుఁడు. చచ్చినట్లు పడియుండెను. కుంతమాతని నేత్రమున గుచ్చుకొనినది.

రాజుజాగ్రత్తగఁ బరికించెను. ప్రాణము పోయినది. ఆయుధమీతని నేత్రములోనే కాదు—మెదడులోఁ గూడ నాటెను. అతని కంచుకమున నొకకాగితమున్నది. జగత్సింగు దానిని పుచ్చుకొని వెన్నెలలో నిట్లుచదివెను.

"కటుల్ ఖానుని పక్షమువా రందఱు నీయుత్తరముఁ

దీసికొని వచ్చినవానియుత్తరువుల కిదిచూచినతోడనే విధే యులు గావలయును"

"కటుల్ ఖాన్"

విమల యామాటలను వినెను. కాని, దానియర్థమును గ్రహింపలేకపోయెను. జగత్సింగు విమలయొద్దకు వచ్చియంతయుఁ జెప్పెను.

"అయ్యో! ఈసంగతి నీకాయుధములను దెచ్చియిచ్చినపుడు దెలుంగకపోయితివికదా! ఎఱింగియుండిన నీకా కుంతములఁ దెచ్చియిత్తునా? నేనెంత పాపాత్మురాలను? ఈరాత్రి నేనొనరించిన ఘోరకార్యమునకుఁ జాలకాలము వఱకుఁ బరిహారమును సేయలేను."

"ఇందు విచారించుట కేమియవకాశము కలదు. నశించినవాఁడు శత్రువేకదా! అందుఁ దగనిపనియేమున్నది?"

"రణవీరులట్లే తలంచెదరు. మేముస్త్రీలముగదా"

విమల కొంచెమాలోచించి "రాజకుమారా! ఇఁక నిటఁదడయు టపాయకరము. కోటలోనికిఁ బోవుదమురమ్ము. తలుపును దెఱచివచ్చితిని. రమ్ము" అనియెను.

ఇరువురును శీఘ్రముగ నడచివచ్చి కోటలోపలఁ బ్రవేశించిరి. లోపల నడుగిడు నప్పుడు జగత్సింగునకు హృదయము కొట్టుకొనియెను. కాళ్ళు కంపమొందసాగెను. అపారపారావారశత్రుసైనిక నికాయంబుపై రణరంగమునకుఁ బోనున్నప్పుడుకూడ నాతని శిరోజమైనను చెక్కుచెదరి యెఱుంగదు. అట్టిదీసంతోషభవనమునఁ బ్రవేశించునప్పు డిట్లు కంపముజనియించెనేమిచెప్పుమా? భవితవ్యమేమి సూచనచేయుచున్నదో!

విమల మరల యథాప్రకారముగ గవాక్షమునుమూసి రాజపుత్రునితో శయనాగారమును బ్రవేశించెను.

"రాజతనయా! నేనొకనిముషములో మరల వచ్చెదను" దయచేసి యీశయ్యపై నధివసింపుడు. మీహృదయమన్యథావర్తింపదేని భగవంతుని శయ్యాస్థానము వలపత్రమే కదాయని తలపుఁడు."

విమల యవ్వలకేగెను. కొంతసేపటి కాగది నంటి యున్న యింకొకగదితలుపు తీయఁబడియెను. లోపలినుండి "రాజతనయా! ఇటుదయచేయుఁడు ఒకమాటవినుఁడు" అను మాటలు వినవచ్చెను.

మరల జగత్సింహుని హృదయము కొట్టుకొనియెను. బహుశః అంతరాత్మ స్పష్టముగ నేదియో యాతనికి బోధించి యుండును. అతఁడు శయ్యనుండి లేచి విమలయొద్దకేగెను.

ఆమె మెఱపువలె నదృశ్యమయ్యెను. ఆగది సుగంధ ద్రవ్యములచే బరిమళించుచుండెను. స్వచ్ఛమైన దీపము ప్రకాశించుచుండెను. అట నొకప్రక్క మేలిముసుఁగున నొక యువతీరత్నమున్నది. ఆమెతిలోత్తమగాక మఱెవ్వరు?

## పదునెనిమిదవ ప్రకరణము

విమల మరల తనగదిలోనికివచ్చి శయ్యపైఁ గూర్చుండెను. ఆమె మనోరథము నెఱవేరినది. ముఖము పరిపూర్ణానందమును సూచించుచుండెను. అట వెనుక దీపము వెలుఁగు

చున్నది. ఎదుట దర్పణమున్నది. ఆమెదుస్తులు ధరించినవి ధరించినట్లున్నవి. ఒక్కనిముషమామె తనరూపమునుదర్పణమునఁ జూచుకొనియెను. ఆహా! ఏమి యావేణీకుటిలత్వము! ఏమి యానేత్రసౌష్టవము! ఏమి క్రిందికనురెప్పపై నాకాటుక రేఖ! ఏమియాయధరసౌందర్యము! గులాబిపూచాయవంటి యాతాంబూలరాగము. ఆకర్ణాలాంకార చుంబితగండభాగములు. ఇవియన్నియుఁ దాల్చినవి తాల్చినట్లుండెను. ఆమె యొరగిలఁ బరుండియుండెను. పాఠకులారా! ఒక్కమాఱా సమయమున నాయువిదనుజూచిన నెవనికన్యయువతిపైమనస్సు పోవును? విమల మందహాసము చేయుచుఁ దనలావణ్యమును గూర్చి యాలోచించుకొనుచుండెను. తాను విశేషప్రయత్నమునర్చి మిగుల శ్రమనొంది తీసికొనివచ్చిన నిరుపమాన సౌందర్యరాశి యగు జగత్సింహునిం దిలోత్తమతోఁ గూర్చినందులకామె విచారపడునా? ఎప్పుడు నట్లుతలఁపదు. తాను పూనినకార్యము సఫలీకృత మయ్యెనని పరమానందము నొందుచుండెను. దిగ్గజునిమాట యామె తలంపునకు వచ్చెను. కారణము లేకుండ నతఁడు గృహమునుండి వెడలసమ్మతింప నందుల కామెకు చిఱునవ్వువచ్చెను.

విమల జగత్సింగుకొఱకు వేచియుండెను. ఇంతలో సమీపమందలి మామిడితోఁటయందు బాకాధ్వని యొకటి వినవచ్చెను. ఆమె యులికిపడి వెంట నేతనగదినుండి బయలు వెడలెను. ఎప్పటివలె నాధ్వనిదుర్గద్వారముకడనుండి వచ్చి యుండలేదు. అదిగాక యిట్టిసమయమున నెప్పుడును నట్టి

ధ్వనిచేయరు. వెంటనే యామెమనసునకు శైలేశ్వరాలయ మునకుఁ బోయి వచ్చులోపల జరిగినదంతయు జ్ఞప్తికి వచ్చెను. ఆమె యాధ్వని యేదో యాపత్సూచక మనితలంచెను. గవాక్షము నొద్దకువచ్చి పరికించెను. అందేమియుఁ గనఁబడలేదు. భయమునొంది యామె గదినుండి బయలు వెడలెను. ఆగది కావల పెరడు. దాని కావలవరుస గదులు. అందు సౌధముపై కెక్కుటకు సోపానములుకలవు. విమల పై కేగెను. అంతట నవలోకించెను. ఎవరును గాన్పింప లేదు. తోఁట గాఢాంధకారమయము. ఆమెకు భయ మధికమయ్యెను. పిల్లగోడయొద్దకువచ్చి వక్షము దానిపైనాని క్రిందకువంగి దుర్గము చుట్టునున్న ప్రదేశమును విమర్శించెను. ఎవరునుగానరాలేదు. స్నిగ్ధజ్యోత్స్నాసముదయమున పచ్చని పత్రిసముదాయ మోలలాడుచుండెను. నడుమ నడుమ మంద మారుతుఁ డాకుల నల్లలనాడించుచుండ నవి యెఱ్ఱగ మెఱయుచుండెను. తోఁటయడుగుభాగ మంతయు నంధకారబంధురము. అక్కడక్కడ చంద్రప్రకాశము పత్రముల నడుమనుండి తప్పించుకొని మచ్చమచ్చలుగఁ బ్రకాశించుచుండెను. నిశ్శబ్దముగనున్న యామోదరా నదీప్రవాహముపై ధవళకిరణుఁడు నక్షత్రగణములతోఁగూడఁ బ్రతిఫలించుచుండెను. అవ్వలియొడ్డున దూరముగ గగనచుంబిత సౌధరాజి దృశ్యమగుచుండెను. వానిపై పహరా మనుష్యుఁడటునిటు తిరుగుచున్నట్లు కన్పట్టుచుండె. ఇవియన్నియు నామెచూచెను. ఆశాభంగమునొంది వెనుకకు మరలెను. ఇంతలో

నా మెపీపు నెవరో వ్రేలితోఁ దాకినట్లయినది. తటాలున వెనుకకుఁ దిరిగి చూచెను. ఆతఁ డాయుధహస్తుఁడగు నొక మనుష్యుఁడు. ఆమె యెప్పుడును నాతని నెఱుఁగదు. ఆమె చిత్తరువు వలె నిలువబడిపోయెను.

"నోరెత్తకుము. ఎత్తితివా నిన్నికోటకిందకుఁ ద్రోసివేయుదును" అని యాతఁ డనియెను.

విమల నిట్లాకస్మికముగ భ్రమాన్వడచేసిన యామనుష్యుఁడు పఠాను సైనికుని వేషమును దాల్చియుండెను. ఆతఁడు ధరించియున్న యమూల్యములగు దుస్తులనుబట్టి యాతఁడేదియో ముఖ్యాధికారియని సులభముగఁ దెలిసికొనవచ్చును. ఆతని వయసు ముప్పదేండ్లకుమించదు. అత్యంత సౌందర్యవంతుఁడు ఉన్నతమయిన లలాటభాగమున నాతని తలపాగయందొక వజ్రమలంకరింపఁబడియున్నది. విమల పూర్ణముగ భయవివశయయియుండనిచో తనకెదుట గన్పట్టు పురుషుఁడు రూపసంపదలయందు రాకొమరునకుఁ దీసిపోవువాఁడు కాఁడని యనుకొనియుండును. ఆతనిశరీరమంత గొప్పదికాదు. వక్షఃస్థలమును నంతవిశాలమయినది కాదు. ఆతనియందు వలెనే యీతనియందును వీరశృంగార లక్షణములుగానవచ్చుచుండెను. కాని యీతని శరీరమంతకంటె మృదువైనది. అనర్ఘ్యమయిన యాతని మొలదట్టియందు పవడపుబొత్తములతోఁ గూర్పబడిన యొఱయు, నందొక డెమాస్కసుపట్టణములోఁ జేయబడిన కటారియు నుండెను. ఆతనిచేత నొఱదీసిన ఖడ్గముమాత్రముండెను. ఇంక నేయాయుధమును లేదు

"కేకలు వైవకుము. వైచినఁ దత్క్షణము నిన్ను క్రిందకు ద్రోసి వైచెద"

విమల స్వభావముగ మనస్థైర్యముకలది. ఆమెకుఁ గలిగిన భయాద్భుతములొక్క నిముషము మాత్రమేయుం డెను. రెండవమాటాతడు మాటాడుటతోడనే యాతని యభిప్రాయమును గ్రహించెను. ఆమెయున్నది సౌధాంతము. ఎదుట నాయుధహస్తుడగు సైనికుడు. సైనికులు వ్యర్థాలా పములాడువారుగారు. అతఁడు బెదరించునట్లు త్రోసివేయుట కూడ నంతకష్టమయినదికాదు. నిపుణవతియగు నామె యివి యన్నియు మనమునఁ దలపోసి 'నీవెవరవు?' అనియడిగెను.

"నన్ను తెలిసికొన నీకగత్యమేమి?"

"నీవీదుర్గమున కేలవచ్చితివిఁ! చోరులగ్ని స్తంభమున కంటగట్టబడుదురని నీవెఱుంగవా?"

"నేను చోరుఁడనుగాను."

"నీవిట కెట్లువచ్చితివి?"

"నీయనుగ్రహవశముననే—నీవు గవాక్షమును దెఱ చిపోయి నప్పుడిందు బ్రవేశించితిని. ఇటకు నీవెనుకనే వచ్చుచుంటిని."

విమలహస్తమున శిరసును మొత్తుకొనియెను.

"నీ వెవరవు?"

"ఇంకను నన్నుఁ దెలుపుకొనుటకు సందియమెందు లకు? నేను పఠానుఁడను"

"పఠానుడనినేఁజాలదు జాతికి పఠానుడవే కాని, నీవెవరవు?"

"నా పేరు అస్మాన్ ఖాన్"

"నేనెప్పుడట్టివానిని వినియుండలేదు"

"కటుల్ ఖానుని సేనాధిపతిని"

విమల కంపించెను. ఎట్లయిన నాతనిచేతులనుండి తప్పించుకొనిపోయి వీరేంద్రసింహునకీవార్త నెఱింగింపవలయునను నుద్దేశమామె హృదయమును దహించివేయుచుండెను. కాని, యది యెట్లు సాధ్యమగును? కేవల మసాధ్యము. మార్గమునకడ్డముగ నతఁడు నిలువఁబడియుండెను. ఇఁక వేఱుగతిలేదు. ఆమె ఇట్లుతలంచెను. "నేనీతనితో మాటలాడుచుఁ గాలక్షేపము సేయుచున్నంతవఱకు నేను నిర్భయముగ నుండవచ్చునుగదా! ఇంతలో నేకావలివాఁడైననిటుల రాఁగూడదా!" ఆమె మరల మాటలాడ దొడంగెను.

"నీవీమార్గమున నెందులకుఁ బ్రవేశించితివి?

"వీరేంద్రసింహునకు మాపక్షమున నుండుటకై దూతం బంపితిమి. ఆతఁడుసమర్థతగలదేని సైన్యము నెత్తి రావచ్చునని మరల వర్తమానమంపెను."

"నీవు చెప్పినది తెలిసినది. ఈదుర్గాధిపతి మీతో స్నేహమొనర్పక మొగలాయీలతో జేరెననియు నందులకు దుర్గమును బట్టుకొన వచ్చితిమనియు—అయిననీవొక్కఁడవే కనఁబడుచున్నాఁడవే?"

"ప్రస్తుత మొక్కఁడనే"

"అందులకనియే కాఁబోలు నన్ను పోకుండ నభ్యంతర మగలుగఁజేయుచున్నాఁడవు?"

పఠానుని చేతినుండి తప్పించుకొనుటకిక నాశ లేదని తుదకామె యిట్లు చెప్పెను. పిఱికితనము నారోపించినందులకు కోపము తెచ్చుకొని యతని ధైర్యమును గనఁబరచుటకు దారియొసఁగునని యామె యోచించెను. ఆతఁడిట్లు ప్రత్యుత్తరమిచ్చెను.

"సుందరీ! నన్ను భయపెట్టుటకు నీకడ క్రీగంటి చూపులుదక్క వేఱాయుధము లెవ్వియు లేవు. వానికైనను నంతగా భయపడను. అయినను నీతో నాకొక్క పనియున్నది"

విమల యాశ్చర్యమునొంది యాతనిముఖముపై తన దృష్టిని సారించెను.

"నీవస్త్రము చెఱఁగుననున్న తాళమును నాకిమ్ము. నాహస్తములచే నిన్ను ముట్టుకొని నిన్నగౌరవపఱచుఁ టెందులకు?"

విమల మందహాసమొనర్చుచు "ఇది మిగుల చక్కగ నున్నది. ఇంతకొక్కనిముషము పూర్వము నన్ను క్రిందకుఁ ద్రోసివేయ యత్నింపలేదా?"

"అవసరము వచ్చినప్పుడు ధర్మమనగత్యము. అవసరమయ్యేనేని యిప్పుడు నట్లే యొనర్చెదను"

ఆతనికప్పుడుగవాక్షముయొక్క తాళమత్యావశ్యకము, ఈవిషయము గ్రహించుటకు వివేకవతియగు విమల కెంత కాలము కావలయును? కాని, యతని నెట్లు తప్పించుకొన

వలయునో యామెకుఁ దెలిసినది కాదు. తనంతట తాను దానినీయనియెడల నాతఁడు బలాత్కారముగఁ గైకొనఁ గలఁడు. విమలగాక మఱెవ్వరైన నట్టిస్థితియందున్నచో తాళ మును నిస్సంశయముగ నిచ్చియుందురు. కాని విమల సామా న్యముగ నిచ్చునా? ఆమెయిట్లు బదులుచెప్పెను.

"నేనీతాళము నీయనిచో నీవెట్లు పుచ్చుకొందువు?" ఇట్లుచెప్పుచు వస్త్రమునామె హస్తములోనికిఁ దీసికొనియెను. అస్మార్ తన నేత్రములా వస్త్రముపైనుంచి యిట్లనియెను.

"నీవీయనియెడల నీమృదుగాత్రిస్పర్శనభాగ్యము నాకు లభింపఁగలదు"

"అట్లేచేయుము" అనిచెప్పుచు విమల వస్త్రమును దోఁటలోనికి విసరివైచెను. అస్మార్ తనహస్తమునుజాపి యెగురుచున్న వస్త్రమును బట్టుకొనియెను. అస్మార్ యొక్క జాగ్రతయు మెలకువయుఁ జూచి విమల యత్యాశ్చర్యపడి యెను.

అస్మార్ విమలహస్తములను తనహస్తములతో దృఢ ముగాఁబట్టుకొని వస్త్రముననున్న తాళమును దంతములతో విప్పి దట్టియందు భద్రపఱచెను. విమల ముఖము వెలవెలఁ బోయెను. అస్మార్ ఖానామె చేతులను వస్త్రముతో నొక్క స్తంభమునకుఁ గట్టివైచెను.

"ఇట్లుచేయుటలో నీయుద్దేశమేమి?" అని విమల యనెను.

"ఈపని రణమునకవసరము"

"ఈపాపకార్యమునకు ఫలితము శీఘ్రకాలములోనే యనుభవింతువుగాక!"

విమలనట్లేయుంచి యస్మాన్ వెడలిపోయెను. మరల వచ్చి "స్త్రీలనోను నమ్మరాదు" అనిచెప్పుచు నామెనోరును వస్త్రములచేఁ గట్టిగ గట్టివైచెను.

అస్మాన్ విమలయొక్క క్రిందిగదిలోనికి దిగెను. తాళమును ద్రిప్పి మునుపటివలె గవాక్షమును గోడలోపలకుఁ ద్రోసివైచెను. మార్గమేర్పడియెను. అస్మాన్ మెల్లగనీల వైచెను. పాదరక్షలులేకుండ నొక్కఁడు వృక్షముమాటు నుండి వచ్చి లోపలఁ బ్రవేశించెను ఇంకొకఁడు వచ్చెను. మఱొకఁడువచ్చెను. వేఱొకఁడువచ్చెను. ఇట్లనేకులు కోట లోఁ బ్రవేశించిరి. తుదివానితో "ఇఁక రావలదు. నీవును దక్కిన సైనికులును, వెలుపలభాగమున నుండుడు. నేను సైగ చేసినతోడనే కోట నరికట్టుడు. తాజ్ ఖానుతో నిట్లు చెప్పుము" అని యస్మాన్ చెప్పెను.

ఆమనుష్యుఁడు మరలిపోయెను. సైనికులతో కూడ నస్మాన్ ఖాన్ నిశ్శబ్దముగ బురుజుపైకెక్కెను. విమలను బంధించియున్న ప్రదేశమునుండి పోవుచు నిట్లనియె. "ఈ యువిద చాల వివేకవతి. ఈమెను నమ్మరాదు. రహీమ్! నీవీమెకడ రక్షకుఁడవుగా నుందువా? ఆమెనోరు విప్పివేయుము. కాని, యామె యెగురుటకుఁగాని యెవనితోనైనమాట లాడుటకుఁగాని, కేకవేయుటకుఁగాని, యత్నించెనేనితక్షణమ నరికివేయుము, సంశయింపకుమా!"

"చిత్తమల్లే యొనర్చెదను"

పఠానులాబురుజునుండి యాబురుజునకుఁ బోవుచుకోట యావలిప్రక్కకుఁ బోయిరి.



## పందొమ్మిదవ ప్రకరణము

### కాముకుఁడు—అతని యువతి

కుశాగ్రబుద్ధియగు నస్మార్ వెడలిపోవుట విమల చూచెను. తనబుద్ధిసామర్థ్యముచే నెట్లో బంధమునుండి విడివడవచ్చునను నాశచే ధైర్యము తెచ్చుకొనియెను. ఏమిచేయ వలయునో యోచించుచుండెను.

కొంతసేపయిన పిమ్మట నాతనితో మాటలాడ నారంభించెను. కావలివాఁడు కానిమ్ము! కాలునిదూతగానిమ్ము! అట్టి సుందరీమణితో మాటలాడకుండ నెవఁడుండఁగలడు? విమల మొదట నేదో లోకాభిరామాయణమును బ్రసంగింప నారంభించెను. పిదప క్రిమక్రిమముగా నాతని పేరు, దేశము, ఇల్లు ఉద్యోగము, కష్టము, సుఖమునుగూర్చి వివిధ ప్రశ్నలను బ్రశ్నించెను. ఆతనికిఁగూడ నామెయందంతయాప్యాయము జనించెను. సమయమునుజూచి విమల తనయమ్ములపొదినుండి వాఁడియైన బాణములఁ దీయ నారంభించెను. ఒక ప్రక్క నమృతముఁజిలుకు మృదుమధుర వాక్యములు, ఇంకొకప్రక్క గుటితప్పకుండ విడిచిన పువ్వుటమ్ములు. ఇవి రెండును నాతనిహృదయమును గలిగింప నారంభించెను.

వాని విధమునంతనుజూచి విమల యాతనికి వినాశకాలము దగ్గఱవడెనని తెలిసికొని మృదుమధురస్వరమున నిట్లనియెను.

"సాహేబుజీ! నాకుఁజాల భయమగుచున్నది నా యొద్దకువచ్చి కూర్చుండెదవా?"

సాహేబు పరవశుఁడయ్యెను. విమల సమీపమునకు వచ్చికూర్చుండెను. ఆమె యితరవిషయములనుగూర్చిమాట లాడెను. విమల తనయాపధము పనిచేయుచున్నదని గ్రహించెను. ఆతఁడామె సమీపమునకు వచ్చినది మొదలామెను దదేకదృష్టితోఁ జూచుచుండెను.

"మీకు స్వేదము విస్తారము పట్టినట్లున్నది. నాహస్తముల నొక్కమాఱు విప్పితిరేని మీకొక్కింత విసరెదను. పిదప మరల నన్నుగట్టివేయవచ్చును." అని విమలయనియెను,

ఆతని లలాటమున నొక్క స్వేదబిందువయిన లేదు. కాని, విమల నిశ్శంశయముగ దానినిజూచియుండెను. లేనిచో నామె యెందులకనియుండును? ఇంతేకాదు. ఆమె యాహస్తముతో విసరుట? ఆహా! ఆమృదుహస్తము! అట్టిభాగ్యమెవ్వరికి లభించును? ఇట్లాలోచించుకొని రహీమ్ వెంటనే యామె కట్లు విప్పెను.

విమల తనవస్త్రముతో నాతనికిఁ గొంచెము విసరెను. పిదప నేమియు నభ్యంతరములేకుండ తనశరీరమును గప్పుకొనియెను. రక్షకుఁడామెను మరల బంధింపలేకపోయెను. దీనికొక కారణమున్నది. విమలను కట్టుటకు త్రాడుకావలెను గదా! ఆవస్త్రమును త్రాడుగా నుపయోగించుటకంటెనామె

శరీరమున నుంచుటయే మేలుగానున్నది. అది యామెకెంతో సౌందర్యము నొసంగుచున్నది. ఆమె రూపసంపదలు మఱింత ప్రకాశించుచుండెను. ఏరూపసంపదల నుదయమున దర్పణమునఁ జూచుకొని విమల మందహాసమొనర్చెనో యవి యిప్పుడీరక్షకుని మూగవానివలెఁ జేసివైచెను.

"సాహేబుజీ! నిన్ను నీభార్య ప్రేమింపదా?"

"నీకట్టియాలోచన మేల కలుగవలయును?"

"ప్రేమించునెడల నిట్టివసంతర్తు సమయమున నిట్టి భర్తను విడిచి యామె యెట్లు సహించియుండఁగలదు?"

గాఢమయిన నిట్టూర్పు దీనికిఁ బ్రత్యుత్తరము.

విమల యమ్ములపొదినుండి యమ్ములు నిరంతరాయముగ వెడలుచున్నవి.

"చెప్పుటకు నాకు సిగ్గుచున్నది. కాని, నీవేనాభర్తవైనచో నన్నువిడిచి రణమునకేగ సహింపఁగలుగుదునా?"

కావలివాఁడు మరల నిట్టూర్పువిడిచెను. విమలయిట్లు చెప్పుచుండెను.

"నీవు నాభర్తవైతివా?" ఆమెకూడ నొక్కింత నిట్టూర్పు విడిచెను.

మోహపూరితాపాంగ వీక్షణముల సారించెను. రక్షకుఁడు పరవశత్వమును బొందెను.

క్రమక్రమముగ నాతఁడు సమీపమునకు జరుగుచుండెను. విమలయు నట్లేచేయుచుండెను. వారిశరీరము లొండొంటిఁ దాఁకినవి. కావలివానికుద్రేకము గలిగెను. విమల

తన మృదుహస్తము నాతనిపై వైచెను. ఆతఁడు పరవశుఁ డయ్యెను.

"అడుగ సిగ్గగుచున్నది. నీవు జయమును గాంచినచో నేను జ్ఞప్తియందుందునా?"

"ఎంతమాట! నిన్నెప్పుడైన మఱచిపోవుదునా?"

"నాహృదయము నీ కెఱిగింపనా?"

"ఇంతకన్న నేమికలదు. అవశ్యము చెప్పుము"

"చెప్పెను. నేఁజెప్పెను. విని నీవెట్లు యోచింతువో?"

"చెప్పవా! చెప్పవా! నిన్ను బ్రతిమాలు కొనియెద. నన్ను నీదాసానుదాసునిగ గ్రహింపుము. చెప్పుము."

"నీతో లేచిపోవుటకు నేను సిద్ధముగా నున్నదానను, దుర్మార్గుడగు నాభర్తకుఁ గళంకముఁ దెచ్చిపెట్టెదను."

మరల కీగ్రంటిచూపుల మోహ ముదయింపఁజేసెను. రక్షకుఁడు సంతోషముతో నుప్పొంగుచు గంతులు వేయు చుండెను.

"నీవట్లు చేయుదువా?"

"ఓగజపతి విద్యాదిగ్గజ రమ్ము! నీవంటి వివేకులింకను గొందఱీప్రపంచమున నున్నవారు. చూడుము."

"నీవు తీసికొనిపోయినచో రాకేమి? నిశ్చయముగ వచ్చెదను. అదినాకెంతో యానందదాయకము"

"నేనెప్పుడును నీసేవకుఁడనే. తీసికొనిపోవనా?"

"అపారమైన నీ ప్రేమకు బదులు నేనేమిచేయఁగలను. ఈస్వల్పమును గ్రహింతువుగాక!"

ఇట్లు చెప్పుచు విమల తన మెడలోనున్న బంగారపు గొలుసును నాతని కంఠమున వైచెను. ఆతని యానందమునకు మేర లేదు. స్వర్గసుఖ మనుభవించుచుండెను.

"ఒకరికంఠమందలి హారము నొకరికంఠమున వేయుటయే పరిణయమని మాశాస్త్రము లుద్ఘోషించుచున్నవి."

సాహేబు పండ్లుపైకిఁ గన్పట్టునట్లు నవ్వుచునిట్లనియెను.

"హు! హ్హా! హ్హా! అయిన మనము పరిణయమైతిమనుట నిశ్చయమా?"

"నిశ్చయమగును" అని చెప్పుచు విమల యేదో యోచించుచుండెను.

"ఏమి యాలోచించుచున్నావు?"

"ఏమియును లేదు. నాకింకను సుఖముగలుగుననునాశ లేదు. మీవాండ్రు దుర్గమును వశపఱచుకొనలేరని నాకుఁ దోఁచుచున్నది."

"ఎప్పుడును నట్టిసందేహ మొందకుము. దుర్గమీపాటికే మనదైయుండును."

"లేదు. లేదు. యీవిషయమున నొకరహస్యమున్నది'

"అది యేమి?"

"నీకుఁ గోటను బట్టుకొనసామర్థ్యముగలదేని యది నీకు వెల్లడిచేయుదును."

రక్షకుఁడది వినసిద్ధముగ నోరు తెఱచుకొనియుండెను. విమల చెప్పుటకయిష్టముతో నున్నట్లునటించెను.

"ఏమి? ఏమి?" అని తొందరతోఁ నాతఁడడిగెను.

"నీకుఁ దెలియదుగాని జగత్సింహుఁడు బదివేల సైన్యములతో నీదుర్గమునకు సమీపమున నున్నవాఁడు. మీరటకు రహస్యముగ వచ్చెదరని విని యంతకుముందే యాతఁ డాకస్మికముగ వచ్చినాఁడు. ఆతఁడిప్పుడేమియు మాటలాడఁడు. కాని, మీరు జయమునొంది నిర్భయముగ విశ్రాంతివహించి యున్నప్పుడాతఁడు వచ్చి మిమ్ములను జుట్టుముట్టును"

సాహేబు నిర్ఘాంతపడి మౌనమువహించి యుండెను.

"అదియెట్లు" అని యాతఁ డాశ్చర్యమున నడిగెను.

"ఈసమాచారము నీకోటయందందఱకును దెలియును. నేనుకూడ వింటిని."

సాహే బానందపరవశుఁ డయ్యెను.

"ప్రియా! నేఁడు నన్ను ధన్యునిజేసితివి. నేను బోయి సేనాధిపతికీవార్త నెఱింగించి వచ్చెద. ఇట్టి సమాచారము నెఱింగించినందులకు బహుమానమందెదను. నీవిటనే యుండుము. శీఘ్రముగ వచ్చెదను."

విమల విశ్వాసమునుగూర్చి యాతని కిసుమంతయైన సంశయములేదు.

"నీవు మరలవచ్చెదవా?"

"తప్పకుండ ఇప్పుడేవచ్చెదను"

"నన్ను మఱవకుము"

"మఱవను. ఎప్పుడును మఱవను"

"రాకపోయిన నాతోఁడు"

"నీకంతభయమేల? తప్పకవచ్చెదను"

ఆతఁడుదృష్టి పథమునుండి దాఁటిపోవుటతోడనే విమల మెల్లఁగజాఱెను.

అస్మార్ చెప్పినమాట నిజమయినది. విమల నేత్రములలో విషమున్నది. ఆమె కన్నులలో నిసుకపోయును.



ఇరువదియవ ప్రకరణము

గదినుండి—గదికి

విమల బంధమునుండి విడివడియెను. స్వేచ్ఛనొందెను. ఇప్పుడు ప్రథమకర్తవ్య మేది? వీరేంద్రసింహునకీవార్త యెఱింగించుటకదా! ఆయుద్దేశముతోడనే యామె యూపిరియైన విడవకుండ నాతనిశయనాగారము వంకకుఁ బోవుచుండెను.

అమె యింకను సగము దూరమైనను నడువలేదు. రణసూచకమగు, "అల్లాహూ!"అనుధ్వనివినవచ్చెను. 'పఠానుల జయశూచకధ్వనియాయిది?' అనియామెయొక వెఱ్ఱికేక వైచెను. పెద్దకోలాహలము వినవచ్చెను. కోటలోని వారందఱు మేల్కనిరని యామె యనుకొనెను.

పఠానులు వీరేంద్రుని శయనాగారమునకుఁ బోయిరి. తలుపును బ్రద్దలుకొట్టి లోనఁ బ్రవేశించిరి. ఇదియంతయు నామె చూచుచుండెను. అట నేదియో గందరగోళముగ నున్నది.

ఆమె తొంగిచూచెను. వీరేంద్రుఁ డగపడియెను. నడుము గట్టిగ గట్టఁబడియుండెను. వెఱ్ఱివానివలె నాతఁడు ఖడ్గమిటునిటు త్రిప్పుచుండెను. శరీరమునుండి రక్తము వరద లగుచున్నది. అంతలో నతని ప్రయత్నములన్నియు వ్యర్థమైనవి. బలిష్ఠుఁడగు నొకపఠానుని కత్తిదెబ్బ తగులుటచే, నాతని చేతనున్న ఖడ్గము క్రిందపడిపోయెను. ఆతనిని పఠానులు కైదీ గాఁబట్టుకొనిరి. ఇవియన్నియు విమలచూచెను. అధైర్యపడియెను. అటనుండి బయలుదేఱెను. తిలోత్తమను రక్షించుట కింకను నవకాశముకలదని యటువైపు బఱుగెత్తెను. త్రోవయందును సందు సందుల మూల మూలల నెక్కడఁ జూచిన బఠానులే. తిలోత్తమకడ కేగుట సులభసాధ్యము కాదు. దుర్గము శత్రువులస్వాధీన మయ్యెననుట కించుకేని సందియము లేదు.

విమల, తాను తిలోత్తమగది వైపునకేగిన పఠానులచేఁజిక్కుదునని తలంచెను. వెంటనే వెనుకకు మరలెను. చాల వ్యాకులపడియెను. ఈమహోపత్సమయమున నీ సమాచారములనుదెల్పి జగత్సింగును, తిలోత్తమను గాపాడుట యెట్లని మనస్సున యోచించుచుండెను. ఇంతలో నింకొకగదిని కొల్లగొట్టి సైనికులామార్గమున వచ్చుచుండిరి. వారిని జూచి విమల మిక్కిలి భయపడియెను. అతిత్వరితముగఁ బోయి యొకగదియందొకపెట్టె చాటున దాగికొనియెను. పఠాను లాగదిలోనికివచ్చి దోచుకొనుచుండిరి. వారు పెట్టె వెనకఁ జూచిరేని తప్పక వారికి కనఁబడును. వారి పాలఁ

బడకుండ తప్పించుకొను భాగ్యము తనకు లేదని విమల చింతిం చెను. ధైర్యమును వహించి యామె కొంచెముసేపట నుం డెను. మెల్లగా పెట్టెయందునుండి వారిచేష్టలఁ జూచుచుం డెను. విమల నిరుపమానధైర్యసంపదగలది ఆపదకోలఁదిని నామెధైర్య మతిశయించుచుండెను. పఠానులు వారిపని మీఁద నుండుటఁజూచి యామె యటనుండి బయలువెడలి మెల్లగ నడుగులిడుచు తప్పించుకొనిపోవఁ బ్రియత్నపడి యెను. కొల్లగొట్టు కొనుటయందత్యాశక్తితోనున్న పఠాను లీమెను జూడలేదు. ఆమె తలుపునుదాఁటి పోనుద్యుక్తురాల గుచుండ నొకసిపాయి వెనుకనుండివచ్చి యామె చేయి పట్టుకొనియెను. ఆమె వెనుకకుఁ దిరిగిచూచెను. ఆతఁడు రహీమ్‌సాహేబు.

"ఇప్పుడు పరుగెత్తుము. ఎక్కడకుఁ బోయెదవు"

విమల రహీమ్‌చేతిలో మరలఁ బడియెను. తెల్లపో యెను. కాని యీ వెలవెలపాటొక్క నిమిషమే. ఆమె నిరుప మాన సూక్ష్మబుద్ధి బలమున మరల నామె మొగ మంతలో వికాశమును బొందెను. ఉల్లాసభరితయై యథాస్థితికివచ్చెను. ఇట్లు తలంచెను. ఈతని మూలముననే నాప్రాణములను గాపాడుకొనియెదఁగాక! ఆతనితో నిట్లుచెప్పెను. "హుష్! చెప్పెదనాతో రమ్ము!" ఇట్లుచెప్పుచు నాతనిహస్తమునుబట్టు కొని యవ్వల కీడ్చుకొని పోయెను. ఆతఁడు ఏమియు ననక యామెతోఁగూడఁ బోవుచుండెను.

"మంచివాఁడవు. వారందఱు నుండగ నట్లుచేసెదవా?

నన్ను విడిచి నీ వెక్కడకుఁ బోయితివి. నేను నీకొఱకు వెదు
కని ప్రదేశమెక్కడను లేదు."

ఆమె క్రీగంటిచూపులు మరలఁ బ్రసరించెను. గొప్ప బుద్ధిమంతుడఁగు నాసాహేబు కోపాగ్ని చల్లారెను.

"జగత్సింహుని సమాచారముల నెఱింగింప సేనాధిపతికొఱకు వెదకుచుంటిని. ఆతని కనుఁగొనలేకపోయితిని. మరల బురుజుపైకి వచ్చితిని. కాని నీవక్కడ లేవు. అప్పటి నుండియు నిన్ను ప్రతిస్థలమునను వెదకుచుంటిని"

"ఎప్పటికిని రాకపోవుటచే నీవు నన్ను మఱచిపోయితివని తలంచితిని. అందుచే నిన్ను వెదకుచు బయలువెడలితిని దానికేమిగాని యింకనాలస్యము చేసిన లాభమేమి? మీ వాండ్రుకోటను బట్టుకొన్నారు. మనము పలాయనమగుటకిదియే సమయము"

"ఈ రాత్రికాదు. రేపుదయమున. సేనాధినాయకునితో జెప్పకుండ నేవచ్చుటెట్లు? రేపుదయమున నాతనియొద్ద సెలవు గైకొని వచ్చెదను"

మనమప్పుడే పోవచ్చును. కాని, తత్క్షణమునాయులంకారములు మొదలయినవి జాగ్రత్తచేయవలయు—లేనిచో నితర సైనికులపహరించుకొనిపోయెదరు"

"అయిన సరియే."

విమల, రహీమునుగూడఁ దీసికొనిపోవుటకుఁ గారణమితరసిపాయిలచేతినుండి తప్పించుకొనుటకే కాని వేఱు కాదు. సూక్ష్మబుద్ధియగు నామె భావిజ్ఞానమునకు దృష్టాంత

ముగ నట్టిస్థితియే సంభవించెను. వారిరువురు నెంతో దూరము పోలేదు. అంతలో పఠానుల రెండవగుంపు వారికెదురు పడియెను. వారు విమలనుజూచి "ఇదిగో జారిణి !"

"సహచరులారా! ఇటు రాఁబోకుఁడు. మీ వ్యాపారములఁ జూచుకొనుఁడు" అని రహీమ్ చెప్పెను.

సైనికులు సంగతిని గ్రహించి వారిని వదలివేసిరి. అందొకఁడిట్లనియెను. "రహీమ్! సేనాధిపతి నీనోటనుండి యాకబళము నూడఁబెఱుకుకొనకపోయిన నీవదృష్టవంతుఁడవే"

రహీమును విమలయు వెడలిపోయిరి. విమలయాతనిని క్రిందనున్న తన శయనాగారమునకుఁ దీసికొనిపోయెను.

"ఇది నాశయనాగారము. ఇందున్న వస్తువులలో, నీకుఁ గావలసినవి పుచ్చుకొనుము. దీని పైనున్నదికూడ నా పడకటిల్లె. నేనుపోయి నాయలంకారములు వస్త్రములు మొదలగునవి తీసికొనివచ్చెదను' అని చెప్పుచు నామె తాళము చెవులగుత్తి నాతనియొద్దఁ బడవైచెను.

అనేకవస్తువులతో నిండియున్న యాగదిని రహీమ్ చూచెను. పెట్టెలకు తాళములు లేకుండఁజేయుటకై త్వరపడుచుండెను. విమలయొక్క నమ్మకము విషయమున నాతనికి రవ్వంతయైన సందేహములేదు. ఆమె యీవలకు వచ్చి గొళ్లెమునుదగిల్చి యాగదికి తాళమును వైచెను. రహీమాగది యందిప్పుడు ఖైదీగనున్నాఁడు.

విమల సౌధముమీఁదకుఁ బఱుగెత్తెను. తిలోత్తమ

యొక్కయు నామెయొక్కయు భవనములు దుర్గమునందు లోపలభాగమున నుండెను. అందుచే పఠాను సైనికులింకను నంతదూరము పోలేదు. ఇంతేకాదు. ఈయూర్పులు, అల్లరి, ఆపద నాయువతీ యువకులెఱుఁగుదురో లేదో సందియమే. విమలయటకేగెను. కానితత్క్షణము లోపలకుఁబోలేదు. నూతన దంపతుల విలాసచేష్టలఁ జూడవలయు ననువినోదమామె కధికమయ్యెను. తలుపురంధ్రమునుండి చూచుచుండెను. ప్రకృతి స్వభావము నెవ్వరు దాఁటఁగలరు? భయంకరమైనయాపద సమయమునఁగూడ విమల వినోదమునకు లోనయ్యెను. ఆమె కొంచె మాశ్చర్యపడియెను. ఏమిచూచినదో? తిలోత్తమ శయ్యపైఁ గూర్చుండియుండెను. జగత్సింగు నిలువఁబడియుండెను. సౌందర్యరాశి యగునాయువతీరత్నముయొక్క మృదుకరముల నాతఁడు పట్టుకొనియుండెను. మరియు నాతఁడు నేత్రములను దుడుచుకొనుచుండెను. విమల యిట్లు యోచించుకొనియెను.

"అశ్రువుల విడుచుచున్నారు. ఇది వీరొండొరులు సెలవు తీసికొనుసమయము కాఁబోలును! ఏమయినను నీయిరువురును సంభవింపనున్న మహాపదనుగూర్చి యేమియు నెఱుంగరుకదా! ఆహా! ఈప్రపంచమున మోహముమాత్రమే మహాద్భుతప్రభావముకలది. ఓమోహదేవతా! శ్రవణేంద్రియశక్తి నశింపకయున్నను, ఈదంపతుల నీకోలాహలము వినఁబడకుండునట్లు మహాబధిరులను జేసివేసితివికదా!"

---

## యుద్ధము

—◆—

విమల లోనఁ బ్రవేశించెను. సంభవింపనున్న మహాపదను జగత్సింహునకు విన్నవించెను. మొదట నాతఁడామాటను విశ్వసింపలేదు. ఇంతలో పఠానుల కోలాహలము విననయ్యెను.

అతని సందియములు పోయినవి.

“రాజోత్తమా! శీఘ్రముగఁ దాఁటిపోవుట కేదేని యుపాయమునుఁ జూపుము. లేనిచో మనమిట నశించిపోయెదము.”

ఒక్కనిమిషము వఱకాతఁ డాలోచించుచుండెను.

“వీరేంద్రసింహుఁ డేమిచేయుచున్నాఁడు?”

“శత్రువులాతనిని బట్టుకొనిరి.”

తిలోత్తమ యొక్కకేక వైచి శయ్యపై మూర్ఛవోయెను. జగత్సింహుఁడు తెల్లవోయి “రక్షింపుడు. రక్షింపుడు. తిలోత్తమను రక్షింపుఁడు” అనియెను.

విమల తత్క్షణము పన్నీరుబుడ్డినిదెచ్చి యామెనోటిమీఁదను, లలాటముననుమెడపైని చల్లనారంభించెను. విసనుచుండెను కలకలము క్రమక్రమముగ సమీపించుచుండెను.

“అదిగో! వారువచ్చుచున్నారు. మనలను రక్షించుకొనుటయెట్లు?” అని విమల యఱచెను. జగత్సింగు నేత్రముల నగ్ని గురియ నిట్లనియె.

“ఓ భగవానుఁడా! నీయాజ్ఞ యిట్లున్నదా? ఇట్టియాప

త్సమయమునఁ నీస్త్రీలనడుమ నేనిట్లు కప్పువడియుండవలసిన దేనా?''

"ఇపుడిట చేయవలసినపని యేదియో చూడుము. నేనేమియు మేలు చేయలేకపోయినను తుదకు దిలోత్తమ ప్రక్కనుబడి చచ్చిపోయెదను." అని విమల కఠినముగ సదుత్తరమిచ్చెను.

రాజుమనసునకది ములుకులవలె నాఁటెను. ఇట్లనెను.

''ఇట్టిదురవస్థయందీమెను విడిచి నేనెట్లు పోఁగలను ఆమెకొఱకు నేనుకూడ నిట ప్రాణముల విడిచెదను."

ఆనిముషమున కానిముషము భయంకరధ్వనులును నాయుధధ్వనులును సమీపములగుచు వినవచ్చుచుండెను.

''తిలోత్తమా! తిలోత్తమా! ఇట్టిసమయమున నీవేల మూర్ఛపోయితివి? నిన్ను నేనెట్లు రక్షింపఁగలను?''అని విమల యనియెను. తిలోత్తమ నేత్రములను విప్పెను.

"తిలోత్తమ మరలఁబ్రతికినది. రాజకుమారా! రాజకుమారా! ఆమెను రక్షించుటకింకను నవకాశమున్నది.''

''భూచరఖేచరులెవ్వరునుగూడ మనలనిఁక రక్షింపఁజాలరు. మనమీగదిని విడిచితిమా నిన్నుకోటయావలకుఁ దీసికొనిపోఁగలను. కాని అయ్యో! తిలోత్తమ యసహాయురాలగును. విమలా! చూడుము! అదిగోవారు సోపానముల నెక్కుచున్నారు. ముందు నాప్రాణముల నిటనర్పించెదను. కాని, ప్రాణములు పోగొట్టుకొనియైనను మిమ్మురక్షింపలేక పోయితినికదాయని చింతించుచున్నాఁడను.''

ఒక్కనిముషములో విమల తిలోత్తమనెత్తుకొనియిట్లనియెను.

"అయ్యో? తిలోత్తమను నేనెత్తుకొనివచ్చెదను."

తత్క్షణమే యిరువురును దలుపునొద్దకు వచ్చిరి. ఆవైపున నలుగురు పఠానులు పరుగెత్తుచుండిరి.

"విమలా! కాలము మించిపోయినది. నావెనుకకు రమ్ము" అని రాజపుత్రుఁ డనియెను.

పఠానులు వారినిజూచిరి. "అల్లాహో"యని కేకవైచి దయ్యములవలె వారిపై దుమికిరి. వారినడుమునకుఁ జుట్టబడియున్న యాయుధములధ్వనికూడ నధికమయ్యెను. జగత్సింహుఁడు తనఖడ్గము నందొకని వక్షమున గట్టిగ నాటెను. దానితో వారి కేకలన్నియు నణఁగినవి. ఆపఠానుఁడు భయంకరముగనార్చి మరణించెను. రాజపుత్త్రుఁడాయుధమును దీసికొనకముందే, ఇంకొకపఠానుఁ డొకబల్లెము నాతనిమెడపై విసరెను. కాని, యది తనమెడపైఁ బడకపూర్వమే మెఱుపువలె నతివేగముగ నెడమచేతితో దానిని బట్టుకొని, యాకుంతముతోడనే జగత్సింహుఁడాశత్రువు నొక్కపోటునఁ గడతేర్చెను. ఒక్కనిమిషములో తక్కిన యిరువురుపఠానులొక్కమాటుగఁ దమయాయుధముల నాతనిపైవిసరిరి. పాపమాతనికూపిరి విడుచుటకైన నవకాశములేదు. అందొకని ముంజేతిని నఱికివైచెను. కాని రెండవవాని దెబ్బనుదప్పించుకొనలేకపోయెను. ఆదెబ్బ శిరస్సుపైఁ దగులకుండ, నాతని భుజముపైగాఢముగఁ దగిలెను. జగత్సింగు గాయమునొంది

వేఁటకానిచే దెబ్బతినిన పెద్దపులివలె రెట్టించిన యాగ్రహము గలవాఁడై మరలఁగొట్టఁ బ్రయత్నించుచు పఠానుని యాయుధమును రెండుచేతులగట్టిగఁ బట్టుకొని యొకవేటున నాతని శిరస్సును ఖండించెను. ఇంతలోఁ జేయిఁ బోఁగొట్టుకొనిన పఠానుఁడు నడుముననున్న చిన్న కటారిని రాజపుత్త్రుని శరీరముపై వైచెను. అదియాతనిచేతిలో గాఢముగ గుచ్చుకొనియెను. రాజపుత్త్రుఁడు దానినొక సూదిగుచ్చుకొన్నట్లెంచి, పాదముతో నొక్కటన్నుదన్ని యాతనిని దూరముగఁబడవైచెను. ఆపఠానుని శిరమును ఖండింప యత్నించుచుండ పఠానులసేనాప్రవాహము "అల్లాహో!" యని భయంకరధ్వనులుచేయుచు నాభవనములోనికి రానారంభించెను. ఇఁక వీరితో రణమొనర్చుట ప్రాణమర్పించుటకుఁ గాని వేఱులాభములేదని యనుకొనియెను.

అతని శరీరమునుండి రక్తము ప్రవహించుచుండెను. దేహమురక్తవిహీనమగుటచే నాతఁడు దుర్బలుఁడయ్యెను.

తిలోత్తమ యింకను మూర్ఛనొందియే యుండెను. విమలయేడ్చుచు నామెనుదనపై బరుండఁజేసెను. రాజకుమారునినెత్తురుపడి విమలవస్త్రములు రక్తమయమైపోయెను.

అప్పటికప్పుడే గదియంతయు పఠానులచే నిండిపోయెను. రాజపుత్త్రుఁ డాతనికత్తికిఁ జేరగిలఁబడి యొక్కనిమిషము శ్రమతీర్చుకొనుచుండెను. ఒక సైనికుఁ డిట్లనియెను.

"బానిసవాఁడా! విధేయుఁడవు కమ్ము. నీప్రాణములను పుచ్చుకొనము."

ఈవాక్యమారిపోవనున్న యగ్నికిఁ గొ్రత్తపుల్లవైచిన ట్లయ్యెను. జగత్సింగు ముందునకురుమికి యాతని తలను నఱికి పాదములకడఁబడ వైచెను. పిదపనాయుధమును ద్రిప్పుచు 'యవనులారా! రాజపుత్రుఁ డెట్లుచచ్చిపోవునో చూడుఁడు' అనియెను.

ఆతని యాయుధము మెఱపువలె నృత్యము సేయు చుండెను. క్రిమయుద్ధమువలనఁ బ్రయోజనము లేదనియుసాధ్య మైనంతవరకు శత్రువులవధియించి చచ్చిపోవలయుననియు నాతఁడు నిశ్చయముచేసికొనియెను. సాంద్రముగనున్న సేనా సమూహములో నుఱికి ఖడ్గమును రెండుచేతులఁ బట్టుకొని తన్ను రక్షించుకొనుట కించుకంతైనఁ బ్రియత్నముసేయక శత్రువుల నుఱుమాడుచుండెను. ఒకటి—రెండు—మూఁడు— ఒక్కొక దెబ్బ కొక్కొకని కవయవఖండనమో, బలమయిన గాయమో యగుచుండెను. గాయములురక్తధారలనాతనిపైఁ గురియుచుండెను. రాజపుత్రుని హస్తములుపట్టువదలెను. తలతిరుగుచుండెను. నేత్రములదృష్టి తక్కువయ్యెను. కర్ణముల కస్పష్టధ్వనియొకటిమాత్రము వినఁబడియెను.

"చంపకుఁడు! ఎవ్వరును జంపకుఁడు! రాజపుత్ర శార్దూలమును జీవముతోఁ బంజరమున నుంపుఁడు"

రాజపుత్రునికిఁక నేమియు వినఁబడలేదు. ఈవాక్యము లస్మాన్ ఖాన్ పలికెను.

రాజపుత్రుని చేతులు పట్టువదలి వ్రేలంబడియెను. ఆతని ఖడ్గము గణగణమనుధ్వనితో క్రిందంబడిపోయెను. ఒక పఠానుని శవముపై నాతఁడు స్మృతితప్పి పడెను.

ఇరువదిమంది పఠానులారాజచంద్రుని తలపాగయం దున్న రత్నము నపహరింపవలయునని యాతనిపై గుమికిరి. అస్మాన్ ఖా నిట్లుచెప్పెను.

“మీ ప్రాణములపై నాశయున్నచో రాజపుత్రుని నంటకుఁడు.”

అందఱును వెనుకకు తగ్గిరి. అస్మానును, నింకొక సైనికుఁడును జగత్సింహు నెత్తికొనివచ్చి పఱుపుపై శయనింపఁజేసిరి. ఒకనిమిషమునకుబూర్వమే యాతఁడు తనవివాహానంతరమునఁ దిలోత్తమతో విలాసముగ నేశయ్యపైఁగూర్చుండి నిర్భరానందమును బొంద నభిలషించెనో యా శయ్యయే యిప్పుడాతని కంపశయ్యయైనది. ఔరా! కాలమహిమ!

పిదప నస్మాన్ ఖా నిట్లడిగెను—

“ఆస్త్రీలెక్కడనున్నారు?”

విమలా తిలోత్తమల నస్మాన్ ఖాఁ జూడలేదు. రెండవమాఱు పఠానులామందిరమునఁ జొరబడినప్పుడు విమల రానున్న యాపదను గ్రహించెను. వేఱుగతి లేమి శయ్య క్రిందఁ దిలోత్తమనుదాచి, తాను దాఁగికొనియెను. అస్మా నిట్లనియెను.

"ఆస్త్రీ లెక్కడున్నారు? కోట యంతయుఁ బరిశోధింపుడు. కూడనున్న స్త్రీ యసాధ్యురాలు చాల తెలివి గలది. ఆమె తప్పించుకొనిపోయిన నాకు నెమ్మది కలుగదు జాగ్రత్తగ నుండుఁడు. వీరేంద్రుని తనయయెడల నమర్యాదగఁబ్రివర్తింపకుఁడు."

కొందఱు సైనికులు కోటలోపల నితర ప్రదేశముల వెదుకఁబోయిరి. ఒకరిద్దఱాగదివలువంకలఁ బరికించుచుండిరి. అన్నిమూలల వెదకిరి. అగపడలేదు. ఒకఁడు దీపముతో మంచముక్రిందఁ జూచెను. వాఁడొక్క కేకవైచుచు నిట్లు చెప్పెను.

"అయ్యా! ఇక్కడనున్నారు."

'వారేనా?" యని యస్మానాత్రిముతో నడిగెను.

"వారే. వారే. ఇక్కడనున్నారు."

అస్మాన్ ముఖము వికసించెను.

"ఈవలకు రండు, భయములేదు"

విమల ముందుగ నివ్వలకు వచ్చెను, పిదపఁ దిలోత్తమను దీసికొనివచ్చి కూర్చుండఁబెట్టెను. తిలోత్తమకు మరల జీవము వచ్చినది. కూర్చుండియుండెను.

"మనమిప్పుడెక్కడ నున్నాము" అని మెల్లగా విమల నడిగెను.

"భయములేదు. మేల్ముసుఁగు సరిగ వైచికొనుము" అని విమల రహస్యముగఁ జెప్పెను.

ఆయువిదలను, గనిపెట్టిన యూసైనిసుఁ డస్మానుతో "ఈస్త్రీలను నేను చూచితిని. ఏలిక చిత్తము" అని యెను.

"నీవు బహుమతి యడుగుచున్నాఁడవా? నీపేరెవరు?"

"నాపేరు కరీమ్. కాని నాపే రెవ్వరు నెఱుంగరు. నేను పూర్వము మొగలాయీ సైనికులలోనుండెడివాఁడను. అందుచే నన్ను మొగలుద్యోగస్థుఁడనియెదరు"

విమల కంపమునొందెను. అభిరామస్వామి గ్రహచార గణితము జ్ఞప్తికి వచ్చెను.

"మంచిది. నేను జ్ఞప్తియుంచుకొనెదనులే" యని యుస్మాన్ చెప్పెను.

మొదటిభాగము సంపూర్ణము.



# దుర్గేశనందిని



## రెండవ భాగము



### మొదటి ప్రకరణము

### అయేషా

జగత్సింగు నేత్రములు విప్పెను. మనోహరమైన మందిరమున శయ్యపైనుంటినని యాతఁడు తెలిసికొనెను. ఆప్రదేశము నదివఱకెన్నఁడు చూచియుండినట్లు స్ఫురింప లేదు. ఆగది విశాలమైనది. అనర్ఘ్యపదార్థాలంకృతము. చలువరాళ్ళతోఁ జేయబడిన చప్టాపై మృదువగు తివాసీ పఱుపఁబడి యుండెను. దానిపై వరుసగఁ బన్నీరుబుడ్లు, వెండి, బంగారము, దంతముతో నిర్మింపఁబడిన వివిధవస్తువులు పెట్టియుండెను. తలుపులకు ముందువైపున చలువ నొసంగుటకై పచ్చని తడకలు వ్రేలాడవేయఁబడియుండెను. సూర్యకిరణప్రసారము గదియందుఁజొరకుండ నుండినప్పటి నుండియు వానిని దడిపి మెత్తనగునట్లు చేయుచుండిరి. ఆ ప్రదేశము నానావిధ పరిమళ భరితమై యుండెను.

అందఱు నిశ్శబ్దముగనుండిరి. రాజపుత్రున కొకపరిచారిక మెల్లగ పరిమళోదకములు చిలకరించిన వీవనతో విసరుచుండెను. ఇంకొకర్తుక కొంచెము దూరమునఁ జిత్తరువువలె నిలుచుండియుండెను. రాజపుత్త్రుఁడు పండుకొని యున్న దంతపు మంచముపై నాతని ప్రక్క నొక్క యువిద

కూర్చుండియుండెను. ఆమె యాతని గాయములకు మందు పూయుచున్నది. క్రిందతివాసీపై శ్రేష్ఠములగు దుస్తులను ధరించియుండిన పఠానుఁడొకఁడు తాంబూలమును నములుచు పర్షియన్ పుస్తకమును జదువుకొనుచుండెను. కాని, పైకి చదువుట లేదు. ఎవరును మాటలాడుట లేదు. ధ్వనిచేయుట లేదు.

జగత్సింహుఁడు చుట్టునుజూచెను. ఒత్తిగిలఁబోయెను. శరీరమంతట కఠినమైన గాయములు పడియుండుటచే నొప్పిచే కదలలేకపోయెను.

"నెమ్మదిగానుండుఁడు. కదలకుఁడు." అని పక్కను గూర్చుండియుండిన స్త్రీమృదుమధుర కంఠనినాదముతోఁ బలికెను.

"నేనెక్కడ నున్నాఁడను?" అని యాతఁ డతినీరస స్థితితో నడిగెను.

"అయ్యా! మాటలాడకుడు. మీరస్వప్రదేశము ననేయున్నారు. విచారపడకుఁడు."

"ఇప్పుడు కాలమెంత యయినది?"

"మధ్యాహ్న మయినది. మీరు మాటలాడరాదు. మాటలాడిన వ్యాధికుదురదు. మేమీప్రదేశమును విడిచి పోవలసినవారమగుదుము."

"ఇఁకనొక్క మాటమాత్రమే. నీ వెవరవు?" అని ప్రయత్నపూర్వకముగా నడిగెను.

"నా పే రయేషా"

రాజు మెల్లగ నయేషా ముఖలక్షణములను జింతన చేయుచుండెను. ఆమె నాతఁ డిదివఱకెప్పుడైనఁ జూచియుండెనా? లేదు.

అయేషా యువతీశిరోమణి. ఏండ్లిరువదిరెండున్నవో లేవో? ఆమె సౌందర్య మతిమనోహరము. ఆసౌకుమార్య మనన్య సామాన్యము. అట్టిరమణీయక మొకటిరెండు మాటలఁ దెలుప వలనుపడదు. తిలోత్తమయుఁ బరిపూర్ణసౌందర్యరాశియే. కాని, యయేషాసౌందర్యమట్టిదికాదు. దాని తీరువేఱు. నిరంతరసుకుమార యౌవనవిరాజిత యగు విమల రూపరేఖలుకూడ మనుజుల హృదయాకర్షణమున గావించునవియే, కాని యీ వాఙ్మనసగోచరములగు నయేషాశృంగార సౌమ్యలక్షణములతోఁ నవియును సాటిరానేరవు. కొందఱ సుందరీమణుల సుకుమార లావణ్యము వికసితవసంతమల్లికా కుసుమ విలాసమును గేలిసేయుచుండును. నవవికసితవిలాస విరాజితము, మందాక్షనిమీలితము, కోమలావయవ సమంచితము, నిర్నిద్రతేజోవిభాసితము, మంజులమాధురీ ప్రపూర్ణ పరిమళసమ్మిళితము, తిలోత్తమ సౌందర్య మట్టిది. కొందఱు విలాసినీమణుల శరీర సౌందర్య మపరాహ్ణస్థలపద్మసదృశము- పరిమళవిహీనము — ముకుళీభావ సన్నిహితము — ఆర్ద్రీభావ విరహితము—అయిన విలాసశోభితము, పరిపూర్ణవికసితము- తేజోవిరాజితము—మధుపరిపూర్ణ పరిపక్వము, విమలరూప సంపదయట్టిది, బాలభానుని కోమలారుణస్పర్శమున వికసిత హృదయమై విలసిల్లు పద్మినియుంబోలె నయేషా యొప్పారు

చుండె. అట్టిదేదీప్యమాన సౌందర్యము, అట్టి దివ్యసౌరభము, అట్టి మాధురీరసపరిపూర్ణసందర్శనము—అట్టి తేజః పుంజము—సకల కుసుమరాజంబగునట్టి రాజీవంబునంగాక మఱి యెచ్చటనుండును? అది ముకుళితంబునుగాదు—ఆర్ద్రీభావ విరహితంబును గాదు. ఉజ్జ్వల దేజఃపుంజ సమాచ్ఛాదితము.

ఈవికసితపద్మపత్రికాంతు లిపుడు సూర్యకిరణములఁ గూడఁ దిరస్కరించుచున్నవి. అయిన నాకమలము మృదుమందహాసకాంతుల విలసిల్లుచునే యుండును. చదువరీ! నీ వెన్నఁడైన సౌందర్యప్రకాశమును జూచియుంటివా? చూడకున్నఁ దుదకు వినియైననుందువు. చాలమంది లావణ్యవతులు తమ సౌందర్యకాంతులఁజుట్టును ప్రకాశింపచేయుదురు. కొందఱితమ సౌందర్యప్రకాశమున మామలగృహములఁ బ్రకాశింపఁజేయుచుందురు. రేపల్లెవాడయందును, నిశుంభయుద్ధమునందును, నాయూప్రదేశములు స్త్రీల సౌందర్యముచేఁ బ్రకాశించినవే. కాని యాప్రకాశ మప్రతిష్ఠాకరమైనది. సౌందర్యప్రకాశమున నాయభిప్రాయ మేమియో చదువరులు గ్రహించితిరా? విమల సౌందర్యప్రకాశముకలదియే కాని యాప్రకాశము ప్రదీప ప్రకాశమువంటిది. కొంచ మస్పష్టమయినది. చమురు తక్కువ. అయినను గృహోపయోగమునకుఁ జాలును. దాని సాహాయ్యమున నొకగదినుండి వేఱొకగది కేగవచ్చును. వంట జేసికొనవచ్చును. పక్క వేసికొనుట మొదలగు కార్యములఁ జక్కఁజేసికొనవచ్చును. కాని దాని నంటరాదు. అంటిన దహించును. తిలోత్తమకూడ సౌందర్య

ప్రకాశితయే. ఆకాంతి యర్ధచంద్రుని మృదుకిరణప్రకాశము వంటిది—స్వచ్ఛమైనది. ఉపశాంతికరమైనది—చల్లనిది—కాని ప్రతిదినోపయోగమున కనువుపడనిది—స్వభావముగ నంత దృఢమైనదికాదు — దూరమునుండి వచ్చునది—అయేషాసౌందర్య ప్రకాశము మధ్యాహ్న సూర్యప్రభాసమాదృశము—జాజ్వల్యమాన తేజోవిరాజితము. అనేక సహస్ర కిరణ ప్రకాశితము—తత్కిరణ ప్రసారమునఁ బ్రతిపదార్థమును, హాసముద్రిత మగుచుండును.

సరోవరమునకుఁ బద్మమెట్టిదో మనకథ కయేషా యట్టిది. కావున నామెముఖ సౌందర్యాది లక్షణములఁ జదువరులకుఁ గరతలామలకము సేయఁ జాల వేడుక పడుచున్నాఁడను. ప్రకృతిమర్మజ్ఞయుఁ జిత్రనిర్మాణకుశలినియు నగుదివ్య లేఖిని నావశమై యుండెనేనియు—కేవల చంపకవర్ణమును గాక, కోమలారుణచ్ఛాయమును గాక, నవవికసిత పుండరీక ద్యుతియునుగాక, త్రివిధవర్ణసమ్మిళితమగు నాశరీరచ్ఛాయను బోలిన చాయ నాయత్తపరచుకొనఁ గలిగితి నేనియు—కోమల కుటిలకుంతలముల నలంకృతమై, కుసుమశరుని విహారరంగ స్థలము కరణి నొప్పారు నావిశాలవర్తుల ఫాలప్రదేశ మున్నదున్నట్లు చిత్రింపఁగలిగితి నేనియు—కోమల ముఖమండలమునఁ గుటిలకుంతలముల నంతమనోహరముగ నల్లుకొనినట్లు వ్రాయఁ గలిగితి నేనియు – చికురజాలముల శ్రవణద్వయపార్శ్వముల నంత మాధుర్యముగ మలపినరీతి లిఖింపఁగలిగితి నేనియు—కౌశేయసమాదృశము లగునట్టి వినీలకుంతలముల నిర్మింపఁ

గలిగితినేనియు—ఫాలాగ్రమునుండి కుంతలముల కవ్విధంబున సీమంతమును దిద్దఁగలిగితినేనియు—ఆసుందర చికురజాలముల నంత కోమల సంస్కారమును బొందినట్లు పరిదర్శింపగలిగితినేనియు—ఆస్నిగ్ధోన్నత కేశజాలముల నట్టి వేణీవిలాసమున గ్రాలునట్లు పరిదర్శింపఁగలిగితినేనియు—భ్రూలతలనంత సాంద్రముగఁ జిత్రింపఁగలిగితినేనియు—కణతలకడ నతిసూక్ష్మాగ్రములుగనుండి క్రమక్రమాభివృద్ధిఁ గాంచి భ్రూమధ్యభాగ సామీప్యమున నుచితవైశాల్యము నొంది పరస్పర చుంబనాభిలాష నట్లొండొంటినొరసికొన యత్నించులాగున భ్రూలతల వ్రాయఁగలిగితినేనియు—విద్యుల్లతికాపరిభాజాలముల దళతళత్కాంతులఁ బ్రకాశించు నీరదంబులగతి కోమలచంచలములగునట్టి మృదుపక్ష్మములఁ జిత్రింపఁ గలిగితినేనియు—ఆవిశాల నేత్రముల రమణీయతను, నాయుభయపక్ష్మములఁ సుందరవక్రరేఖావిలాసమును, కోమలారుణ రేఖాసమ్మిళితంబగునాయుజ్వల నీనీలకాంతిస్ఫురణంబును, కృష్ణదీధితిప్రకాశితము లగునాకనీనికలను, ఆత్మగర్వసంసూచకంబుగ విరళితపుటంబులం గ్రాలునాసమగ్రనాసికను, ప్రకృతి మాధురీనిలయస్థానం బగునాయోష్ఠపుటంబును, సుందరవేణీ సమాలింగితంబును, చంద్రకాంతోపల సదృశంబునగు నాగళసౌభాగ్యంబును, శ్రవణాలంకారచుంబితంబులగు నాసంపూర్ణవికసితగండ భాగంబులను, వివిధరత్నకటక ప్రదీపితములును, సమధికబలసంపూర్ణములును, నగునామృదుకరములను, నైజదీధితులరత్నాంగుళీయపరిభాజాలములనడంచునాకోమలాంగు

ఘులతీపను, స్థలపద్మరేఖావిలాసంబునుంబోలి యామృదుల హస్తముల సౌకుమార్యమును, ఆత్మకాంతిచ్ఛటలచే హార మౌక్తికద్యుతుల నపహసించు నావిజృంభిత వక్షస్థలగాంభీర్యవిలసనమును, సమున్నతబలోదంచితావయవశోభితం బగు నామంజులగాత్ర మహిమంబును, జిత్రఫలకంబునకుం దేఁగలిగితినేనియు—వీని నన్నిటి నుచితరీతిఁ బ్రదర్శింపఁ గలిగితినేనియు—అప్పుడును గూడ నేనాలేఖని నంటసాహసింపను. అసత్యమైన యీప్రపంచమున నయేషాసౌందర్య మొక్కటియే సత్యమైనది. ప్రకృతిరమసృజించిన పదార్థములందెల్లనామెయే సర్వోత్కృష్టమైనది. ఆమెకటాక్షము సాయం సమయమందలి మందానిలంబునఁ గదలియాడునీలోత్పలంబుల ననుకరించుచుండును. అయ్యో! ఆవేశితుఁడనుగాక యామెను జిత్రింప నేనెట్లు సాహసింతును?

జగత్సింహుఁ డయేషాను చూచెను. తత్క్షణమే యాతనిమనసునకుం దిలోత్తమ స్ఫురణకువచ్చెను. శూలము గ్రుచ్చినట్లయ్యెను. ఆతని సిరలవెంట రక్తమతివేగముగఁ జలింపనారంభించెను. గాఢమయిన యాతని గాయముల నుండి మరల రక్తమతివేగముగఁ బ్రవహించుచుండెను. నేత్రములు మూఁత వడియెను. స్మృతి లేకుండబోయెను. శయ్యపైనున్న యాలావణ్యవతి తత్క్షణమే లేచెను. చదువుకొనుచుఁ దివాసిపైఁ గూర్చుండియున్న మనుజుఁ డయేషాను పలుమాఱు జూచుచుండెను. ఆతనిదృష్టి పుస్తకముమీఁదికిని, నయేషాపైకిని, గంతులువైచుచుండెను. ఆతనికి తనివి

తీరు లేదు. శయ్యనుండి లేచుచున్న కాంతను గండభాగంబుల నాట్యమాడుచున్న కర్ణాలంకారంబులఁ దదేకధ్యానమునఁ గాంచుచుండెను. అయేషా తిన్నగ నతనికడకువచ్చి చెవిలో రహస్యముగ నిట్లు చెప్పెను.

"అస్మాన్! శీఘ్రముగ వైద్యుని రప్పింపుము"

కోటనుఁబట్టుకొనిన యస్మాన్‌ఖానితఁడే. అయేషా వాక్యమునువిని వైద్యునికొఱ కాతఁడవ్వలకేగెను. ఆయువిద వెండిపీటపైనున్న పాత్రను గైకొని యందున్న ద్రవపదార్థముతో రాజపుత్రుని ఫాలమును, ముఖమును, తడుపుచుండెను.

అస్మాన్‌ఖాన్ వైద్యుని దీసికొనివచ్చెను. వైద్యుఁడు రక్తప్రవాహము నాపుటకుఁ దగినయౌషధములనయేషాకిచ్చి వాని యుపయోగములను, వాని నిచ్చువిధములను మెల్లగఁ జెప్పెను. అయేషా వైద్యుని చెవియందు "ఇతని వ్యాధిని గూర్చి మీరెట్లు తలంచెదరు?" అని యడిగెను.

"జ్వరము చాలభయంకరముగ నున్నది."

వైద్యుఁడు సెలవుగైకొని వెడలిపోయెను. ద్వారము కడనున్న యస్మాన్‌ఖా నాతనితో మెల్లగా నిట్లనియెను.

"ఈతనికి నెమ్మదికలుగునా? మీయభిప్రాయమేమి?'

"నాకేమియు నమ్మకము లేదు. అయిన నీయుద్రేకముతగ్గినపిమ్మట మరల నన్నుఁ బిలువుఁడు"

—◆—

141





## పుష్పపరివృతోపలము

ఆరాత్రి చాలప్రొద్దుపోవువఱకును నయేషాయునస్మాన్ ఖానును జగత్సింహునియొద్దఁ గూర్చుండిరి. ఆతని కొక్కింత సేపు తెలివి, ఒక్కింత సేపు స్పృహ లేమి. వైద్యుఁడు పదింబదిగ వచ్చుచుఁ బోవుచుండెను. అయేషా యెడ తెగకుండ నాతనిని గనిపెట్టుకొనియుండెను. పండ్రెండుగంట లయినది. ఒకదాసి లోపలికివచ్చి యయేషాతో "బీగము నన్ను నీకొఱకుఁ బంపినది" అనిచెప్పెను.

అయేషా నేను వెళ్లెద ననియెను. అస్మాన్ కూడ లేచెను.

"నీవుకూడ లేచితి వేమి"

"చాలరాత్రియైనది. నీకు సాయముగ వచ్చెదను"

అయేషా సేవకులతో "జాగ్రత్తగనుండుఁడు" అని చెప్పి తల్లిభవనమువంక నడచెను. అస్మానిట్లడిగెను.

"నీవీరాత్రి బీగముకడ నుండెదవా?"

"ఉండను. మరల రాజపుత్త్రునికడకు వచ్చెదను"

"అయేషా! నీతోసమానలగు దయాస్వభావలీలోకమున లేరు. మీతండ్రి కీతఁడు గర్భశత్రువు కదా! అదియుఁదలంపక నిజముగా నీవాతనిని మృత్యుదేవతనోటఁ బడకుండరక్షించితివి. నీవలెనాతనికి సహోదరియైనను బరిచర్యలఁ జేయదు'

అయేషాముఖము మందహాసాలంకృతంబయ్యెను.

"అస్మాన్! ప్రకృతియందు నేనాఁడుదాననై జన్మించితిని. నాప్రథమవిధి వ్యాధిపీడితుని గాపాడుట. దాని నుపేక్షించితినా మహాపాప మొనరించినదాన నగుదును. నా విధిని నేను నిర్వర్తించినందుల కాధిక్యమేమియును లేదు. కాని నీకుమాత్రి మట్టిబుద్ధి యేలపుట్టవలయును? అస్మాన్! నీకు నీతఁడు ప్రబలవైరి కదా! రణక్షేత్రమున నీగర్వమణంప నెప్పుడును గోరుచుండెడివాఁడు కదా! నీహస్తములచేత నే యిట్టిదశకుఁ బాల్పడినవాఁడుకదా! అట్టి ప్రాణశత్రువును గూర్చి ప్రతిదినము నంతశ్రమ నొందుచు జాగ్రత్తతీసికొను చున్నాఁడ వెందులకు? అట్లుచేయుట నీ గుణవిశేషములనే వెల్లడి సేయుచున్నది."

"అయేషా! లోకమంతయు నీయట్టిమృదులస్వభావము గలదియేయని తలంచుచున్నావు. నాహృదయమునీవనుకొని నట్లంత యుదారమైనదికాదు. జగత్సింహునకు నెమ్మదిగా నున్నందువలన మాకుఁ గలుగులాభములను నీవెఱుంగవా? ఆతఁడిప్పుడు మరణించెనేని, యందుచే మాకగుప్రయోజన మేమి? రణరంగమున మానసింహుఁడు కుమారునకుఁదీసిపోవు వాఁడుకాఁడు. ఒకయోధునకు బదులుగ నింకొకనితోఁబోర వలసియుండును. జగత్సింహుని మేము కాపాడి యాతనిని కైదిగనుంచితిమేని మానసింహుఁడు మేము చెప్పినట్లెల్ల నడచును. అతని ప్రియతనయుని బంధవిమోచనకై మాకను కూలమగు పద్ధతులతో సంధి చేసుకొనవలసిన వాఁడగును.

ఇంతేగాక, యక్బరుకూడ నట్టిసమర్థుఁడగు సేనాధిపతిని మరల సంపాదించుకొనుటకై సంధివిషయములనే యాలోచించును. మేమాతని నాదరముతోఁ జూచితిమేని రాజపుత్త్రుఁడుగూడఁ గృతజ్ఞుఁడై పఠానులకులాభముగఁ జక్రవర్తితో సంధియొనర్పఁ దనశక్తికొలఁది పాటుబడును. అతని ప్రయత్నములు వ్యర్థములు కానేరవు. అధమమాతనిని విడిచిపుచ్చినందులకు విశేషద్రవ్యమయినను లభింపఁగలదు. రణరంగమునజయము సంపాదించుటకంటె నాతనిప్రాణమును గాపాడుటయే మాకుఁ జాలశ్రేయస్కరము."

అస్మాన్‌ఖా నిప్పుడిట్టినడవడిని గలిగియుండుటకుఁ గారణమీయోచనలనుమాట వాస్తవమే. సందియములేదు. కాని, కేవల మీయోచనలేకాకుండ నిఁకనొక్కవిశేషము కూడఁగలదు. కొందఱు మనుజులు తమ్ములోకులుకృపామృత చేతస్కులని యనుకొని పోవుదురను భయముతోఁ బైకిఁ గఠిన హృదయులవలె చరించుచుందురు. అట్టివారుదయనుస్త్రుల క్షణముగాఁ బరిగణించి నిరంతరమును దానిని దిరస్కరించుచుండియు, సదా మంచినే చేయుచుందురు. అట్టివారి నిదియేమని యడిగినప్పుడు "అయ్యా! మీరన్యథా భావింపవలదు. ఈమార్గమున నాకార్యమును నెఱవేర్చుకొనఁ దలంచితిని" అని చెప్పి వారిస్వభావమును గప్పిపుచ్చుచుందురు. అస్మాన్‌ఖా నిట్టితరగతిలోని వాఁడని యయేషా యెఱుంగును. ఆమెనవ్వుచు నస్మాన్‌తో నిట్లనియె.

"అస్మాన్! అందఱును నీవలె స్వార్థపరులును, దూర

దృష్టియుతులు నగునట్లు భగవంతుడనుగ్రహించిన బాగుగ నుండును. అట్లయిన నీకమంచితోఁ బ్రసక్తియే యుండ కుండఁ బోవును.''

అస్మాన్ కు యుక్తిగఁ బ్రత్యుత్తర మీయనెంచిమృదు స్వరమున నిట్లనియెను.

"నేను స్వార్థపరుఁడనే ఇందులకొక దృష్టాంతము జూపెదను.''

అయేషా విద్యున్మిళితపయోధర దృశంబగు తన దృష్టి నాతనిపైఁ బఱపెను. ఆతఁడిట్లు చెప్పుచుండెను.

"నేనాశతో జీవించియున్నాఁడను. ఎంతకాలమిట్లా శాబద్ధుఁడనయి యుందును?''

అయేషా గంభీరముగ వీక్షించెను. అస్మాన్ ఖానున కా వీక్షణమునఁ గొత్తయందములు కాన్పించెను.

"ఆవిషయమును తండ్రిగారి నడుగుము. ఆయన నీకే మియు లేదనలేఁడు''

"ఆప్రయత్న మిదివరకే యయిపోయినది''

"ఆతఁ డేమి చెప్పెను''

"ఆతఁడు బీగమ్మునో నయేషా నామె ఇష్టమువచ్చిన వానికిచ్చెద''నని వాగ్దత్త మొనర్చినాఁడు. కాని, యిప్పటి వఱకును నీహృదయము నేనెఱుంగలేక పోతిని''

మరల నామె మృదుమధుర వదనము మందహాసా లంకృతంబయ్యెను, ఇట్లనియెను.

"స్త్రీలహృదయమును బురుషు లెప్పుడు తెలిసికొనఁ గలిగిరి?"

"దీనినిబట్టి నేనేమి యనుకొందును?"

"నేను నిన్ను ప్రేమించుచున్నానని"

అస్మాన్ ముఖము సంతోషముచేఁ బ్రకాశించెను.

"నీనాథునిగనా?" అని యస్మానడిగెను.

"నాప్రియసోదరునివలె"

అస్మాౕ ముఖము వెలవెలఁ బోయెను.

"అయ్యో! ఇంకను నట్లే యనెదవా? ఓదైవమా! ఈ కోమలగాత్రి హృదయమును బుష్పరహితలతాతోపలముగఁ జేసితివా!" అనియెను.

అయేషా నామె జననికడకంపి యస్మాౕఖాౕ విచార హృదయముతోఁ దనయింటికేగెను,

—§o§—

## మూఁడవ ప్రకరణము

### నీవా తిలోత్తమవు కావా?

ఆమఱుసటి సాయంతనము జగత్సింగు పరుండియున్న గదిలో నయేషాయు, నస్మానుఖానును, వైద్యుఁడునుగూర్చుండియుండిరి. వారుమాటలాడుటలేదు. నిశ్శబ్దముగ నుండిరి. అయేషా శయ్యపైఁ గూర్చుండి రాజపుత్రునకు విసరుచుండెను. మఱియు నట్టియుపచారములొనర్చుచుండెను. వైద్యుఁడనునిమిషము నాతనినాడిని బరీక్షించుచుండెను. రాజునకు స్పృహ లేదు.

"ఈజ్వరము తగ్గినప్పుడితఁడు బహుశః మరణించును ఆసమయము దాఁటెనేని తప్పక యీతనివ్యాధి కుదురఁ గలదు" అని వైద్యుఁడనియెను.

జ్వరము క్రమక్రమముగ తగ్గుచుండెను. అందరును జాగ్రత్తగఁ గనిపెట్టి చూచుచుండిరి. వైద్యుఁడు పదింబదిగ నాతనినాడిని జూచుచుండెను. హీనము—ఇంకను హీనము— ఒక్కింతస్ఫుటము—అని యాతఁడు మెల్లగఁ జెప్పుచుండెను.

ఆకస్మికముగ రాజపుత్రుని ముఖము వైవర్ణ్యమును బొందెను. 'కాలము సమీపించుచున్నది' అని వైద్యుఁడనెను. అయేషాస్వాములు కదలకుండ నాత్రముతో నా వాక్యములను వినుచుండిరి. వైద్యుఁడు జగత్సింగు నాడిని బట్టుకొని యుండెను.

కొంచెముసేపుండి 'స్థితిబాగుగలేదు. నాడి క్రమము తప్పినది' అనియెను. అయేషా మొగము వెలవెలబోయెను. అంతలో రాజపుత్రుని వదనము రక్తవిహీనమై వికారసూచకమయ్యెను. ఆతనిపిడికిళులు గట్టిగ బిగిసికొనిపోయినవి. నేత్రములు స్వభావ విరుద్ధముగఁ జలించుచుండెను. ఆతనికిఁ గాలము సమీపించెనని యయేషా తెలిసికొనియెను. ఔషధమును సిద్ధముగ బట్టుకొనియున్న వైద్యుఁడాలక్షణములఁ నన్నింటిఁజూచి యాతనినోరుఁదెఱచి యౌషధమును వేసెను. అతిశీఘ్రముగ మార్పుకనఁబడియెను. క్రమక్రమముగ నాతని ముఖము యథాస్థితికి వచ్చెను. వేఱువికారములులేవు. స్వభావముగ నున్నది. శరీరమున వ్యాప్తమైన తెలుపు పోయినది.

రక్తమన్నినాళములగుండ జక్కగఁ బ్రవహించు చుండెను. గుప్పిళులు వీడినవి. నేత్రము లంతస్స్నిమితతచే మూఁతలు వడియెను. వైద్యుఁడు నాడిని శ్రద్ధతో జాగ్రత్తగఁ బరీక్షిం చెను. చాలసేపు పరీక్ష చేసి చూచి 'ఇక నేమియు భయము లేదు. తప్పక ఇతఁడు జీవించును.' అని సంతోషముతోఁ జెప్పెను.

'జ్వరము తగ్గినదా' అని యస్మార్‌ఖా నడిగెను.

'ఆ! తగ్గినది'

అయేషాయు, నస్మానుఁడును నతికుతుకముఁబొందిరి.

'ఇక నేమియు నపాయములేదు. నేనిటనుండ నవస రములేదు. పండ్రెండుగంట లగుదనుక మీరీ యౌషధము నప్పుడప్పుడీతని కిచ్చుచుండుఁడు' అనిచెప్పి వైద్యుఁడు వెడలి పోయెను. పిమ్మట నస్మాన్‌ఖానుగూడ దనయింటికేగెను. అయేషా రాజును గాపాడుచు నాతని ప్రక్కను శయ్యపై గూర్చుండియుండెను.

రాత్రి రెండుజాములు కావచ్చుచున్నది. జగత్సింగు కనులు దెఱచెను. తోడనే ముంపుగ నయేషాయొక్క విలాస వదన మాతని కగపడియెను. అతని క్రీగంటి చూపులనుబట్టి యాతనిమనసు పరిభ్రమించుచుండెనని యయేషా తెలిసికొని యెను. ఆతఁడేదియో జ్ఞప్తికిదేబ్రయత్నించు వానివలె జూచు చుండెను. కాని, యిందాతనికి జయముకలుగలేదు. ఏమియు జ్ఞప్తికిరాలేదు.

అయేషావైపునకు జాలసేపు వీక్షించి యిట్లనియెను.

'నేనెక్కడ నున్నాడను?'

రెండుదినములపిమ్మట మరల నాతఁడు మాటలాడుట కిదియే మొదటిసారి. ఆమె యిట్లు బదులుచెప్పెను.

'కటుల్‌ఖానుని కోటలోపల'

రాజు మగల నేదియో జ్ఞప్తికిఁ దెచ్చుకొన ప్రయత్నించెను. చాలసేపూరకుండి "నేనెందుల కిక్కడ నున్నాడను?' అనియెను.

ఆయేషా మొదట నేమియు ప్రత్యుత్తరమీయ లేదు. కొంతసేపాగి 'మీరు జబ్బుగనున్నారు' అని బదులుచెప్పెను.

'లేదు. లేదు. నేను ఖయిదీని' అని రాజపుత్రుఁడాలోచన సేయుచుఁ దలపంకించుచుఁ జెప్పెను. ఆతని ముఖలక్షణములు మార్పునొందుచుండెను.

ఆయేషా ప్రత్యుత్తర మీయలేదు. రాజునకు జ్ఞాపకశక్తి మరల గలుగుచున్నదని గ్రహించెను.

'నీ వెవ్వరవు?'

'నా పేరయేషా'

'ఆయేషాయెవ్వరు?'

'కటుల్‌ఖానుని కుమార్తె'

రాజపుత్రుఁ డూరకుండెను. మాటలాడుటకు బలమును దెచ్చుకొని చాలసేపటికిట్లనియెను.

'నేనెన్నిదినములనుండి యిటనున్నాఁడను?'

'నాల్గుదినములనుండి'

'గరమందర మింకను మీ స్వాధీనమునందుండెనా?'

'ఉన్నది'

జగత్సింగు మరల నొక్కింతవిశ్రాంతి వహించి యిట్లనెను. "వీరేంద్రసింహుఁడేమిచేయుచున్నాఁడు?"

"కైదీగానున్నాఁడు. ఈదినమున నాతని విచారణ జరుగును."

జగత్సింగుని ముఖము కాంతివిహీనమయ్యెను.

"తక్కిన దుర్గనివాసులంద ఱేరీతిగనున్నారు?"

"అన్నివిషయములు నాకుఁదెలియవు" అని యాత్రిముత్తో నయేషా యనెను.

రాజు తనలో నేదియో గొణుగుకొనియెను. ఆతని పెదవులనుండి యొక పేరు జారి యివ్వలఁబడెను. అయేషా దానినివినియెను.

"తిలోత్తమ"

అయేషా మెల్లగలేచి వైద్యుఁడిచ్చిన యౌషధమును దేఁబోయెను. అది నోటికింపైనది. అయేషా కర్ణాభరణము లూఁగులాడుచుండెను. ఆమెనిరుపమానసౌందర్యమును గూర్చి జగత్సింగు యోచించుచుండెను. ఆమె యౌషధమును దీసికొని వచ్చెను. అదిపుచ్చుకొని యాతఁడిట్లనియెను.

"నేను స్పృహలేకుండ పడియుండినప్పుడు స్వర్గమునందుండు నప్సరస యొకర్తు నాతలదిక్కునఁ గూర్చుండి నన్నుఁ గాపాడుచుండెనని కలగంటిని. నీవాతిలోత్తమవు కావా?"

"అయ్యో! మీరు తిలోత్తమనుగూర్చి కలగని యుందురు" అని యయేషా ప్రతివచనంబిచ్చెను.

## నాలుగవ ప్రకరణము

—:o:—

### మేలుముసుగులోనున్న యువతి

"కోటఁ బట్టుకొనినపిదప రెండుదినములు గడచినవి. మధ్యాహ్నసమయమునఁ గోటలో కటుల్‌ఖాను కొలువుదీర్చి యుండెను! రాజసేవకు లిరుప్రక్కల బారులుదీర్చి యుండిరి. ముందుభాగమున పరిమిత జనసమూహము నిశ్శబ్దముగఁ గూర్చుండెను. ఈదినమున వీరేంద్రసింహుని వ్యవహారమును విమర్శించెదరు.

ఆయుధపాణులయి రక్షకభటులు కొందఱు వీరేంద్రసింహుని దీసికొనివచ్చిరి. ఆతని ముఖ మెఱ్ఱబారి రక్తముఁ గ్రక్కుచుండెను. కాని, యందు భయసూచక మేదియును లేదు. ఆతని విశాలనేత్రములు ప్రజ్వలించుచు మిణుగురుల రాల్చుచుండెను. ఆతని ముకుపుటములుబ్బి యదరుచుండెను. ఆతఁ డధరమును గఱచుకొనుచుండెను. ఆతనిఁజూచి ఖానిట్లనెను.

"వీరేంద్రసింహా! ఈ దినమున రాజద్రోహాపరాధమునకయి నిన్ను విచారించెదము. నీవు మాయెడలఁ బ్రతికూలాభిప్రాయము నేల కలిగియున్నాఁడవు?"

వీరేంద్రునిముఖ మెఱ్ఱవడియెను. గోపమూ నణంచుకొని యిట్లు చెప్పెను.

"నేను చేసినదేదియో ముందునాకుఁ జెప్పుము"

"అయ్యా! ఏలికను గౌరవముగ సంబోధింపుము" అని యొకసభ్యుఁడనెను.

"స్వామ్నను సైనికులను నీవేలపంపలేదు" అని ఖానడిగెను.

"నీవు రాజద్రోహివి, దోపిడకాఁడవని గూడ నిన్ను పిలువవచ్చును. నీకు నేనెందులకు ధనమీయవలయు? సైన్యము నేల పంపవలయు?" అని నిర్భయముతో వీరేంద్రసింహుఁడనియెను,

చూపఱు లాశ్చర్యపడిరి. ఆతఁడు తన నాశనమునకయి సిద్ధమగుచున్నాఁడని యనుకొనిరి. కటుల్‌ఖానునకత్యాగ్రహమున శరీరము కంపించెను. కాని మనో వికారములను సులభముగ జయించుటలో నాతఁడు కడునేర్పరి. కోపము నణంచుకొని మెల్లగ నిట్లనియెను.

"నీవు మారాష్ట్రములో నివసించియుండియు మొగలాయీలలో నెందులకుఁ జేరితివి?"

"నీరాష్ట్ర మెక్కడున్నది?"

కటుల్‌ఖాను క్రోధావేశుఁడయి యిట్లనియెను.

"ఓరీ! ద్రోహీ! నీవు తగినఫల మనుభవింపఁగలవు. నీప్రాణముల నాసించుట కింకను నీకవకాశమున్నది. కాని నీవు పిచ్చివాఁడవు. నీయహంకారమే నిన్నణఁగఁ ద్రొక్కుచున్నది."

వీరేంద్రసింహుఁడు తిరస్కారసూచకముగ నవ్వుచు ప్రతివచనంబిచ్చెను.

"కటుల్‌ఖాను! నేను నీకుఁ జిక్కుకొనినంతమాత్రమున నీయనుగ్రహమునాసించువాఁడనుగాను. నీవంటిశత్రుని యనుగ్రహమును నేనెన్నఁడపేక్షింపను. ఈప్రాణము నట్లు రక్షించుకొనకపోయిన నేమిలోపము? నాప్రాణములను బుచ్చుకొనినంతమాత్రమున నీవు తృప్తినొంది సుఖపడఁ గలిగితివేని సంతోషపూర్వకముగ నాప్రాణముల నిటఁ దీసిపెట్టెదను. కాని, నీవు నన్నును నావారిని నపకీర్తిపాలు చేసితివి. నాప్రాణ ప్రియను నీ–వు—"

ఇఁక నాతఁడు తనవిచారమును చాల సేపాపలేకపోయెను. గద్గదకంఠుఁడయ్యెను. నేత్రములు బాష్పావృతములయ్యెను. నిర్భయాత్మకుండును, గర్వియు నగు నావీరేంద్రసింహుఁడు తల వ్రేలవయిచి బాలకునివలె నేడ్వనారంభించెను.

కటుల్‌ఖాను స్వభావసిద్ధముగ నతికఠినుఁడు. ఎవరికేని నాపదమూడినదన్న, నాతనికిఁ గడుసంతోషము. అదియు దనవంటిప్రాణియేయని తలంచువాఁడు కాఁడు. ఆతని శత్రుఁడగు వీరేంద్రసింహుని దురవస్థను చూచినతోడనే కటుల్‌ఖానుని ముఖ మానందముచే వికసించెను. అతఁడిట్లనియెను.

"వీరేంద్రుఁడా! నావలన నీకుఁ గావలసిన యుపకారమేమయిన నుండెనా? ఆలోచించుకొనుము. నీమరణము సమీపించినది."

మంచుదున్న వీరేంద్రుని హృదయము నాతని యంత ర్భాష్పములే సేదదేర్చెను. ఆతఁడు మెల్లగా నతనితో నిట్లు చెప్పెను.

"శీఘ్రముగ నన్ను వధించుట కాజ్ఞయిమ్ము. ఇంత కంటె వేఱేమియులేదు"

"అదసరియే. ఇంకమఱేమయిన?"

"ఈజీవితమున నాకిఁక వేఱేదియు లేదు"

"కడసారి యొక్కమాఱు నీ తనయను జూడఁ గోరిక లేదా?"

చూపఱులందఱు విచారగ్రస్తులై నిశ్శబ్దముగనుండిరి. వీరేంద్రుని నేత్రములనుండి యగ్నికణము లొలుకుచుండెను.

"వ్రీలిపోయియున్న యీహృదయము నింకనుపాదము చేనణఁగ ద్రొక్కుచున్నాఁడ వెందులకు? ఇటుచేసినఁగాని నీకుఁ దనివిలేదా! కానిమ్ము. నీయిష్టమువచ్చినట్లొనర్పుము. లోకమున నేను పరాక్రమవిహీనుఁడనై పోయినాఁడను. కాని పరలోకమున్నది. భగవంతునికడ నీవిందులకుఁ బ్రత్యుత్తర మొసంగుదువుగానిలే"

ఈమాటలు కటుల్ఖానునకు హృదయసంకటమును గలిగించెను. ఎంతదుష్టునకైనను పరలోకము భగవంతుఁ డను వాక్యములు చెవులఁబడినప్పుడు హృదయము కంపింప కుండునా?

"తలవరీ! ఇంకేమియులేదు. నీపనిచేయుము" అని కటుల్ఖానని యె.

కొలువు నిశ్శబ్దముగనుండెను. ఆప్రజాసమూహమున నుచ్ఛ్వాస నిశ్వాసములైననులేవు. సూదిక్రిందఁబడినను నా ధ్వని వినవచ్చుచుండెను.

రక్షకభటులు వీరేంద్రుని వధ్యస్థానమునకుఁ గొంపో యిరి. ఆతఁడింకను నటకుఁ జేరలేదు. నడుమ నొకమహమ్మ దీయుఁడువచ్చి యాతని చెవిలో నేదియో రహస్యముగఁ జెప్పెను. వీరేంద్రుఁడు దానిని గ్రహింపలేదు. అప్పుడా మహమ్మదీయుఁ డొకయుత్తరము నాతనికిచ్చెను. పరధ్యాన ముతో నాలోచించుచు వీరేంద్రుఁ డాయుత్తరము విప్పి చూచెను. అది విమల స్వయముగా వ్రాసినది. ఆతఁ డయిష్టమును సూచించుచు నాలేఖను నలిపి యావలఁబాఱ వైచెను. ఉత్తరమునుదెచ్చిన యాతఁడు దానిని గైకొని వెడలిపోయెను.

చూపఱులలో వీరేంద్రుని సమీపముననున్న యొకఁ డింకొకనితో మెల్లగా నిట్లనియెను.

"ఈయుత్తరము బహుశః యీతని తనయ యంపినదై యుండును."

వీరేంద్రుఁడీమాటవిని వెనుకకుఁ దిరిగి "నాకొమార్తె యనుచు మాటలాడుచున్నారెవరు? నాకు కుమార్తెలేదు" అనియెను.

ఉత్తరముఁ దీసుకొనిపోవుచున్న యాతఁడు "నేను వచ్చువఱకును నిరీక్షింపుడు" అని భటులతోననియెను.

"చిత్తము మహాప్రభూ!" అని వారుబదులునుడివిరి.

ఉత్తరమును దీసుకొనివచ్చినవాఁ డస్మార్ఖానుఁడే అందుచేతనే సేవకులాతనిని "మహాప్రభూ"యని సంబోధించిరి.

లేఖనుగైకొని యాతఁడభ్యంతర మందిరములోనికిఁ గ్రింది భాగమునొద్ద కరిగెను. అట మేల్ముసుంగు వైచికొనిన యువిద యొకర్తుండెను. అస్మానా మెయొద్దకువచ్చి యిటునటుఁ జూచి జరిగినదంతయుఁ జెప్పెను.

"నేనునీకు మిక్కిలి శ్రమనొసంగుచున్న దానను కాని మమ్ముల నీదురవస్థల పాలు జేసినవాడవు నీవే ఈమాటజ్ఞప్తి దెచ్చుకొని నానిమిత్తమీపని చేయవలయు"

అస్మార్ ప్రత్యుత్తరమీయలేదు. ఆమెగద్గదస్వరముతో మరల నిట్లనియెను.

"నీవంగీకరింపవేని నాకిఁక దిక్కెవ్వరు? భగవంతుఁడే గతి. ఆతఁడే న్యాయమును జేయఁగలఁడు"

"అమ్మా! నీవు నాపైఁ బెట్టినకార్యమెంత యపాయకరమైనదో తెలిసికొనఁజాలకున్న దానవు. ఈ విషయము కటుల్ ఖానెఱింగెనేని నాప్రాణములనుబుచ్చుకొనకమానఁడు"

"కటుల్ ఖానుఁడా? నీప్రాణములనుబుచ్చుకొనుటయా అస్మార్! నన్నెందులకు వచింపఁ జూచెదవు? కటుల్ ఖానుఁడు నీకు లేశమాత్రమైన నపకారముఁ జేయగలడా?"

"కటుల్ ఖానునిసంగతి నీకుఁ బాగుగఁ దెలియదు. అయినను నిన్ను వధ్యస్థానమునకు గొంపోయెద. రమ్ము"

వారిరువురు నాస్థలమునకు వచ్చిరి. వీరేందుఁడు

సన్న్యాసివలెనున్న యొక బ్రాహ్మణునితో మాటలాడుచుం డెను. విమలజూడలేదు. విమల మేల్ముసుంగునుండి యా బ్రాహ్మణుని గుర్తించెను. అతఁడభిరామస్వామి.

"అయ్యా! ఇదె నాకడసారివందన మర్పించుచున్నా డను. ఇఁక నేజెప్పవలసిన దేమియున్నది? ఇఁక నీప్రపంచ మున నాకెవరున్నారు? ఎవరికొఱకు నేను భగవంతుని ప్రార్థింతును?" అని వీరేంద్రుఁడాతనితో ననియెను.

అభిరామస్వామి మేల్ముసుంగునందున్న యువిద నాతనికిఁ జూపెను. వీరేంద్రుఁడు వెనుకకు దిరిగి చూచెను. తోడనే మేలిముసుఁగునుదీసి వైచి విమల సంకెలలతో నున్న యాతని పాదములపైఁ బడెను.

"విమలా!" అని యాతఁడు గద్గదస్వరముతో నని యెను.

విమల యావేశముతో "ఓనాథా! ప్రాణప్రియా! నాసర్వస్వమా! నేనీదినమున బహిరంగముగఁ జెప్పుచున్న దానను. నన్నెవ్వరు నడ్డుపెట్టలేదు. ఓనాథా! జీవితేశ్వరా! నన్నిట విడిచి నీవెటకేగెదవు? ఎటకేగెదవు?" అనియెను.

వీరేంద్రుని నేత్రములనుండి బాష్పములు వెల్లువలగు చుండెను.

"ప్రియా! విమలా! ఇట్టిసమయమున నన్నేల దుఃఖ సముద్రమున ముంచెదవు? శత్రువులు మరణమునకు భయ పడితిననుకొనరా?" అనియామెను లేవనెత్తుచు ననియెను. విమలయూరకుండెను.

"విమలా? నాకనుజ్ఞ. నీవుకూడ నన్ననుసరించెదవా?"

"కాదు. ఇప్పుడుకాదు—కొంచె మాలస్యముగ—ముందుగ నాతప్పిదమునకుఁ బగదీర్చుకొనెదను."

వీరేంద్రుని ముఖ మారిపోవనున్న దీపమువలె నొక్క మాఱు ప్రకాశించెను. విమలతో నిట్లనియెను.

"నీస్వహస్తముతోడ నేనా?"

"ఈస్వహస్తముతోడనే. ఇదిగో నాచేతినుండి కంకణముల దీసివేయుచున్నదానను. ఇక వీనితో బ్రయోజన మేమి? [ఆమె యలంకారములను కంకణములను దీసి దూరముగఁ బారవైచెను.] ఇఁక నాచేతు లేయలంకారమును ధరియింపఁబోవు. కాని వానిస్థానమున నిశిత ఖడ్గముంపబడును."

"నీవు తప్పక జయమునుగాంచగలవు. దైవము నీకు తోడగుగాక" అని వీరేంద్రుడు సంతోషముతో నసియెను.

"నేనిఁక నిరీక్షించి యుండజాలను" అని తలవరి కేకవైచెను.

"విమలా నీవు పోవచ్చును" అని వీరేంద్రు డానతిచ్చెను.

'అట్లుకాదు నన్ననాథగఁ జేయనున్న దారుణాసి, పాతము నీకన్నులతోఁజూచిగాని యిటనుండి పోవను. నీరక్తమున న్యాయాన్యాయసంశయములన్నియు ముంచివైచెదను'

విమల వాక్యము శాంతముగనుండెను. కాని, భయసూచకమైనది.

"అట్లేచేయుము" అనిచెప్పి వీరేంద్రుడు తలవరికి సైగచేసెను.

తలవరి యెత్తినగొడ్డలిని విమలచూచెను. అదిసూర్య కిరణములలోఁ దళతళమని మెఱయుచుండెను. ఆమె నేత్రములొక్క నిముషము మూఁతపడియెను. అవి మరల వీడు నప్పటికి వీరేంద్రసింహుని మూర్ధము రక్తముచే మలినమై యామెకడఁబడి దొరలుచుండెను.

విమల రాతివిగ్రహమువలె నిలువఁబడిపోయెను. ఆమె శిరోజాగ్రమైనను గాలియందు కదలుటలేదు. నేత్రమున నొక్కబొట్టుబిందువైనలేదు. దృష్టి శిరస్సుపైనుండెను. చలించుటలేదు.

— —

## అయిదవ ప్రకరణము

—x—

### గతభర్తృక

తిలోత్తమ యెటనున్నది? అయ్యో! తండ్రిలేని నిరాధారురాలగు నాబాలిక యేమైపోయినదో కదా! విమల యెట నున్నదో? వధ్యస్థానమున కామె యెటనుండి వచ్చినదో? ఆ దారుణ కార్యానంతరమున నామె యెటకేగినదో?

వీరేంద్రసింహుడవసాన సమయమునఁ బ్రియతనయఁ జూడ నపేక్షింపలేదేమో? ఆమె పేరు విననంతమాత్రమున నాతని కోపాగ్ని ప్రజ్వల్లినదెందువలననో? "నాకీలోకమునఁ గుమార్తెలేదు" అని యాతడెందులకనియుండెనో? విమల

యుత్తరము జదువనైన జదువకుండ నాతడేల పాఱవయి చెనో? అయ్యో! పాఠకులారా! మీకింత సందియమేల? కటుల్‌ఖానుని వీరేంద్రుడెట్లునిందించెనో, యెట్టిదారుణము సంభవమయ్యెనో జ్ఞప్తికి దెచ్చుకొనుడు. నన్నును నావారల నపకీర్తి పాలుచేసితివని బోనులోని సింగపు గొదమవలెనెట్లు గర్జించెనో జ్ఞప్తిలేదా?

విమలాతిలోత్తమ లెటనున్నారని యడుగుచున్నారా? కటుల్‌ఖానుని యంతఃపురమును బరీక్షించినచో మీకగ పడుదురు.

"ఔరా! ప్రపంచవైఖరి. అదృష్టచక్రము నిర్దయా త్మకమైనది. అది యిట్లే తిరుగుచుండును. యౌవనము, లావణ్యము, సద్భావము, నిర్మలత్వము, నన్నియు-సర్వమును నతికఠినమగు దాని పరిభ్రమణవేగమున నలగి నాశనమై పోవును.

ఏకోటయందుఁగాని, యేపల్లెయందుగాని, యెప్పు డైన, సౌందర్యవతియగు నేయువిదయైన పట్టువడెనేని వినో దార్థమామెను దనకడ కంపుచుండుడని కటుల్‌ఖాను డొక నిబంధన నేర్పఱచెను. గరమందరమును బట్టుకొనిన మరు సటిదినమున నాతఁడాదుర్గమునకుఁ బోయెను. చెరయందున్న వారిని విచారించుట, వారికి కావలిభటుల నేర్పఱచుట, మొదలగు పనులొనర్చుచుండెను. ఆఖయిదీలనడుమ విమలా తిలోత్తమలుండిరి. వారినిరువురను, తన యంతఃపురమునకుఁ బంపివేసెను. పిదప నాతనిహృదయ మితర కార్యములమీఁదికి

బోయెను. తమ ప్రభువును విడిపించుకొనుటకై రాజపుత్ర సైనికులు తనపైనెత్తివచ్చుచున్నారని యాతనికి వార్త వచ్చెను. అందుచే వారి నెదుర్కొన నుపాయములఁ జింతించుచుండెను. తన్మూలమున నీతని కీక్రొత్తబానిసలతో వినోదమనుభవింప నవకాశము లేకపోయెను.

విమలను, తిలోత్తమను, వేఱువేఱు గదులలో నుంచిరి. చదువరులారా! తండ్రిలేని యాబాలిక పాపము క్రిందఁబడి దొరలుచున్నది. ఆమె యాకోమలశిరీషగాత్రి యిప్పుడు పరాగమిళితమైయున్నది. ఇట్లని మనము జాలినొంది చూచిన నేమిలాభము? ఏమిప్రయోజనము? ఇప్పుడు తిలోత్తమను జూచువారెవరు? వసంతకాలమునఁ జక్కని కుసుమములతోడను, మొగ్గలతోడను, శృంగారితమై కన్నులవిందొనర్చు పూలతీవను బరిమళముకొర కెవ్వఁడు ప్రార్థింపకుండును? దాని సందర్శనమున నెవ్వఁడానందింపకుండును? ఆతీవ చుట్టుకొనియున్న వృక్షము తుపానుచే బడిపోయినప్పుడు వేళ్లతోఁ బెల్లగిలిన వృక్షమును విడిచి యాతీవను జూచువారెవరు? తోఁటవాఁడు తీవను బాదముతోఁ ద్రొక్కి చెట్టును దీసికొని పోవునుకదా!

చదువరులారా! మనము మఱియొకచోటునకుఁ బోవుదము. విమల నిపుణవతి, ఉల్లాసవతి, చాతుర్యవతి, చుఱుకైనది. పాపమామె యిప్పుడట్లులేదు. చీఱచెఱగును నేత్రములపై వైచుకొని పంకనిర్మగ్నయై విచారించుచు ననాథయై యుండెను. మన మొక్కసారి యామెయొద్దకుఁబోయిచూచి వత్తమురండు.

విమల యీమెయేనా ?

విమలా! చక్కగదువ్వుకొనిన యాశిరోజము లేనా యివి? నీశిరమట్లు ధూళిచే నిండియున్న దేమి? బుటేదారి యంచులతో మనోహరముగ నుండునాచీరయేది? రత్నఖచిత మగు కంచెల యెటనున్నది? ఇదియేమి? నీవస్త్రమంతధూళి ధూసరితమైన దేమి? ఇట్టివస్త్రమును దాల్చినావేమి? ఆనగ లన్నియు నెటుపోయినవి? నీకపోలముల నెప్పుడు ముద్దాడు చుండు కర్ణాలంకారములేవి? నీనేత్రములెందుచే నట్లుబ్బినవి? అయ్యో! నీక్రీగంటిచూపు లెటుపోయినవి? నీలలాటమున గాయమెందులకయినది? ఎవరు నీకట్లుగాయమొనర్చిరి ?

వీనికన్నిఁటికి నొక్కటే యుత్తరము. పాపము విమల యిప్పుడు గతభర్తృక. ఆమె యిప్పుడస్మానుని కొఱకు నిరీక్షించుచుండెను.

అస్మాన్ ఖానునిజూచి పఠానులందఱును గర్వపడుట న్యాయమే. ఆతనికి రణమే వృత్తియగుటంబట్టి జయము నొడగూర్చు నెట్టికార్యమునైనను జేయుటకు వెనుదీయడు. కాని రణకార్యములు ముగిసినపిదప పరాజితుల విషయమున ననగత్యముగ నెట్టిదుష్కృత్యములును జేయసమ్మతింపడు. విమలాతిలోత్తమలకట్టి దురవస్థగలుగఁజేసినది కటుల్ ఖానే గాని యీతఁడు కాఁడు. ఇతఁడెప్పుడును వారల ఖయిదీలుగఁ బట్టుకొనియుండలేదు. అస్మానను గ్రహమువలననే విమల యానాడు వధ్యస్థానమున భర్తను జూడఁగలిగెను. ఆమె వీరేంద్రునిభార్యయని వినినతోడనే పాప మాతనిహృదయము

సీరయిపోయెను. అతఁడు కటులుఖానునకు మేనల్లుఁడు, అభ్యంతరమందిరములోనికిఁ బోవుటకాతనికి స్వాతంత్ర్యము కలదు. ఈసంగతి యిదివఱకే విశదమైనది. కాని కటులు ఖానుని యంతఃపురమందిర ద్వారము దాఁటుటకు మాత్రి మాతనితనయులకైనను, నస్మానునికైనను, సాధ్యముకాదు. అస్మాను కటుల్ఖానునకు కుడిభుజము. కటుల్ ఖాఁ దామోదరానదీపర్యంతరాష్ట్రమునంతయు జయించిన దీభుజబలము వలననే, అందుచేఁ గోటలోనివారందరు కటుల్ఖానునకు వలెనే యస్మానునకును విధేయులైయుండిరి. తన్మూలముననే విమలను భర్తకడకు గొంపోవునప్పుడెవ్వరు నేయాటంకము లును జేయలేదు.

రెండుదినములు జరిగినవి. విమల మిగిలిన నగలన్నియు దనకుఁబరిచారికగా నియమింపబడిన యామెకిచ్చెను.

"అమ్మా? ఏమిసెలవు?"

"నిన్నటివలెనే నీవస్మాన్ ఖానునియొద్ద కేగుము. ఒక్కమాఱు నాకాతని దర్శన మొసంగుమనియు, నిదియే నా తుది ప్రార్థనమనియు, నింకనెన్నఁడు నట్టికోరికఁ గోరననియు, వేఁడుకొంటినని యాతనితోఁ జెప్పుము."

పరిచారిక యట్లుచేసెను. అస్మానిట్లుచెప్పెను.

"నేనటకు వచ్చుట యిరువురకు నపాయకరమే. నా యింటికడఁ జూడవచ్చునని చెప్పుము."

"అటకుఁ నేబోవుటెట్లు?" అని విమల యడిగెను.

"అమ్మా! అతఁడందులకుఁ దగినయుపాయముచేసెద నని చెప్పినాఁడు" అని పరిచారిక బదులుచెప్పెను.

రాత్రిపడిమెను. అయేషా పరిచారికలలో నొకర్తు లోపలికివచ్చి లోపలిభాగమున రక్షకులుగానున్న కోజ్జాలతో నేదియో మాటలాడెను. విమల నస్మాన్‌ఖాను కడకు గొంపోయెను. ఆతఁడు విమల నిట్లడిగెను.

"నావలన నీకింకను గావలసిన ప్రయోజనమెద్ది?"

"ఒక చిన్నకార్యమున్నది. రాజపుత్రుఁడు జగత్సింహుడు జీవించియుండెనా?"

"ఆఁ! జీవించియున్నాఁడు"

"ఆతఁడు ఖైదీయా?"

"ఖైదీయే కాని యిప్పుడు చెరసాలయందు లేఁడు. అతనికిఁ గాయములు తగిలినవి. మంచంపట్టియున్నాఁడు"

"దురదృష్టవంతురాండ్రగు నీయువిదల సంబంధము గలిగినంతవఱకుఁ బ్రతిమనుష్యుఁడును దురదృష్టవంతుఁడే యగుచున్నాఁడు. భగవదనుగ్రహ మిట్లున్నది. ఆతనికివ్యాధి కుదిరినచో నీయుత్తరము నాతనికిమ్ము. అంతపర్యంత మిది నీయొద్దనుంపుము. ఇదియె నాప్రార్థనము." అని యుత్తరము నాతని కిచ్చెను.

అస్మాన్‌ఖా నాయుత్తరమును మరల నిచ్చుచు నిట్లు చెప్పెను.

నేనీపని చేయఁజాలను, నన్ను మన్నింపుము. జగత్సింహుఁ డిప్పుడేస్థితిలోనున్నను, నాతఁడు ఖైదీగనే యెంచబడుచున్నాఁడు. మొదట మేము చదువకుండ నీయుత్తరము నట్టివానికిచ్చుటమాకనుచితము, అదిమాయజమానుని యాజ్ఞలకు వ్యతిరేకము."

"ఇందాక్షేపణీయమైన యంశములేవియులేవు. నా మాటనమ్మను. నీవేమియు సందేహింపఁ బనిలేదు. యజమానునియాజ్ఞ యనుచున్నావేమి? యజమానియెవరు? నీకు నీవే యజమానుఁడవు."

"ఇతర విషయములలో మామగారి యుత్తరువులకు వ్యతిరేకముగఁ బ్రవర్తింపగలను. కాని, యీ విషయమున మాత్రి మట్లొనర్పజాలను. ఈయుత్తర మనపాయకరమని చెప్పుచున్నావు. నీమాటయందు నాకు సంపూర్ణ విశ్వాసము కలదు. కాని, యిందుకొఱకు నేనా నిబంధన నతిక్రమింపఁ జాలను. ఈకార్యమున నీకు సహాయమొనర్ప నాకుసామర్థ్యము లేదు."

"అయిన సరియే! నీవు దీనిని చదువుము" అని విమల విచారముతో ననెను. అస్మాన్ ఖాన్ ఉత్తరమును గైకొని చదువ నారంభించెను.

ఆఱవ ప్రకరణము



విమల యుత్తరము

రాజకుమారా!

నాజీవిత చారిత్రమును నీకు విశదపఱచెదనని యొకదినమున నేను వాగ్దత్త మొనర్చియున్నదానను. నావాగ్దత్తము నెరవేర్పవలసిన యవసరము వచ్చినది.

తిలోత్తమ యబీన్రు సింహాసనాధినేత యర్ధాంగిలక్ష్మియైయున్నప్పుడు నాచారిత్రమును నీకడ విన్నవింపవలెనని నేనెంతో యాశతో నుంటిని కాని యాయాశ—అయ్యో—దైవమా—పాతాళమున కణగఁ ద్రొక్కఁబడినది. ఇఁక కొలఁదికాలములోనే యీభూలోకమునుండి విమలా తిలోత్తమలు పోయిరని బహుశానీవు వినఁగలవు. మాబ్రతుకిఁక లెక్కదినములలో నున్నది.

ఇందుమూలముననే నీకిప్పు డీయుత్తరమును వ్రాయుచుంటిని. నేను మిగుల పాపాత్మురాలను. నాజీవితకాలములో నేనెన్నియో దుష్కృత్యము లొనర్చితిని. నేనీలోకమును విడిచిపోయినతోడనే లోకము నన్నెంతయో నిందించును. ప్రజలు నాపై నెన్ని యకార్యకరణముల నారోపింతురో! అప్పుడు నాకుఁ గలుగనున్న యపకీర్తిని బాపువా రెవ్వరు? నాకీలోకమున నట్టి మిత్రు లెవ్వరున్నారు?

నాకు బంధువుఁ డొక్కఁడున్నాడు? కాని, యాయన యిఁక గొలఁదికాలములోనే ప్రాపంచ విషయములఁ బరిత్యజించి మోక్షవిషయిక కార్యములఁ బ్రవర్తించును. అట్టి యభిరామస్వామి మూలమున నాయుద్దేశము నెఱవేఱఁజాలదు. రాజపుత్త్రీ! ఎప్పటికయినను నేను నీబంధువర్గములో నొక్కర్తెనుగా నోపుదునని యాశనొందితిని. ఎప్పటికయిన నన్ను బంధువురాలనుగఁ దలంపవలయునని వేఁడుకొనుచున్నాను.—కాని యిప్పుడీవిషయ మేరితో విన్నవించుచుంటిని? ఈనిర్భాగ్యురాండ్రి యదృష్ట మగ్నిజ్వాలవలె దగ్గర

నున్న స్నేహితునిఁగూడ ముట్టుకొనుచున్నయది. అది యట్లుండనిమ్ము. ఈ సేవకురాలొనర్చు విన్నపమును మఱచి పోవకుము. విమల జారిణియనియు పరిచారికారూపముననున్న యుంపుడుకత్తెయనియు లోకులు చెప్పుకొన్నప్పుడు "విమల హీనవంశోత్పన్న. అదృష్టహీన, విషయాసక్త. కూడనికార్యము లెన్నియోఁ జేసినది. కాని, జారిణిమాత్రముకాదు" అని లోకమునకు వెల్లడిసేయుము. ఇప్పుడు స్వర్గమునందున్న పూజనీయుఁడు, నాయదృష్టవశమున నన్ను యథావిధిగఁ బరిణయమైనాఁడు. నా నాథుఁడు వ్యభిచారవిషయమున నన్నెప్పుడును ననుమానించి యుండలేదు.

ఈవిషయము చాలకాలమునుండి రహస్యముగనున్నది. ఇప్పుడెవ్వరు నమ్మెదురు? ఆతనిభార్యనైయుండియుఁ బరిచారికామిషమున నేలప్రవర్తింపవలసివచ్చెనో చెప్పెద వినుము.

గరమందర సమీపస్థమగు పల్లెయందు శశిశేఖరభట్టాచార్యుఁడను బ్రాహ్మణుఁ డొకఁడు కలఁడు. ఆతనితండ్రి చాల భాగ్యవంతుఁడు. శశిశేఖరుడు తనకు యౌవనము వచ్చువఱకు విద్యార్థి యయ్యెను. కానియావిద్య స్వభావమునందలి మాలిన్యమును దొలఁగింపలేక పోయెను. భగవంతుఁ డాతని కమితమయిన సుగుణసంపదనిచ్చి యాతనిహృదయమున విషయలోలత్వమునుగూడ నాటియుంచెను. విషయలోలత్వమెప్పుడును యౌవనమున నభివృద్ధి చెందునుగదా!

ఆకాలమున గరమందరమున జయధారసింహుని వంశము వాఁడగు రాజపుత్రుఁ డొకఁడుండెను. ఆతఁడు చక్రవర్తి సైన్యమున సైనికుఁడుగఁ జేరి చాలకాలము ఢిల్లీలోనుండెను. ఆతనిభార్య గరమందరముననేయుండి భర్తకొఱకుఁ జాల కృశించుచుండెను. ఆమెసౌందర్య మసామాన్యము. తుదకామె యింద్రియవృత్తుల నణఁపఁజాలక శశిశేఖరుని మోహించి యాతనితో యథేచ్ఛముగ విహరించెను. కొలఁది కాలములోనే యామె గర్భవతియయ్యెను.

పాపము, నగ్నియుఁ జాలకాలము దాఁగియుండవు. శశిశేఖరుని యకార్యకరణము తండ్రిచెవులఁ బడియెను. తన కుమారునివలన నింకొకకులమునకుఁ గలుగనున్న యాకళంకమును దొలగించుటకై యాతఁడతిశీఘ్రముగ నింటికి రావలయునని యామెభర్త కుత్తరమువ్రాసెను. మఱియుఁ దన తనయునిఁ గఠినముగ మందలించెను. తండ్రిచే నవమానింపఁ బడి యాతఁడు దేశమునువీడి లేచిపోయెను.

ఆతఁడు కాశీ కేగెను. విద్యాసముద్రుఁడని పేరొందిన దండి కీర్తినివిని యాతనికడ విద్యనభ్యసింప నారంభించెను. శశిశేఖరుఁడు స్వతః కుశాగ్రబుద్ధికలవాఁడు. కావున షడ్దర్శనములలో నాతఁడు పూర్ణపరిజ్ఞానవంతుఁడయ్యెను. మఱియు ఖగోళశాస్త్రమునఁగూడ శ్లాఘ్యతఁ గాంచెను. దండియాతని యెడ నత్యంతవాత్సల్యముతో నుండెడివాఁడు.

శశిశేఖరుఁడట నొక శూద్రస్త్రీయింట వాసముసేయుచుండెను. ఆమెకొక నవయౌవనవతి కుమార్తెకలదు. ఆయు

వతి వంటకుఁ గావలసిన పదార్థములు మొదలగునవి యుందిం చుచు నాతని పూజించుచుండెను. జననీ జనకుల గౌరవమును గాపాడు భారము బిడ్డలయందుండును కదా! ఇఁక నే జెప్పవలసిన దేమున్నది? ఆశూద్రయువతియే ఈ దురదృష్టవంతురాలగు విమలకు జనని.

ఈసమాచార మంతయువిని దండి "బిడ్డా! అక్రమ పవిత్రకులకు నేను విద్యాగఱపను. ఇఁక నీముఖమును గాశీపట్టణమున నెన్నఁడును జూపింపకుము." అనియెను.

శశిశేఖరుఁడు లజ్జనొంది యటనుండి వెడలిపోయెను. మా తాత మాయమ్మను కులభ్రష్టయని యింటనుండి వెడలఁ గొట్టెను.

పేదరాలగు మాయమ్మ నన్నుఁ దీసికొని యొకకుటీర మునకుఁ గాపురమునకుఁ వచ్చెను. ఆమె కాయకష్టమువలన మేముపొట్టఁ బోసికొనుచుంటిమి. మేము పేదవారలమగుటచే మమ్ములనెవ్వరును లక్ష్యముసేయలేదు. నాతండ్రిసమాచార ములు దెలియనులేదు. ఇట్లు కొన్నియేండ్లు గడచినవి. హే మంతఋతువున నొకనాఁడొక ధనికుఁడగు పఠానుఁడు వంగ దేశమునుండి ఢిల్లీకామార్గమునఁ బోవుచుండెను. ఆతఁడు చాల రాత్రియగువఱకు కాశీపట్టణమును జేరెను. విశ్రమిం చుటకెక్కడ తావు దొరకలేదు. భార్యయు నొకశిశువు నాతనితో గూడనున్నవారు. వారు మాకుటీరమునకువచ్చి మాయమ్మను నారాత్రి తమ్మట గడుపుకొననిమ్మని వేఁడు కొనిరి. "హిందువులెవ్వరును నాకాశ్రయ మీయలేదు. ఈ

శిశువుతో సెరాత్రియే మెక్కడకు బోవుదుము? పాపమీబుడు తఁడు చలిని సహింపలేకున్నాఁడు. నాతోఁగూడ మనుష్యులు విస్తారముగ లేరు. ఈకుటీరమున మాకొక్క గదినిచ్చితివా యదియచాలును నీకుఁ బరితృప్తియగునట్లుగ బహుమాన మొసఁగెదను.' అనియెను. ఆతఁడొక యత్యవసర కార్యము మీఁద ఢిల్లీకిఁ దొందరగఁ బోవుచుండెను. అతనితో నొక్క సేవకుడు మాత్రమున్నాఁడు. మాయమ్మ యెంత పేదరాలో అంత దయార్ద్రస్వభావము గలది. ధనమందలి యాశ చేనైననేమి యాశిశువునందలి కనికరముచేనైననేమి మాకుటీర మున వారికిఁ దావొసంగెను. ఒకభాగమున దీపముపెట్టుకొని భార్యాపుత్త్రిలతో నాతడు పరుండి యుండెను. వేఱొకభాగ మున మేము శయనించితిమి. ఆకాలమున వారణాసియందు శిశువుల నెత్తుకొనిపోవు చోరులెందఱో యుండిరి. అప్పుడు నేనాతేండ్ల దానను. జరిగినదంతయు నేను చెప్పజాలను. మా యమ్మచే వినినవిషయముల నిటనుడివెదను.

రాత్రి రెండుఝాములైనది. దీపము వెలుగుచుండెను. దొంగయొకఁడు గోడకు గన్నముత్రవ్వి లోపల బ్రవేశించి యాపఠాను పిల్లవానిని దొంగిలించుచుండెను. అప్పుడు నాకు మెలకువ వచ్చినది. చూచితిని. 'దొంగదొంగ' యని పెద్ద కేకవైచితిని. అందఱు మేల్కొనిరి.

పఠానుభార్యకు దనప్రక్కను పరుండబెట్టినబిడ్డ కనఁ బడలేదు. తత్క్షణమే యామె పెద్దకేకవైచెను. చోరుడు బాలునితోఁగూడ నావలకు బాఱిపోయెను. పఠానుడా మను

ష్యునిపై దుమికి వానిజుట్టుపట్టుకొని శిశువు నూడబెఱికికొనియెను. చోరుడు తన్నురక్షింపుమని బ్రతిమాలుకొన బఠానుడాతని చెవి నొకదానినిగోసి విడిచిపెట్టెను.

అస్మాన్ ఖా నింతవరకును జదివి యేదియో యోచన సేయదొడంగెను. విమలతో నిట్లనియెను.

'నీకింక వేఱొక పేరు లేదా?'

'ఉన్నది. అది మహమ్మదీయనామము. దానిని మా తండ్రి మార్చివైచినాఁడు.'

"ఆపేరేమి? మహరు కాదా?"

"ఔను. నీ వెట్లెఱుంగ గలిగితివి?"

"నేనే ఆపిల్ల వాడను"

విమల యాశ్చర్యపడియెను. అస్మాన్ మరల చదువ నారంభించెను. మరుసటిదిన ముదయము నాపఠానుడు బయలుదేరిపోవుచు మాయమ్మతో నిట్లనియెను. "నీకుమార్తె మాకు జేసిన యుపకారమునకు బదులు మేమేమియు బత్యుపకార మొనర్పలేము. అయినను నీమనోరథము నెఱిగింపుము. నేను ఢిల్లీకి బోవుచున్నాడను. నీవేదికోరిన నది యక్కడ నుండి పంపెదను. ద్రవ్యమపేక్షింతువేని యది యేపంపెదను. మాయమ్మ యిట్లు బదులు చెప్పెను. "నాకు ద్రవ్యమక్కఱ లేదు. ఇట్లే పాటుపడి పనిచేసికొని కాలమును సుఖముగాఁ గడపఁగలను. కాని మీకుఁ జక్రవర్తితో విశేష పరిచయ ముండెనేని___"

"పరిచయమున్నది. రాజునాస్థానమున నీకు గావలసిన సాయమొనర్చెదను."

"అయిన, దయచేసి యీబాలికతండ్రి సమాచారముల నారయఁ బ్రయత్నింపుఁడు. తెలిసెనేని నాకుఁ దెలియఁ జేయుఁడు."

"అట్లేచేయుదు" నని పఠానుఁడు వాగ్దత్తముచేసెను. ఆతఁడు కొంతద్రవ్యము నీయఁబోయెను. కాని, మాయమ్మ వలదని దానిని నిరాకరించెను. ఆతనివాగ్దత్తము ననుసరించి నాతండ్రిసమాచారములను గనుగొనుటకై చక్రవర్తియుద్యోగస్థుల గొందఱును నియమించెను. కాని, కార్యములేక పోయినది. ఇది గడచిన పదునాలుగేండ్లకు మాతండ్రి సమాచారమును వారెఱింగిరి. దానిని మాయమ్మకడ కంపిరి. "అతఁడు ఢిల్లీలో నున్నాఁడు. శశిశేఖరభట్టాచార్యుఁడనుటకు బదులు అభిరామస్వామి యను పేరును వహించినాఁడు" ఈ వార్తవచ్చునప్పటికి మాయమ్మ లోకాంతరగతురాలయ్యెను. ఆచార విద్యుక్తముగఁ గాకుండ బరిణయమాడిన స్త్రీలకు స్వర్గమున దావుగలదేని మాయమ్మ స్వర్గమునందుండుట నిశ్చయము.

నాతండ్రి సమాచారము నాకెఱుగవచ్చు నప్పటికి మాయమ్మ లేకపోవుటచే నాకు కాశియందుండుట కిష్టము లేకపోయినది. నాకీప్రపంచమునఁ దండ్రిదక్క నింకనెవ్వరును లేరు. ఆతఁడు ఢిల్లీలోనుండ నేనుగాశియందుండు టెందులకు అని యోచించి నేనాతని కడకుఁ బోయితిని. మొట్టమొదట

నాతఁడు నన్నుజూచి చాలనసహ్యించుకొనెను. కాని, నేనా తని పాదములపైబడి యేడ్చుచుండ తుదకాతనికి బరిచర్య సేయుచుండుట కంగీకరించెను. "మహారు" అనెడి నానామమునుమార్చి విమల యని పేరుపెట్టెను. శ్రద్ధాభక్తులతోఁ దండ్రిగారికిఁ బరిచర్యలు సేయుటలో నాకాలమంతయుఁ గడుపుచుంటిని. ఇదియంతయు నాయందాతనికిఁ బ్రేమ గలుగుననుతలంపుతోఁ చేసినదికాదు. నిజముగానాతనియందు గల గౌరవభావముననే చేయుచుంటిని. అతఁడు దక్క నాకిఁక నెవ్వరున్నారు? అతనికి సేవసేయుటదక్క నాకీప్రపంచమున సౌఖ్యమేమియున్నది? కర్తవ్యమేమికలదు? నేజేయు సేవకు సంతసించుటనో, మానవస్వభావమునకు లోబడుటనో, యాతనికి నాయందు చాలప్రేమయుదయించెను. ప్రేమ ప్రవహించుచున్న నదివంటిది. ప్రవహించుచున్నకొలదిని శక్తి యభివృద్ధియగుచుండును. నానాథుడు వధ్యస్థానముననున్నప్పుడు, ప్రేమసముద్రమెంత యగాధమయినదో నేను దెలిసికొంటిని.



## ఏడవ ప్రకరణము

### విమల యుత్తరము శేషము

రాజపుత్త్రా!

గరమందరమున మాతండ్రిని మోహించి గర్భవతియై యున్న యొక పేదయువతి యుండెనని యిదివఱకుఁ దెలిపి

యున్నాను. ఆమె యదృష్టముకూడ మాతల్లివలెనే యయినది. ఆమెకుఁగూడ నొకతనయ యుద్భవించెను. భర్తయనంతరమామెయు నాతల్లివలెనే పాటుపడి బిడ్డతో కాలము గడుపుచుండెను. ఫల మెప్పుడును ఉత్పత్తి స్థానమునుబట్టి యుండదు. మృదుకుసుమములనుఁబూయు వృక్షములు కఠిన పర్వతములపైబయలు వెడలుచున్నవి. అంధకార బంధురములగు గనులనుండి దేదీప్యమానములగు రత్నములు పుట్టుచున్నవి. ఆపేదయువిద కుటీరమున భూసంచార నక్షత్రమొకటి బయలువెడలెను. ఆమెకుమార్తె యద్వితీయసౌందర్యవతియని పేరువడసెను. కాలమత్యద్భుతములను జూపుచుండును. కాలమే యావితంతువు కళంకమును దుడిచివైచెను. ఆయువతి జనన హేతువును గొందఱు మరచిపోయిరి. కొందఱెఱుఁగనే యెఱుంగరు. కోటలోనివారు కొందఱెఱుగుదురో యెఱుగనేయెఱుంగరో? ఇఁక వేఱే చెప్పనదేమి? ఆసౌందర్యవతియే యీతిలోత్తమజనని.

తిలోత్తమ యామె తల్లిగర్భమం దుండగనే నాకీ పరిణయమైనది. ఆకాలమున నొకనాఁడు మాతండ్రి తన యల్లుని మాకుటీరమునకు దీసికొనివచ్చెను. ఆతనిని తన శిష్యుఁడని చెప్పుకొనెను. నిజమైన వృత్తాంతము నానాథుని వలన నాకు దెలిసినది.

ఆతనిఁ జూచినతోడనే నాహృదయ మవశ మయిపోయినది. ఆతఁడు ప్రతిదినమును మాకుటీరమునకు వచ్చి చాలసేపుండెడివాఁడు. అనేక విషయములనుగూర్చి మాట

లాడుచుండెడివాఁడు. కథలు చెప్పుచుండెడివాఁడు. నేనాతని మధురవాక్యామృతమును గ్రోలి యానందించుచుండెడి దానను, నాశరీరమును హృదయము నాతనికి నామనసున నమ్మివైచితిని. ఆతఁడుకూడ నన్ను నిరసింపలేదు. ఒకరి యుద్దేశ్యముల నొకళ్ళము గ్రహించితిమి. నేనాతనితో మాటలాడితిని. ఆతఁడు రహస్యముగ నాడిన మాటలధ్వను లిప్పటికిని గంధర్వ వీణాగానమువలె నా చెవియందు ధ్వనించుచున్నవి.

నాహృదయము నాతనికి చౌకగ విక్రయించినను, నా తల్లియనుభవించిన యవస్థమాత్రము నామనస్సును వీడిపోలేదు. నాకన్యాత్వమును విక్రయింప నిష్టములేకపోయినది. కాని, యిది యాతనియౌత్సుక్యాగ్నిని జల్లార్పలేకపోయినది. మాతండ్రి యీసంగతి నంతయుఁ గనిపెట్టెను. ఒకదినమున నాయనకును, నానాథునకును, నీక్రింది సంభాషణ జరిగెను. అది చాటుననుండి వింటిని.

"విమలను విడిచి నేను వేఱొకచో నుండజాలను. నీవు విమలను బెండ్లియాడితివా! నీతోఁగూడ నేనుందును. కాని, నీయభిప్రాయ మన్యథానున్నచో—"

"అయ్యో! నేను శూద్రస్త్రీనెట్లు పెండ్లియాడుదును" అని యాతఁడు కోపముతోననియెను.

"నీవిదివఱకు జారజనెట్లు పరిణయమైతివి" అని మాతండ్రి యపహాస్యముతోఁ బలికెను."

"పరిణయమగునప్పుడామె యట్టిదని నేనెఱుంగను.

పూర్ణముగఁ దెలిసియుండియు శూద్రస్త్రీ నెట్లు వివాహ
మాడుదును. ఇంతేకాక నీపెద్దకూఁతురు జారజమైనను
శూద్రస్త్రీకాదు.''

''పెండ్లియాడ నీకిష్టములేకపోయినచో నీవిటకువచ్చు
టాక్షేపణీయము. నీవిఁక మాకుటీరమునకు రానగత్యము
లేదు. నేనేనీయొద్దకు వచ్చుచుండెదను''

ఆనాఁడు మొదలాతఁడు కొంతకాలమువఱకు మా
కుటీరమునకురాలేదు. నేను ప్రతిదినము నాతనికొఱకత్యా
త్రముతోఁ జూచుచుండెడిదానను. తుదకాతఁడు మరల రా
నారంభించెను. ఆతఁ డిక్కడ రాకుండ నుండలేకపోయెను.
ఆతఁడు వచ్చుట మానినతోడనే ప్రేమయన నేమియో నేను
తెలిసికొనగలిగితిని. కడపటిసారి యాతఁడు మాకుటీరమునకు
వచ్చుచున్నప్పుడు మునుపటివలె లజ్జావిహీనహృదయనైయుం
డరాదని నిశ్చయించుకొంటిని. ఈవిషయమును మాతండ్రి
గ్రహించెను. ఒకనాఁ డాయన నన్ను పిలిచి ''విమలా!
నేను సన్యాసాశ్రమమును స్వీకరించితి నని నీవెఱుంగుదువు
కద! నేనెప్పుడును నీతోనుండ నాకవకాశములేదు. దేశసం
చారము చేయవలసి యుండును. నేను సంచారమున కేగు
నప్పుడు నీవెటనుందువు?'' అనియెను.

మాతండ్రిని విడిచియుండుటకు నేనుచాలవిచారించి
తిని. ''నేనుకూడ నీతోవచ్చెద''నంటిని. ఇంతలో నాహృ
దయమునకు నానాథుచూపట్టెను. మరల నిట్లు చెప్పితిని.
''లేదా. నేను మునుపటివలెనే కాశియందుండెదను''

"విమలా! అట్లుకాదు. ఇంతకంటె మంచికార్యమొకటియున్నది. నీకొఱకొక మంచి యాశ్రయముజూచెదను, నేను దేశసంచారార్థమేగినప్పుడు నీవు మానసింహరాజువారి నూతన రాజ్ఞీమణికడఁ బరిచారికగా నుండవచ్చును."

"తండ్రీ! నన్ను విడిచిపుచ్చెదవా?" అని యేడ్చితిని.

"లేదు. లేదు. ప్రస్తుతమున నేనిటనే యుందును. నీవు మానసింహుని నగరున కేగుము. ప్రతిదినమును నిన్నుఁ జూచుచుండెదను. అచ్చట నీకెట్లుజరుగునో చూచి యగత్యమయిన యేర్పాటుల నన్నిఁటిని చేసెదను. అని యూతఁడనెను. రాజకుమారా! నేను కొన్నాళ్ళు మీమందిరమున నివసించియుంటిని. ఈమిషచే నాతండ్రి నన్ను తనయిల్లుని దృష్టిపథమునుండి తొలగించెను.

మీతండ్రిగారి భవనమున నేను చాలకాలముంటిని. కాని నీవది యెఱుంగవు. నీవప్పుడు పదేండ్లబాలుఁడవు. అబ్నీరులో మీతల్లితోఁగూడ నున్నాఁడవు. అప్పుడు మీ కొత్తసవతితల్లికడ నేనుంటిని. మహారాజగు మానసింహునకు దండకు బుష్పములవలె నెందఱో రాణులుండెడివారు. మీసవతితల్లుల నందఱ నీవెఱుంగుదువా? యోధపురపురాజ తనయ యూర్మిళ నీజ్ఞప్తియందుండెనా? ఆమె నాయందగ పఱచిన దయను నేనెంతని చెప్పఁగలను? ఆమె నన్నుఁ బరిచారికగాఁ జూడలేదు. ప్రియసోదరివలె నన్నాదరించినది. ఆమెయాదరమున నేను మంచి విద్యసంపాదించితిని. ఆమె యనుగ్రహముననే బుటేదారీపనికూడ నేర్చుకొంటిని. ఆమెను

సంతోషపఱచుటకొరకే సంగీతనృత్యములనభ్యసించితిని, ఉత్తరములు వ్రాయుటకూడ నామెయే నాకు నేర్పినది. అందుమూలమున నాకీయుత్తరము వ్రాయుసమర్థత వొడమినది. ఆమె యనుగ్రహము వలననే యిప్పటికిని మంచియదృష్టమనుభవించుచున్నదానను. ఆమె యాదరించుటయేగాక నన్ను మహారాజునకుఁ గూడఁ బరిచయముచేసెను. సంగీతనృత్యములయందు నాకుఁ గొంతప్రజ్ఞకలదు. నావలన సంగీతనృత్యములనువిని మహారాజానందించుచుండెడివాఁడు. మహారాజు నన్ను స్వకుటుంబములోనిదానివలెఁ జూచుచుండెడివాఁడు. నన్నుజూచుటకుఁ దఱచుగా వచ్చెడు నాతండ్రినాతఁడు చాల గౌరవించుచువచ్చెను.

ఊర్మిళతో నేను సుఖముగఁ గాలముగడుపుచుంటిని. కాని నాకొక్క విచారముమాత్రముండెను. నామర్యాదఁ దక్క తక్కినవన్నియు నాప్రాణములతోఁగూడ నెవరికర్పింప సిద్ధముగనుంటినో, యట్టినామనోహరుఁడు చాలకాలమునుండి నాకుఁ గనఁబడుటలేదు. ఆతఁడు నన్ను మరచిపోయెనా? లేదు. రాజపుత్త్రీ! ఆమ్మానియను పరిచారికను నీవెఱుంగుదువా? ఎఱిగియుందువు. నేనామెతో సఖ్యమొనర్చితిని. నానాథుని సమాచారములను దెలిసికొనిరా నామెనుబంపితిని. ఆమెయట్లు చేసినది. నేనాతనికొకయుత్తరము వ్రాసితిని. దానికాతఁడు ప్రత్యుత్తరము వ్రాసెను. దానినిగూర్చి నేనెంతని చెప్పుదును? ఆదినమునకాదినము మేము వేఱయినను

నిట్లు త్తరప్రత్యు త్తరముల మూలమున మాటలాడుకొనుచు నన్యోన్యానురాగము నభివృద్ధిచేసికొనిచుంటిమి.

ఈరీతిగ మూఁడేండ్లు గడచినవి. చాలకాలమునుండి విడిపోయినను, నొకరినొకరు మఱవక యన్యోన్యానురాగముతో నున్నందున మాప్రేమ నాచువలె పైపైనున్నది గాదనియు, పద్మమువలె వ్రేళ్ళుపాఱియున్నదనియుఁ దెలిసికొంటిమి. తుదకు నామనోహరున కేలయోగ్యులేకపోయెనో, నేనెఱుంగను, ఆతఁడు దూరాలోచనలేక ప్రవర్తించెను. ఒకనాఁడు నాగదియందు నేనొక్క తెను బరుండియుంటిని. మెల్లఁకువవచ్చి చూచునప్పటికి నాతలదిక్కున నాదీపప్రకాశమున నొకమనుష్యుఁడు కనఁబడెను. అప్పు డీమధుర వాక్యములు నా చెవులంబడినవి.

"ప్రియా! భయమొందకుము. నేను నీవాఁడను"

నేనేమి ప్రత్యుత్తర మిత్తును? మూడేండ్ల తరువాతనైన సమావేశము! నేనన్నియు మఱచిపోయితిని. ఆతని కంఠమును గౌఁగలించుకొని యేడ్చితిని. నాకొక్కింత మాటలాడ శక్తిగలుగఁగనే "ఈయభ్యంతర మందిరమున కెట్లు వచ్చితివి?" అని అడిగతిని.

"ఆప్మానీ నడుగుము. నీళ్ళు మోయువానివలె నామె వెంటవచ్చితిని. అప్పటినుండియు నిందు దాఁగియుంటిని."

"అయిన నిప్పుడేమిచేయవలయును?"

"ఏమియూ? నీయిష్టము."

ఏమిచేయవలయునాయని యాలోచించుచుంటిని ఏ

మార్గము నవలంబింతునాయని యోచించితిని. నాభావో ద్రేకము లేమార్గము నవలంబించినవో యామార్గమునకే నా హృదయమును బోయెను. ఇంతలో నాకస్మికముగ నాగది తలుపు తెఱువఁబడెను. మాయెదుట మానసింహమహారాజు నిలువఁబడియెను.

ఇఁక వివరముగఁ జెప్పఁబనియేమి ? నా నాథుఁడు ఖైదీగాఁ బట్టుకొనఁబడియెను. న్యాయశాస్త్రానుసారముగ దండింతునని మహారాజు తనయుద్దేశమును వెలిపఱచెను. అప్పుడు నాయవస్థ యెట్లుండునో నీవే యూహించుకొనగలవు. ఏడ్చుచు నూర్మిళ పాదములపైఁ బడితిని. నాయవివేకమును నిష్కపటముగ నొప్పుకొంటిని. నేరమంతయు నాపైనిబెట్టు కొంటిని. నాతండ్రినిగలిసికొని యాయనపాదములపైఁగూడఁ బడితిని. మహారాజున కాయనయందు గౌరవముకలదు. గురువువలె సన్మానించుచున్నాఁడు. నాతండ్రిప్రార్థన నాతఁడంగీకరించునని తలంచితిని. "నీపెద్దకుమార్తె దురదృష్టమునాలోచింపుము" అని నాతండ్రితో విన్నవించితిని. ఆయన మహారాజుతో గలిసి మాటలాడునని యనుకొంటిని. కాని, నా ప్రార్థనలన్నియు నాతనికడఁ జెవిటికిసంకూదినట్లయినవి. ఆతఁడాగ్రహమునొంది నన్నిట్లునిందించెను. "నిర్భాగ్యురాలా! నీవు సిగ్గును విడిచివైచితివా?"

ఊర్మిళకు నన్ను రక్షింపవలయునని యూహ వొడమెను. నావిషయమున మహారాజును బ్రతిమాలుకొనియెను. "వీరేంద్రుఁడు విమలను బరిణయమాడ నంగీకరించునేని నే

నాతని క్షమించెదను." అని మహారాజానతిచ్చెను. ఆతని యభిప్రాయమును నేనుగ్రహించి యూరకుంటిని నానాథుఁ డామాటను విని యత్యాగ్రహము నొంది యిట్లు ప్రత్యుత్తర మిచ్చెను.

"నే నెప్పుడును ఖైదీగ నైన నుండెదను. నాప్రాణములు విడువుమన్న విడిచెదను. కాని నేనెన్నఁటికిని శూద్ర వనితను బెండ్లియాడను. నీవు రాజపుత్త్రుఁడవైయుండియు నన్నెట్లాపని చేయమనెదవు?"

"నాసోదరిని యువరాజగు సలీమునకిచ్చి పరిణయ మొనర్చినప్పుడు, నిన్నొక బ్రాహ్మణుని తనూజాతను వివాహ మగునని చెప్పుటలో నాశ్చర్యమేమికలదు?" అని మానసింహుఁడు ప్రత్యుత్తరమిచ్చెను.

నానాథుఁ డంగీకరింపలేదు. ఇట్లనియెను.

"మహారాజా! జరిగినదేమో జరిగినది. అనుగ్రహముంచి విడిచిపెట్టితివా యిఁక నేనెన్నడును విమల పేరైన దలపెట్టను"

"నీవుచేసిన నేరమునకుఁ బ్రాయశ్చిత్త మేమిచేసికొన నెంచితివి? విమలను విడిచిపెట్టుటయా? ఇతరు లామెను గుల భ్రష్టయని బరిత్యజింపరా?"

ఎంతచెప్పినను నాతఁడు పట్టువిడువలేదు. ఆతఁడు కారాగృహమున నతినీచముగఁ జూడఁబడెను! అతికష్టమనుభవించుచుండెను. ఆబాధల సహింపలేక తుదకాతఁ డర్ధాంగీకారము నొసంగుచు నిట్లుచెప్పెను.

"విమల నాయింటఁ బరిచారికగా సంచరింప నిష్ట పడు నేని, ఆమె యీవివాహవిషయము నా కెప్పుడునుజ్ఞప్తికిఁ దేకుండు నేని, ఆమె యెప్పుడును నాకు ధర్మపత్నియనిచెప్పు కొనకుండు నేని, నేనాశూద్రవనితను బెండ్లియాడెదను. లేనిచో నేఁ బరిణయముగాను."

మహోత్సాహముతో వీనికన్నిటికిని నేను సమ్మతించితిని. నాకు భాగ్యముపైఁగాని, పేరునందుఁగాని యించుకంతయిన నాశలేదు నానాథునికొఱకే నేనుపరితపించుచుంటిని నాతండ్రియు మహారాజునుగూడ నిందులకు సమ్మతించిరి. నేను బరిచారికా వేషమున నానాథుని గృహమునకువచ్చితిని.

నామనోహరుఁడు నన్ను నిర్బంధముమీఁదఁ బరిణయమైనాఁడు. నిర్బంధమున జేకొనిన కాంత నెవ్వరు ప్రేమింతురు? పరిణయానంతరమున నాతనికి నాపైఁ జాలనసహ్యము జనియించినది. పూర్వపుప్రేమయంతయునదృశ్యమైపోయెను. మానసింహునివలనఁ దాననుభవించిన కష్టము, అమర్యాద, జ్ఞప్తికిఁ దెచ్చుకొనుచు నన్ను నిందించుచుండెడివాఁడు.

ఆతని తిరస్కారమే నేను ప్రేమగా భావించుకొనెడి దానను. ఈవిధముగఁ గొంతకాలము జరిగినది. కాని యవి యన్నియు నిందుదహరించుటవలన లాభమేమి? నాస్వీయ చరిత్రతో సంబంధించిన దింతయే ఇఁక నధిక మేమియు లేదు. తరువాతఁ గ్రమక్రమముగ నాతని యనురాగమును మరలఁ బడయగలిగితిని. కాని, యెప్పటికిని నక్బరుప్రభువుపై నాతఁ డధికముగ వైరభావమునే కలిగియుండెడివాఁడు. అది విధి

విధానము. లేనిచో నివియన్నియు నెందులకు సంభవించును? రాజకుమారా! నాపని యయిపోయినది. నా వాగ్దత్తమును నెఱవేర్చుటకే నేనిది వ్రాయలేదు. నాగౌరవమును బోఁ గొట్టుకొని నేను గరమందరప్రభువుని భవనమున నుంటినని లోకు లనుకొనెదరు. నేనీప్రపంచమును వీడిపోయినప్పుడు నా గౌరవమునకుఁ గలుగు కళంకమును నీవు తుడిచి వేయుదువని నాప్రార్థనము. ఇందులకే నేనీయుత్తరము వ్రాసితిని.

నాచరిత్రముతో సంబంధించిన విషయములనుమాత్రమే యిందు వ్రాసితిని. నీవెవరి నిమిత్తమాత్రముతో నుందువో అట్టియామెనుగూర్చి యొకవిషయమైనను వ్రాయలేదు. ఆమె పరీప్రపంచమున నశించిపోయినదని తలంపుము. తిలోత్తమ జీవించియున్నదనుమాట మఱచిపొమ్ము.

ఉత్తరమునంతను జదివి యస్మాన్‌ఖానిట్లనియెను.

"అమ్మా! నీవు నాప్రాణములను గాపాడితివి. నేను నీఋణమును దీర్చుకొనియెదను."

విమల నిట్టూర్పు విడిచి యిట్లుబదులు చెప్పెను.

"అయ్యో! నానిమిత్తమిప్పు డేమిచేయఁగలవు? నీ వలన నగుకార్యమిప్పుడేమికలదు? అయిన నింకనొక్క —

"అది తప్పక నెరవేర్చెదను."

విమల నేత్రములు దీక్షత వహించెను. ఇట్లనియెను.

"అస్మాన్! ఏమనుచుంటివి? మండుచున్న యీహృదయమును మరల నీవేల వంచించెదవు"

అస్మాన్ తనవ్రేలినుండి యుంగరమును దీసి యిట్లు చెప్పెను.

“ఈయుంగరమును బుచ్చుకొనుము. ఒకటి రెండుదినములలో నేనేమియుఁ జేయలేను. కాని కటుల్ ఖానుని జన్మదినము రానున్నది. ఆనాఁడు సంతోషముతోడను, మద్యపానాదులతోడను, రక్షకులొడలు మరచియుందురు. ఆరాత్రి నిన్ను దాఁటించెదను. అర్ధరాత్రిమున నభ్యంతరమందిర ద్వారముకడకు రమ్ము. అట నిట్టియుంగరము నింకొకదాని నెవ్వఁడగపఱచునో వానితోఁగూడఁ బొమ్ము. ఏవిఘ్నమును లేకుండ నీవుదాఁటిపోఁగలవని యనుకొనెదను. అయినను నిది యంతయు భగవదధీనము.”

“భగవంతుఁడు నిన్ను రక్షించుగాక; ఇంతకన్న నేఁ జెప్పునదేమి?” అని విమల యనియెను.

విమలకు గద్గదస్వరము వచ్చెను. మాటాడలేక పోయెను. ఆతనికడ సెలవు గైకొని పోనున్న సమయమున నామెతో “నీకొక్కమాట చెప్పెదను. నీవొక్కతవేరమ్ము. నీవెవరినైనఁ దీసికొనివచ్చినచో నీయుద్దేశము కొనసాగ నేరదు. అపాయకరముగూడనగును.” అని యస్మాననియెను.

తిలోత్తమను దీసికొనిపోరాదని యాతని యభిప్రాయముగా గ్రహించి విమల తనలో నిట్లనుకొనెను.

“మంచిది. మేమిరువురమును పోరాదేని ముందు తిలోత్తమనే యవ్వలకుఁ బంపివైచెదను.”

విమల యాతనికడ సెలవుఁ గైగొనిపోయెను.

---

—•—

## పునరారోగ్యము

కాలము పరుగెత్తు స్వభావము కలది. నీవేమిచేయుచున్నను సరే కాలముమాత్రము నిలువఁబడదు. పరుగెత్తుచునే యుండును. నీవెట్టిస్థితిలోనున్నను కాలగమన మాఁగియుండదు. పోవుచునేయుండును. పథికుఁడా! వర్షమున, గాలిచే, నధికముగ కష్టపడుచున్నావా? నీశిరస్సుపై మేఘములు కాఱు క్రమ్ముకొని గర్జించుచున్నవా? వాయువులు క్రమముదప్పి విసరుచున్నవా? వర్షములోఁదడియుచుంటివా? నీదేహమును వడగండ్లు మొత్తుచున్నవా? తలఁ దాఁచుకొటకు నీకెక్కడ నాశ్రయములేదా? కొంచెమోర్పు వహింపుము. ఈదినము శాశ్వతముగ నుండదు. వెళ్ళిపోవును. కొంచెముసేపాగుము. ఈభయంకరదినము గడచిపోఁగలదు. మంచికాలము రానున్నది. సూర్యుఁడు మరలఁ బ్రకాశింపనున్నాఁడు. ఱేపటి వఱకు నిరీక్షింపుము.

ఎవరిదినములు గడచిపోవు ? ఎవరికి కష్టదినములు శాశ్వతములుగానున్నవి? సోదరుఁడా! ఏల దుఃఖించెదవు ? ఎవరికి సుఖదినములు గడచిపోకుండ నున్నవి? ఏల డంబములు పలికెదవు ?

ఎవరిదినములు గడచుటలేదు ? తిలోత్తమ పరాగమునఁ బడిదొరలుచున్నది. అయినను దినములు గడిచిపోవుచునే యున్నవి.

విమల హృదయము పగకు నివాసగృహమైనది. ఆ గృహముయొక్క ప్రతిభాగమునందును, నావిరోధసంబంధమయిన విషము వ్యాపించియున్నది. అను నిమిషమును నా విషము దుస్సహముగ బాధించుచున్నది, దినమున కెన్ని నిమిషములు? ఎన్ని నిమిషములు గడపిన దినమగును! ఆమె దినములు గడచుటలేదా?

జయమునుగాంచిన కేటుల్ ఖాఁ మహాభోగముతో నున్నాఁడు. ఆతనికి దినములు సుఖముగా నున్నవి. అయిన నవియును గడిచిపోవుచునే యున్నవి. కాని, నిలిచియుండుట లేదు.

జగత్సింహుఁడు వ్యాధిపీడితుడై యున్నవాఁడు. వ్యాధిపీడితునకు కాలము చాలనాలస్యముగ నడచునని యెవ్వరెఱుంగరు? అయినను నాతనికిని దినములు గడచిపోవుచునే యున్నవి.

అవును. దినములు గడచుచునే యున్నవి. జగత్సింహునకుఁ గ్రమక్రమముగఁ బునరారోగ్యము కలుగుచున్నది. మృత్యుదేవత నోటినుండి తప్పివచ్చినాఁడు. క్రమక్రమముగ బలము చేరుకొనుచున్నది. శరీరరుగ్ణత యదృశ్యమైనది. ఆఁకలి కలిగెను. బలము కలిగెను. హృదయమున కాత్రము జనియించెను.

ఆతనిప్రథమోద్దేశము– "తిలోత్తమయెటనున్నది?" బలముకలిగినకొలదిని విచారకరమైన హృదయముతో నాతఁడు మార్గమునవచ్చుచుఁ బోవుచునుండువారి నందఱఁదిలో

త్తమునుగూర్చి యడుగుచుండెను. కాని, యెవ్వరును దృష్టి కరమగు ప్రత్యుత్తరమీయలేదు. ఆయేషా యెఱుఁగదు—అస్మాన్ చెప్పలేదు—సేవకులును, బరిచారికలు, తెలిసియో తెలియకయో చెప్పలేదు. వారికట్లాజ్ఞయైనది. జగత్సింహునకు, ముండ్లశయ్యపైఁ బరున్నట్లుండెను.

ఆతని రెండవయుద్దేశము భవితవ్యవిషయము—'ఏమి రానున్నదో'' ఈప్రశ్న కెవ్వరుత్తర మీయఁగలరు? ఆతఁడు కైదీగనున్నాఁడు. ఆయేషాస్వాములయనుగ్రహమునఁ జెరసాలలో నుండుటకు బదులాతఁడు చక్కఁగ నలంకరింపఁబడిన విశాలభవనముననున్నాఁడు. పరిచారికలును, సేవకులును వచ్చి యుపచారములు సేయుచున్నారు. అడుగుటయే తడవుగఁ బ్రతివస్తువును సిద్ధముగనుండెను. సహోదరికంటె నధిక జాగ్రత్తతో నయేషా కాపాడుచుండెను. అయినను ద్వారముకడ పర్వతమువలె రక్షకుఁడొకఁ డున్నాఁడు. రాజపుత్త్రుఁడు మధురపదార్థములఁ దినుచు బంగారు పంజరమున నున్నపక్షివలె నున్నాఁడు. ఆతనికిఁక స్వేచ్ఛ యెప్పుడు? స్వేచ్ఛతప్పకుండఁ గలుగునను నిశ్చయమేమికలదు? ఆతని సైన్యములెట నున్నవి ? సేనాధిపతినిగోల్పడి యా సైనికులేమిచేయుచున్నవారు?

మూఁడవయుద్దేశ మయేషావిషయము, మనోహారిణియైహృదయాకర్షణము గావించుచున్న యాసుందరియెవ్వరో? ఈసద్గుణమూర్తియాకృపావతార మెటనుండి యీప్రపంచమునకు దిగివచ్చెనో?

అయేషాకు విశ్రాంతి లేదు—ఆయాసము లేదు—అవిధేయత లేదు. ఇదియంతయు జగత్సింహుఁ డెఱుంగును. ఆమె నిరంతరము నాతనిని శ్రద్ధతోఁ జూచుచుండెను. ఆతని వ్యాధి కుదురునంతవఱకా మె ప్రతిదినమును బాలసూర్యునివలె నుదయమున నే పూగుత్తి చేతఁదాల్చి మందయానముతో వచ్చుచుండెడిది. స్నానభోజనసమయ మతిక్రమించినను నామె యచ్చట నేయుండుట నాతఁడు చూచుచుండెను. ఆవశ్యకరణీయములందీర్చి మరల నతిశీఘ్రముగ వచ్చుచుండెడిది. బీగము పరిచారికను బంపునంతవరకు నక్కడనేయుండి పరిచర్య సేయుచుండెడిది. వ్యాధిపీడితుఁడై మంచముపట్టనిమనుష్యుఁ డెవ్వఁడు? లావణ్యరాశియగు యువతియొక్కర్తు తలదిక్కునఁ గూర్చుండి మృదుహస్తములతో విసరుచు నుపచారములు సేయుభాగ్య మలవడెనేని వ్యాధి, యంత బాధాకరముకాదని, యాతఁడే చెప్పఁగలఁడు.

పాఠకమహాశయా! జగత్సింహుఁడెట్టిస్థితి యందుండెనో మనసుచేఁ జూచుకొన నీకభిలాషగలదా ? అయినసరియే. నేఁజెప్పినట్లొనర్పుము. నీశరీరమంతయు గాయములతో బాధనొందుచున్న దనుకొనుము. మంచముపై పడియుంటివని భావింపుము. శత్రువులనడుమ ఖైదీగానుంటివని తలంపుము నీవున్నది యమూల్యపదార్థాలంకృతమై చల్లనై సుగంధబంధురమగు విశాలభవనమనుకొనుము. నీదృష్టినొక్కమారా ద్వారమువంకఁ బ్రసరింపఁజేయుము. ఆకస్మికముగ నీకధిక సంతోషముగలిగి ముఖవికాసము కలుగును. అదిగో యా

వచ్చుచున్నవ్యక్తి శత్రుమధ్యమున నిన్నుసోదరునివలెఁ గాపాడును. ఆవ్యక్తి స్త్రీ. ఆమె స్త్రీమాత్రమేకాదు. యౌవనవతి. పూర్ణముగ వికసించిన పద్మమువంటిది. అట్టెపరుండియుండి నీవామెను నిశ్చలముగఁ జూచుచుండుము. ఆరూపమున సౌందర్యమెట్లు మూర్తీభవించెనో చూడుము. ఆయాకృతి యిప్పుడిప్పుడే కొంచెమున్నతమగుటకు నుంకించుచున్నది. పరిపూర్ణావయవానురూపత్వముగలది. సంపూర్ణదివ్యలక్షణ విశిష్టయగు దేవత. ప్రకృతి సోఁతవోసిచేసిన సుకృతరాజ్ఞి ఆమె గమన సౌందర్యమెట్లుండునో పరికింపుము నీవెప్పుడైన మదగజయానమును వినియుంటివా? అదేమి? హంసగమన మెట్లుండునో చెప్పఁగలవా? ఆయువతిగమనమునను, గుర్తించుకొనుము. మర్దళము సంగీతమున లఁయజూపును. అట్లే ఆమె పదగతులకు నీహృదయము లయఁజూపును. ఆమెహస్తమునఁ బూలగుత్తియున్నది. చూడుము! నిరవధికతేజోవిరాజితములగు నాహస్తములకడ నా కుసుమములెట్లు ప్రకాశహీనములయియున్నవో చూచితివా? ఆమెగళప్రకాశముకడ నాబంగారుగొలుసెట్లు వన్నెదఱిఁగియున్నదో చూచితివా? ఓహో! అదేమి? నీనేత్రములురెప్పపాటులను మఱచిపోయినవేమి? ఆమెమెడయొక్క సొగసు చూచినావా? చంద్రకాంతో పలసన్నిభంబగు నామె గళప్రదేశమున నావినీలకుటిల కుంతలము లెట్లుపడుచున్నవో చూచితివా? అదిగో, యామెకర్ణాలంకృతము లెంతమనోహరముగ నల్లలాడుచు మెఱయుచుండెనో కనఁగొంటివా? ఆమె శిరసు కొంచెము వంగియున్నది. గుర్తించితివా? కొంచెము

పొడవును తగ్గించుకొనుట కట్లుచేసినది. నీవు తదేకధ్యానము తోఁ జూచుచున్నా వెందులకు? నిన్నుగూర్చి యమేషా యేమనుకొనును?

అమేషా వ్యాధిపీడితుఁ డగుజగత్సింహునకుఁ దన సేవ యెంతకాల మవసరమో అంతకాలము నామె ప్రతిదినమును విడువకుండ నాతని యొద్ద నేయుండి యాతని కుపచారములు సేయుచుండెడిది. ఆతనివ్యాధి తగ్గుచున్నకొలఁదిని నామె రాకయుఁ దగ్గుచుండెను. అతఁడు పూర్ణారోగ్యమును బొంది నప్పు డామెరాక చాలయరుదైనది. ఎప్పుడో — ఒకమాఱు రెండుమాఱులు — ఆమె వచ్చినప్పుడెల్ల సాధారణముగా నస్మానునిగూడఁ దీసికొనివచ్చుచుండెను. శీతకాలమునఁ బొద్దెక్కినకొలఁదిని వణఁకుచున్న మనుష్యునకు దూరముగఁ దొలఁగిపోవు సూర్యకాంతివలెనే యారోగ్యము నొందుచున్న కొలఁదిని జగత్సింహునకు నమేషా దూరమగుచుండెను.

ఒకనాఁటి సాయంకాలమున జగత్సింహుఁడు కోట యావలిప్రదేశమును జూచుచు గవాక్షములోఁ గూర్చుండి యుండెను. ఆమార్గమున మనుష్యులు వ్యాపారములమీఁదనో, వినోదముకొఱకో, యటునిటు పోవుచుండిరి. వారియదృష్టము తో జగత్సింహుఁడు తనయదృష్టమునుఁ బోల్చుకొనియెను, చాలవిచారమునొందెను. ఒకప్రదేశమునఁ గొందఱు మనుష్యులు చుట్టువారియుండిరి. వారినడుమ నొకమనుష్యుఁడో, యేదయిననొక పదార్థమో యుండెను. రాజపుత్త్రునిదృష్టి యావైపునకేగెను. వారేదో వినోదము ననుభవించుచున్నా రని యాతఁడనుకొనియెను. వారేదో శ్రద్ధతో వినుచున్నా

రనికూడ గ్రహించెను. నడుమనున్నది వస్తువో, మనుష్యుడో, యెవ్వరో, యాతనికిఁ గనబడలేదు. అతఁడును గొంచెము వినోదమునొందెను. కొంతసేపటికిఁ జాలమంది చూపఱు లటనుండి వెడలిపోయిరి. ఆతని వేఁడుక తీరెను. ఆనడుమ పులివలెఁ దాటియాకులపుస్తకమును చదివి వినుపించుచున్నవాఁ డొక్కఁడుండెను. ఆచదువరి యాతని వినోదమును మఱింతయభివృద్ధిచేసెను. అతఁడు మనుష్యుఁడైనఁ గావచ్చును, లేదా, దేవతాగ్నివలన నాకులు దహింపఁబడియున్న మద్యప్రమాణ తాళవృక్షమైనఁ గావచ్చును. అతఁడంతపొడవు యంతవర్తులమును గలిగియుండెను. కాని తాళవృక్షము మాత్ర మెన్నటికిని తొండమువంటి యంతనాసికను మోయఁజాలదు. ఆతని యాకారమెట్లుండెనో నడవడియు నట్లేయుండెను. అతఁడు చదువుచు హస్తము, శిరసు ముక్కుపినితో చేయుచున్న యభినయములను జగత్సింహుఁడు వినోదముతోఁ బరికించుచుండెను. ఇంతలో నస్మాన్ ఖాన్ వచ్చెను. ఒకరికొకరు వందనములఁ జేసికొనిరి.

"తదేకధ్యానముతో గవాక్షమువంకఁ జూచుచున్నారేమి ?

"చెట్టు తునకవలె నేదో యిట నున్నది. నీవును జూడవచ్చును"

అస్మాన్ చూచియిట్లు చెప్పెను.

"ఇదివఱకు మీ రెప్పుడును నీతనిని జూడలేదా?"

"లేదు"

"ఇతఁడు మీ బ్రాహ్మణుఁడే. ఈతని సంభాషణ చాల వింపుగనుండును. నేనీతనిని గరమందరమునఁజూచితిని"

రాజపుత్త్రిన కాత్రిముజనియించెను. తనలో నిట్లనుకొనెను. "గరమందరమున నుండెనా? తిలోత్తమనుగూర్చి యేమయిన చెప్పగలఁడేమో?"

"ఆతని పేరేమి?" అని యాతఁడాత్రిముతో నడిగెను.

అస్మాక్ ఖాఁ కొంచెమాలోచించి యిట్లు చెప్పెను.

"ఆతని పేరు చెప్పుటకొంచెము కష్టము. అవి యంత త్వరలో జ్ఞప్తికిరాదు గజపత్ ? —కాదు—గణపతి? — గజపత్?—కాదు—గణపతి? ఇఁక నేమి?"

"గజపతి?—ఇది వంగదేశపునామముకాదు. అయినను నీతఁడిక్కడివాఁడేయని తోఁచుచున్నది."

"ఔనౌను ఇతఁడు వంగదేశస్థుఁడే. ఒక భట్టాచార్యుఁడు ఈతని కేదో బిరుదమున్నది. ఎలిమ్—ఎలిమ్— తరువాత నేమి?"

"కాదు—కాదు. వంగదేశపు బిరుదము లెప్పుడును "ఎలిమ్" అనియుండును. ఎలిమనఁగా వంగభాషలో విద్య యని యర్థము. విద్యాభూషణుఁడనియో, విద్యాజిగీషుడనియో యుండవచ్చును."

"ఔనౌను విద్యా—ఇంక నేదోయున్నది. ఉండుము —వంగభాషలో నేనుఁగు నేమని పిలిచెదరు."

"హస్తి"

"ఇంకను"

"కరి—దంతి—వారణ—నాగ—గజ—"

"ఆఁ! ఆఁ అదే యాతనిపేరు గజపతి విద్యాదిగ్గజుఁడు."

"విద్యాదిగ్గజుఁడా ? నేను వినినంతవరకెట్టి బిరుదమరుదు. పేరునకును బిరుదమునకును, సరిపోయినది. నాకాతనితో మాటలాడవలయునని యున్నది."

గజపతి సంభాషణమును నస్మార్ణ వినియుండెను. రాజపుత్రునితో మాటలాడినందువలన భయము లేదని తలంచెను.

"ఇందేమియు నుపద్రవము లేదు"

వారిరువురు నింకొక గదిలోనికేగిరి. సేవకునిచే గజపతిని బిలువనంపిరి.

---

## తొమ్మిదవ ప్రకరణము

### దిగ్గజుని వార్తలు

సేవకుఁడు గజపతిని లోపలకుఁ దీసికొనివచ్చెను. రాజపుత్త్రుఁడాతని నిట్లడిగెను.

"అయ్యా! నీవు బ్రాహ్మణుఁడవా?"

"యావన్మేరౌస్థితో దేవా, యావద్గంగా మహీతలే, అసారేఖలు సంసారే సారం శ్వశురమందిరమ్"

జగత్సింహుఁడు వచ్చుచున్న నవ్వు నణంచుకొని యాతనికి వందనము చేసెను.

"బాబూ! * ఖోదాఖాఁ నిన్ను రక్షించుఁగాక!"

"నేను మహమ్మదీయుఁడను గాను. హిందువుఁడను"

"ఈతడు మోసగాఁడు. తప్పక యవనుఁడే. నన్ను మోసముచేయ యత్నించుచున్నాఁడు. ఇందులకీతనికేదో యుద్దేశముండి యుండును. లేనిచో నన్నెందులకు లోపలికిఁ బిలిపించును?" విచారముతో "ఓఘనతగల ♦ ఖాన్ బాబూ! నేను నిన్నెఱుంగుదును. నేను మీాయన్నమేతిని బ్రతుకు చున్నాఁడను. నన్నవమానింపకుము. నేను మీా సేవకాను సేవ కుఁడను."

జగత్సింగాతని చిక్కును గ్రహించి యిట్లనియెను.

"నీవు బ్రాహ్మణుఁడవు. నేను రాజపుత్త్రుఁడను. నీవు నాయెడ నుపయోగించు భాష యుక్తమైనది కాదు. నీ పేరు గజపతి విద్యాదిగ్గజుఁడా?"

దిగ్గజుఁడు తనలో నిట్లు యోచించుకొనెను. "హో! ఇదినో! ఇతడు నా పేరునుగూడ నడుగుచున్నవాఁడు. నాకీతఁ డేమికష్టమును దెచ్చి పెట్టనున్నాఁడో! భగవంతునికే యెఱుక" "సాహేబుగారూ! నాపైదయఁజూపుఁడు; (చేతులు జోడించి) నేనొక బీదబాపఁడను. మోకరించి వేడుకొనుచు న్నాఁడను! నాపైదయయుంచుఁడు" అనియెను.

---

* ఖోదా = దేవుఁడు; ఖా = బిరుదు. దేవునకు బిరుదుండదు. ఇతనిది వచ్చియురాని హిందూస్థానిభాష. అందుచే నిట్లనియెను. పాఠకులారా! విద్యాదిగ్గజుని తప్పు పట్టకుఁడు.

♦ ఇదియును తప్పుమాటయె విద్యాదిగ్గజుని యంతవాఁడిట్లన్నాఁడు.

జగత్సింహుఁడు బ్రాహ్మణుని యపరిమితభయమును గాంచెను. తనకార్యము నాతనివలనఁ దెలిసికొనుట యసాధ్యమని తలంచెను. అందుచే నాపరిసంగమును మార్పుచేయవలయునను నుద్దేశముతో నిట్లనియెను.

"నీచేతనున్న పుస్తకమేమి?"

"మణిక్పుర చరిత్రము——"

"నీవు బ్రాహ్మణుఁడవు. మణిక్పురచారిత్రము నేల మోయుచున్నాఁడవు"

"హెమ్. హెమ్. నేనొకప్పుడు బ్రాహ్మణుఁడనే కాని యిప్పుడు కాను"

జగత్సింహున కాశ్చర్యమును విసుగును జనియించెను.

"ఏమంటివి? నీవు గరమందరమున లేవా?"

దిగ్గజుఁ డిట్లు యోచించుకొనియెను. మరణము——దండన——నేను వీరేంద్రసింహుని దుర్గమున నుంటిననికూడ నీతఁడెఱుంగును. వీరేంద్రుని జేసినట్లే నన్నును జేయుదురు. బ్రాహ్మణుని నేత్రములవెంట బాష్పములు ప్రవహింప నారంభించెను. "ఖాఁ ప్రభూ! అనుగ్రహింపుము. ఏడ్చుచు (శక్తికొలది చేతులు నలుపుచు) నేను ప్రార్థించుచున్నాడను. నేను నీ సేవకుడను. నన్ననుగ్రహింపుము"

"నీకు: మతియున్నదా?"

"చిత్తము. మహాప్రభూ! ఉన్నది. నేను నీసేవకుడను, నీవాఁడను"

"నీకు భయములేదు. నీపుస్తకమున గొంతభాగము నాకు జదివి వినిపింపుము."

బ్రాహ్మణుడు పుస్తకములోనిపద్యభాగము నీడ్చుచుఁ జదువుచుండెను. ఆతనినేత్రము లింకను బాష్పావృతము లయ్యేయున్నవి. ఆతని కంఠధ్వని యప్పుడేడ్చుచు జదువు చున్నట్లుండెను. నాటకశాలయందుపాధ్యాయుడు బాలకుని చెవిపట్టుకొని నులివేయుచు బాదించినట్లుండెను.

కొంత సేపు చదివిన పిమ్మట రాజపుత్రి డిట్లడిగెను.

"నీవు బ్రాహ్మణుడవైయుండియు మణికుప్పర చారిత్రము నేలచదువుచుంటివి?"

"నేను మహమ్మదీయులలో గలిసిపోయితిని"

"అదెట్లు?"

మహమ్మదీయబాబులు కోటలో బ్రవేశించినప్పుడు వారు నాతోనిట్లనిరి. "బ్రాహ్మణుడా! రమ్ము, కులభ్రష్టుడవుకమ్ము" పిమ్మట వారు నన్నీడ్చుకొనిపోయి కోడిపలో (పులావు)ను దినుమని నిర్బంధించిరి"

"పలోయననేమి?"

"స్వచ్ఛమయిన పాలలో నుడికిని యాతపబియ్యము"

ఆతని యభిప్రాయమును రాజపుత్రికడు గ్రహించెను.

"తరువాత"

"వారు నాచే కల్మె చదివించిరి."

"కల్మాయా? తరువాత"

"వారు నాతో నీవు మహమ్మదీయుడవైతివి" అని చెప్పిరి. అప్పటినుండియు నేను మహమ్మదీయుడను"

"కోటలోని తక్కినవారో!"

"తక్కిన బ్రాహ్మణుల నందఱను నావలెనే చేసిరి"

రాజపుత్రుడస్మాన్ ముఖముపై దృష్టిసారించెను. లోపల నణగియున్న యాతని యాగ్రహము నస్మాన్ గ్రహించి యిట్లుచెప్పెను.

"రాజచంద్రా! ఇందుపద్రవమేమున్నది! మహమ్మదీయమత మొక్కటియే నిజమయినదని మేము నమ్మినారము. ఏమార్గముచేనైన నామతమును వ్యాపింపజేయుట పుణ్యమే కాని పాపముకాదని తలంచితిమి."

జగత్సింహుఁడాతని కేమియుఁ బ్రత్యుత్తర మీయ లేదు.

"విద్యాదిగ్గజా!"

"నన్ను సాహేబుదిగ్గజా ! అని యనుగ్రహింపుడు."

"అట్లే. సాహేబుజీ! కోటలోనుండెడి తదితరులను నీ వేమైన నెఱుఁగుదువా?"

జగత్సింహుని యభిప్రాయమును గ్రహింపవలయునని యస్మాన్ ఖానాత్రము జెందుచుండెను.

"అభిరామస్వామి పాఱిపోయినాఁడు"

అతని కేదైన దెలిసియున్నచో నింక స్పష్టముగఁ జెప్పునని జగత్సింహుఁ డనుకొని యిట్లడిగెను.

"వీరేంద్రసింహుడో"

"నబాబాతని శిరచ్ఛేదము చేసినాఁడు"

జగత్సింహునిముఖ మెఱ్ఱవారెను. ఆస్మానుతో నిట్లని యెను.

"ఆతఁ డేమిచెప్పినాఁడు? బ్రాహ్మణుఁ డసత్యము చెప్పెనా?"

"వీరేంద్రసింహుని విచారణచేసి రాజద్రోహి యని స్థిరపఱచి వధించినారు."

రాజపుత్త్రుఁడు నేత్రములగ్ని గురియుచుండ నిట్లనియెను.

"నేను నినొక్కమాట యడుగవలసియున్నది. అపని నీసమ్మతముమీఁదనే జరిగినదా?"

"లేదు. నాయాలోచనకుఁ బ్రతికూలముగ జరిగినది."

రాజపుత్త్రుఁ డేదియో యాలోచించుచుండెను. ఆసమయమున నస్మాను దిగ్గజునితో "నీవుపోవచ్చును" అనియెను. ఆతఁడు వెడలిపోనుండెను. జగత్సింగాతని చేయిపట్టుకొని యాపి యిట్లనియెను.

"ఇఁకనొక్కమాట, విమలయెటనున్నది?"

బ్రాహ్మణుఁడు నిట్టూర్పు విడిచెను. కొంచెమేడ్పు కూడవచ్చెను.

"విమల యిప్పుడు నబాబుగారి యుంపుడుకత్తెగా నున్నది."

రాజపుత్త్రుఁడు మరల నస్మాను వంకజూచి యిట్లనెను.

"ఇదియు నిజమేనా?"

ఆస్మానాతనికిఁ బ్రత్యుత్తరమీయక దిగ్గజునితో "నీ వింకను నెందులకున్నావు? పొమ్ము" అనియెను.

జగత్సింహుఁడు బ్రాహ్మణుని హస్తములను బట్టుకొనెను. ఆతఁడు చేయిని విడిపించుకొనలేకపోయెను. అట్టె నిలువబడియెను.

"ఇఁక నొకనిమిషమాఁగుము. అయిపోయినది. ఒక్కమాట ఇఁక నొక్కమాట! తిలోత్తమ?"

తిలోత్తమకూడ నిప్పుడు నవాబుగారి యుంపుడుకత్తెయే. వారిరువురు నిప్పుడు మహాభోగముల నందుచు నెమ్మదిగనున్నారు."

రాజపుత్త్రుఁడాతని హస్తమునుదోసిపుచ్చెను. ఆతడు మడమలమీఁద నడచుచు నదృశ్యమైపోయెను.

అస్మాన్‌ఖాన్ సిగ్గుపడియెను. మెల్లగ నిట్లనియెను.

"నేను కేవలముద్యోగస్థుఁడనే."

"నీవు రాక్షసోద్యోగస్థుఁడవు."

---

## పదియవ ప్రకరణము

---

### మాధురీ విగ్రహమా! తొలగిపొమ్ము

జగత్సింహునకు రాత్రి కంటిపై తెప్పపాటు లేదని వేఱుగఁ జెప్పఁబనిలేదు. ఆతని శయ్యపై నపరిమితముగఁ దేళ్ళు, జెఱ్ఱులు పాఁకుచున్నట్లుండెను. పరితాపాగ్నిచే హృదయము దహింపబడుచుండెను. ఏతిలోత్తమ మరణించెనేని నిఁక నీలోకమున తాను మనియుండుట దుస్సహమని

యదివఱకును దలంచెనో యాతిలోత్తమ యింకను జీవించి యుండుటయే జగత్సింహునకు విచారకారణమయ్యెను.

అదియెట్లు? తిలోత్తమ యింకను జీవించియున్నది. అట్టి మృదుకుసుమమును, అట్టి దివ్యమాధుర్యమును, అట్టి స్నిగ్ధప్రకాశమును జగత్సింహుని వీక్షణ మెటుదిరిగిన నట దర్శనమొసంగెడునట్టి సుకుమారగాత్రమును, అట్టికోమలతను వల్లిని అట్టి తేజోనిధిని, మృత్యుదేవత తన కడుపునఁ బెట్టు కొనఁగలదా? ఈభూమి—ఈవిశాలమహీతలము—ఆకోమల గాత్రచిహ్నములనైనఁ గలిగియుండదా? ఎంతవిచారకరమైన విషయము? ఎంతదుస్సహమైన సమయము! జగత్సింహుని నేత్రములనుండి యందుగువృక్షములనుండి పాలుస్రవించు నట్లు బాష్పములు స్రవించుచుండెను. తత్క్షణమెనరకసదృశ మగు కటుల్ ఖానుని భోగభవన మాతనిహృదయమున కెట్ట యెదుట గన్పట్టెను. ఆశిరీషపుష్ప మాదుష్టాత్మునిపక్క నుండజూచెను. ఆతని హృదయ మగ్నిపర్వతమువలె మండు చుండెను.

ఏలావణ్యరాశియొక్క రూపమాతని హృదయాంత రాళమున ప్రతిష్ఠితమై ప్రకాశించుచుండెనో యట్టితిలోత్తమ యిప్పుడు పఠానులయంతఃపురవాసిని యయ్యెఁగదా! ఆహా!

రాజపుత్త్రునకట్టి రూపమునం దనురాగముండునా క్షత్రియ కులాలంకారమగు నాపౌరుషశాలి తనహృదయము నుండి యట్టి విగ్రహమును జించిపార వేయుట కిసుమంతమైన సంశయించునా?

ఆవిగ్రహము జగత్సింహుని హృదయ క్షేత్రమున బాగుగా వేళ్ళుపారియున్నది. వేళ్ళతోఁ బెఱికి పాఱవేయ వలయునన్న హృదయముకూడ పెల్లగిలిపోవలయునుగదా! అట్టిమనోహరరూపమును శాశ్వతముగ నెట్లు వెడలఁగొట్టి వేయఁగలడు! అది యాతనికి సాధ్యమగునా? కలతఁ జెందిన యాతని హృదయమున జ్ఞాపకశక్తికలిగియున్నంతవఱకు రక్త మాంసములు శరీరము నాశ్రయించియున్నంతవఱ కారూప మాతని హృదయాత్మలపైఁ బ్రభుత్వము నెఱపుచునే యుండును.

ఇఁక మనశ్శాంతినిగూర్చి చెప్పనవసరములేదు. కలత జెందిన యీయాలోచనములవ నాతనికి వివేచనాశక్తి లేకుండబోయెను. జ్ఞాపకశక్తి క్షీణింప నారంభించెను. తెల్ల వారుసమయ మయినది. శిరసును చేతిలోనుంచుకొని కూ ర్చుండియుండెను. బుద్ధియూఁగులాడుచుండెను. ఆలోచనా శక్తియంతయు నశించిపోయెను.

ఆతఁ డట్లే చాలసేపుగూర్చుండియుండుటచే శరీరము నొప్పియెత్తెను. విస్తారమగు మనోవేదనచే నాతనికి జ్వరము వచ్చినట్లుండెను. ఆతఁడు గవాక్షముకడకేగెను.

అతని లలాటమునకు చల్లని మలయానిలము సోకెను. చుట్టును నంధకారము. ఆకసమున సన్నని మేఘమువ్యాపించి యుండెను. నక్షత్రములస్పష్టముగ నుండెను అక్కడక్కడ శాంతిప్రకాశనక్షత్రములు వేగముగ సంచరించుచున్నపయో ధరములమాటుననుండి మినుకు మినుకు మనుచుండెను. కొం

చెముదూరమున వృక్షము లొండొంటితోఁ గలిసి యాకస మున నంధకారబంధురగు భిత్తికవలె నొప్పుచుండెను. వృక్ష ముల నాశ్రయించి మెఱయుచున్న మిణుఁగురుపురువులు వజ్రములభాతి ప్రకాశించుచుండెను. ఎదుటనున్న సరోవర మున గగనముయొక్కయు ధరణీజములయొక్కయు ఛాయ లస్పష్టముగఁ గన్పట్టుచుండెను.

ఆరాత్రి వారిధరములకనుండి శీతలత్వము, నపహ రించిన మందమలయానిలుం డాతనిశరీరోష్ణతను గొంతవఱకుఁ జల్లార్చెను. జగత్సింహుఁడు గవాక్షముకడ శిరస్సుపైఁజేయి వైచుకొని నిలువఁబడియుండెను. ఎడతెగని మనోవ్యాకుల త్వమువలనను నిద్రలేమిచేతను నాతఁడు చాలనలసిపోయెను. మలయానిలస్పర్శమున నాతఁ డొక్కింత శాంతమునొందెను. ఆలోచనలను వదలివైచెను. ఉద్దేశము లొక్కింత మార్పు జెందెను. ఇంతవఱకు నాతనిహృదయము నిశితమగు కటారిచే గాయపఱుపఁబడుచుండెను. ఇప్పుడది వోయినది. దానికిబదు లుగ సిరాసయనుకటారినొప్పియె త్తించుచుండెను. కానియీ బాధ మునుపటికంటే కొంచెము తక్కువయినది. ఆశ విడిచి పెట్టుటయే బాధగనుండెను నిరాశ యొక్క మాఱు హృదయ మున స్థిరపడెనేని బాధయంత యధికముగ నుండదు. దెబ్బ తగిలినప్పుడే బాధయధికము. గాయము చాలకాలముండునది యైనను నంతకష్టముగా నుండనేరదు. ఆతఁడు నిరాశచే మాత్రమే కొంచెము బాధపడుచుండెను. నక్షత్రవిహీనమై యంధకారబంధురమైన యాకసమువంక వీక్షించెను. పిదప

బాష్పావృతలోచనుండై నక్షత్రవిహీనమైన యంధకారబంధురమైన తనహృదయాకాశమునుజూచెను. ఆతనికిజ్ఞాపకశక్తి క్రమక్రమముగ మెల్లగ మరల రాదొడఁగెను. ఆతనిబాల్యము, యౌవనమునందలిసంతోషము అన్నియునతనిహృదయమునకు గోచరమయ్యెను. ఆతఁడాలోచనలో మునిఁగి క్రమక్రమముగ నవశుఁడైపోయెను. శరీరము చల్లపడియెను. ఆయాసముచే నింద్రియజ్ఞానము క్రమక్రమముగ దగ్గిపోయెను. గవాక్షమును బట్టుకొని యాతఁడు నిద్రపోయెను.

నిద్రలో నాతఁడొక స్వప్నముం గనియెను. అదిచాల బాధాకరమైనది. మిక్కిలి కలవరమును గలుగఁజేయునది నిద్రలోనే యతని కధికాగ్రహము కలిగెను. ఆతఁడత్యంత వేదన నొందుచున్నట్లు ముఖముసూచించుచుండెను. పెదవులు కంపించుచుండెను, లలాటమున స్వేద ముదయించెను. పిడికిళ్ళు దృఢముగ ముడుచుకుపోయినవి.

ఆతఁ డులికిపడి లేచెను. తొందరతో నడువ నారంభించెను. ఆతఁడెక్లెంతగా బాధపడుచుండెనో వ్రాయుటకు నాకుఁ జాలగష్టముగ నున్నది.

ఉదయసూర్యకిరణములచే నాగదిగోడలు ప్రకాశించుచున్నవి. తుదకు జగత్సింగు భూమిపైఁబడినిద్రపోవుచుండెను. శయ్యలేదు. తలగడలేదు.

అస్మానుఖానువచ్చి యతనిని లేపెను. వందనమొనర్చి యుత్తరమొకటి రాజపుత్రునకిచ్చెను. ఆతఁ డదియేమియు ననకుండఁగైకొని యస్మాను వంక వీక్షించెను. రాజపుత్రుని

హృదయము పరిభ్రమించుచున్న దనియు నిప్పుడేవిషయ మును మాటలాడ నదనుగాదనియుఁదలఁచి యస్మానిట్లనియెను "రాజోత్తమా! నీవిట్లు క్రిందపరుంటివేమని నేనాశ్చర్య బడను ఈయుత్తరమును నీకందఁజేసెదనని వ్రాసినవారితో వాగ్దత్త మొనర్చియుంటిని. ఇఁక దీనిని దాఁపఁబనిలేదు. ఇంతవరకును నేకారణముచే నీకు దీనిని నేనీయలేదో యది యంతయుఁ నీకుఁ దెలిసిపోయినది. అందుచే నీయుత్తరమును నీకడవిడిచిపైచెదను. నావకాశము గలిగినప్పుడు చదువుము. నేను మరల సాయంకాలమువచ్చెదను. ప్రత్యుత్తరముఁవ్రాయ నిచ్ఛకలదేని వారికది పంపెదను."

ఇట్లుచెప్పుచు నుత్తరము నాతనికిచ్చి యస్మాక్ వెడలి పోయెను. రాజపుత్త్రినిహృదయము మరలయథాస్థితికివచ్చెను ఒంటరిపాటున నాతఁ డాయుత్తరమును మొదటినుండి తుద వఱకుఁ జదివెను. అగ్నిజేసి ఉత్తరము నందు వైచెను. అది మండుచున్నంతసేపును నాతఁడు దానివంకఁ జూచుచుండెను. పూర్ణముగ దహింపఁబడినది. రాజు తనలో నిట్లను కొనెను.

జ్ఞాపకశక్తినిగలిగించు నీయుత్తరమును జ్వాలలకర్పించి కృతార్థుడనైతిని. పరితాపాగ్నిచే జ్ఞాపకశక్తికూడ దహింపఁ బడును. కాని, యది దీనివలె భస్మమైపోదేమి చెప్పుమా!

పిదప నాతఁడు ప్రాతఃకాలోచితకృత్యములనిర్వర్తించి భగవత్ప్రార్థనముఁ జేసెను. వినయపూర్వకముగ వందన మొనర్చి చేతులు జోడించి పైకిదృష్టిసారించి యిట్లనియెను.

"భగవానుఁడా! తండ్రీ! నీసేవకుని బరిత్యజింపకుము. నేను రసపుత్త్రవీరున కనుగుణముగ వర్తించెదను. నేను నీయను గ్రహమునుమాత్రమే వేఁడుచున్నాఁడను. జాతివిహీనుఁడగు నానీచునియుంపుడుకత్తెను నాహృదయమునుండి త్రోసివైచెదను. ఈప్రయత్నమునఁ బ్రాణమును గోలుపోయితినేని నిన్ను లోకాంతరమున సేవించెదను. మనుష్యుఁడు చేయదగినయంతయుఁ జేసితిని, ఇంకను చేసెదను. ఓసర్వహృదయపరిశీలకా! నాయాత్మాంతరాంతరాళమును బరిశీలింపుము. ఇంకను దిలోత్తమకొఱకుఁ బరితపించెద నేమో చూడుము. ఇంకను నామె సందర్శనాభిలాష కలదేమో పరికింపుము. స్మృతిమాత్రము నిర్దయాత్మకమైనది. అది యింకను నన్ననవరతము బాధించుచు నేయున్నది. నామనోరథమును విసర్జించివైచినాఁడను. ఈజ్ఞప్తి నెప్పటికి రాకుండ ద్రోసివేయఁజాలనా? తండ్రీ! నాపైదయఁజూపుము. లేనిచోఁ గ్రూరతమమగు నాస్మృతి నన్ను పేరు లేకుండఁ గడతేర్చివేయును."

ఆతనిహృదయమునుండి యాయాకారమదృశ్యమయ్యెను. తిలోత్తమా! పాపము నీవుబాలికవు. నేలపైఁబడియుండి నీవేమి తలపోయుచున్నావు? దేని వెలుఁగును నమ్ముకొని నీవీ విషదంధకారమునుండి వెలువడ నత్యాతురముతో నిరీక్షించుచుంటివో యానక్షత్రమింక నీకుఁ బ్రకాశమొసఁగదు. దేని నూతకోలగ నమ్ముకొని యీమహాకల్లోలవిషదంబుధినుండి ప్రాణము నుద్ధరించుకొనఁదలచితివో యాపలక నీచేతినుండి

జారిపోయినది. దేవ నిడి నీమనోరథములనెల్ల నీవిపత్సముద్ర మునుండి గట్టెక్కించుకొన దలచితివో యీనావ యడుగంటినది.

---

## పదునొకండవ ప్రకరణము



### స్థలము మార్పుట

చెప్పినప్రకార మస్మాన్ఖాన్ సాయంకాలమువచ్చి యిట్లనియెను.

“రాజకుమారా! ప్రత్యుత్తరములిచ్చెదవా?”

రాజపుత్త్రుఁ డుత్తరమునువ్రాసియుంచెను. అదియా తనిచేతికిచ్చెను. అస్మాన్ఖాను దానిని గైకొనియిట్లుచెప్పెను.

“ఈకోటలో నివసించువారెవ్వరైన మఱియొకరికుత్తరమంపునెడల మొదట నందు వ్రాసినయంశము మాకు సమ్మతముగనుండినగాని పంపుట కంగీకరింపవలనుపడదు. ఇట్లన్నందులకు మన్నింపుము.”

జగత్సింహుడు విచారముతో నిట్లనియెను.

“ఆవిషయమును నాతోఁజెప్పనేల? నీవుచదివి యిష్టముండెనేని పంపుము”

అస్మానుత్తరమును విప్పి యిట్లు చదివెను.

“దురదృష్టవంతురాలా! నీవిన్నపమును మఱపుఁజెందను. కాని, నీకు నాథునియందు నిశ్చయముగఁ బ్రేమకలదేని

నీవాతనితోఁగూడ బోవలసినది. తన్మూలమున నీపేరునకు సంభవించిన కళంకము నశించిపోఁగలదు.

జగత్సింహుఁడు.”

ఉత్తరము చదివినపిమ్మట నతఁడిట్లనియెను.

“రాజోత్తమా! నీవు చాలక్రూరుఁడవు”

“పఠానులకంటె నధికక్రూరుఁడనుగాను.

అస్మాన్ మొగమెఱ్ఱవడియెను. కొంచెము కఠినభావముతో నిట్లనియెను.

“మొత్తముమీఁద పఠానులు నీవిషయమున నంతనీచముగఁ బ్రవర్తింపకపోయి యుండవచ్చును.”

జగత్సింహునకు లజ్జాక్రోధము లినుమడించెను. “నా విషయమై నేను చెప్పలేదు. నీవు నన్నుఁ జాలదయతోఁ జూచుచున్నాఁవు. అది నిశ్చయము. నీవునన్ను చెఱపట్టినను నాప్రాణములను గాపాడితివి. నీసైనికులను నాశనముసేయుచుండిన నన్నీకఠినవ్యాధినుండి యారోగ్యమునొసంగి కాపాడితివి. సంకెలతోఁ గారాగృహమున నుండుటకు బదులుగ, నలంకరింపబడిన దివ్యభవనమునం దుండుటయు నీయనుగ్రహవశమున నే. పాపము! ఇంతకంటె నీవేమిచేయఁగలవు? కాని, నేజెప్పునదేమియన—నన్ను నీకు ఋణస్థునిగ నొనర్చితివి. సౌఖ్యమొసంగుచుంటివి. కాని, ఈసౌఖ్యముయొక్క యుద్దేశమేదియో నాకు తెలియకున్నది. నేను కైదీనైనచోఁ జెరసాలకంపుము. కృపయనెడి యీవలనుండి నన్ను విడిపిం

పుము. ఖైదీగానిచో నీబంగారు పంజరమున నన్నుంచిన లాభ మేమి?"

"చెడుగున కంతతొందరపడెద వేల? చెడుగునురమ్మని యాశ్రయింపనక్కర లేదు. దానంతట నదియే వచ్చును"

"రాజపుత్త్రిలు సుకుమార పుష్పశయ్యనుండి తరలి జాతి నేలఁబరుండుట దురదృష్టముగా భావింపరు?"

"దురదృష్ట మొక్క జాతిశయ్యకంటె నధిక బాధాకరము గానేరదేని దానినిగూర్చి యంతగా విచారింపఁబని లేదు"

రాజపుత్త్రిఁ డాస్వామునివంకఁ దీవ్రముగఁజూచెను.

"కటుల్‌ఖానుని నేను శిక్షింపలేకపోయినప్పుడు నాకు తలవరియొక్క ఖడ్గమయినను నంత బాధాకరము కాదు"

"జాగ్రత్త! జాగ్రత్త! పఠానులు వదరుబోతులుకారు"

జగత్సింహుఁడు తిరస్కార పూర్వకముగ నవ్వుచు "సేనాధిపతీ! నీవు నన్ను బెదరించెదవా? అందెన్నటికిని నీకు జయ మొనఁగూడదు" అనియెను.

"మనమిరువురము నొకరినొకర మెఱుగుదుము. ఇఁక వాగ్వ్యయముతోఁ బనియేమి? నేను నీతో నొకపనియుండి వచ్చితిని"

రాజపుత్త్రిఁ డాశ్చర్యపడి

"ఏమిపని చెప్పుము" అనియెను.

"నేను కటుల్‌ఖానుని యాజ్ఞానుసరణి మాటలాడు చున్నాఁడను. సహింపుము."

"మంచిది"

"పఠానులును రాజపుత్త్రిలును బోరాడుచుండుట యిరువురకును హానికరమే"

"పఠానులను వేళ్ళతోఁగూడ బెఱికి పాఱవేయవల యునని మాయాశయము"

"నిజమే కాని, మమ్ములను నాశనము చేయునప్పటికి మీరుగూడ నాశనము కావలసియుండునుగదా! ఆలోచింపుము. గరమందరమును జయించినవారు కేవలము బలహీను లేకదా! అది నీవెఱుంగుదువు"

జగత్సింహుని పెదవులపైఁ గొంచెము హాసముద యింప "వారి నైపుణ్యమును నేనంగీకరింతును" అనియెను.

"నాయభిప్రాయమాత్మశ్లాఘనముకాదు. పఠానులు చక్రివర్తిపైఁ గత్తిపట్టిపోరాడుచు నొరిస్సాలో నివసించుట దుర్ఘటమే. కాని, చక్రవర్తిమాత్రము వారల నెన్నఁడును లోఁబరచుకొనఁజాలఁడు. జాతీయాభిమానముతో మమ్ము నిందింపకుము. రాజకీయ విషయముల నీవును ప్రవీణుఁడవు. ఢిల్లీకిని నొరిస్సాకును నెంతదూరముండెనో యోచింపుము. మానసింహుని మూలముగ పఠానుల నాతనికి వశ్యులుగఁ జేసికొనుట చక్రివర్తికి సులభమే యనుకొమ్ము. కాని యొరిస్సాలో వారి ధ్వజమెంతకాలము నిలువఁగలదు? ఆతఁడు వెనుకకు మరలినతోడనే యొరిస్సాలోని చక్రివర్తి స్వాస్థ్యములన్నియు పఠానులు మరల స్వాధీనము చేసికొనఁగలరు. అక్బరింతకుపూర్వమీ దేశమును జయింపలేదా? పఠానులెంత

కాలము కప్పమును జెల్లించిరి? మరల నిప్పుడాతఁ డొరిస్సాను జయించెనేని ఫలితముకూడ మరల నట్లేయుండును. ఇఁక నొకపర్యాయమాతఁడు సైన్యముల నంపవచ్చును. రాష్ట్రి మును జయింపవచ్చును. కాని పఠానులు యథాప్రికారము మరల స్వతంత్రులు కాగలరు. పఠానులు వంగదేశీయులు కారు. అదిమాత్రిముజ్ఞప్తియందుంచుకొనుము. వారెప్పుడును నెవ్వరికిని మోకరించువారుకారు. తుదకొక్కపఠానుని దేహమున నూపిరియున్నను నొరిస్సా చక్రివర్తి స్వాధీనముకాదు. కాదు నిశ్చయము. అట్టియెడ పఠానులయొక్కయు, రాజపుత్రులయొక్కయు, రక్తముతో నీభూమిని తడుపుటవలన నగులాభమేమి?''

''అయిన నీయభిప్రాయమేమి?''

''నాయుద్దేశ మేమియులేదు. కాని యుద్ధమును విడిచి సంధిచేసికొనవలయునని మాప్రిభువుగారి యుద్దేశము''

''ఏవిధమయినసంధి?''

ఆవిషయమున మన మిరువురము నాలోచింతము వంగదేశములో కటుల్‌ఖానుని యాధీనమందున్న ప్రదేశములను విడిచిపెట్ట సిద్ధముగానున్నాఁడు. అక్బరును, ఒరిస్సాపైఁగల యధికారములను విడుచునట్లుచేయుము. ఒరిస్సానుండి యాతనిసైన్యములఁ దీసికొనిపోవలయు, రణసంబంధమేమియు గలుగకుండఁ జేయవలయు. ఈయొడంబడికవలన నాతనికి రవంతయైన నష్టములేదు. పఠానులకే నిశ్చయముగ కొంత నష్టముకలదు. మాప్రియత్నములవలన సంపాదించిన రాష్ట్రి

మును మేము వీడిపోవుచున్నాము. చక్రవర్తికట్టిదేమియు లేదు. ఏది యతనికాదో యట్టిమొరిస్సానుండి మాత్రమే వెడలిపోవుచున్నాఁడు."

"ఇదిబాగుగనేయున్నది. కాని, ఈవిషయమునాతో నేల ప్రసంగించెదవు? రణముచేసినను, సంధిచేసినను మహారాజు మానసింహుఁడు చేయవలయును. కావున నాయన కడకు రాయబారిని పంపుఁడు."

"మే మట్లొనర్చితిమి, కాని, మా దురదృష్టవశమున నెవఁడో మేము మీప్రాణములఁ గైకొంటిమని యాతనికిఁ దెలియఁబఱచినాఁడు. అందుచే నాతఁడు విచారాగ్రహములతోనుండి సంధియొనర్చుటకు సమ్మతింపలేదు. మారాయబారి యెంతనమ్మించినను నాతఁడు నమ్మలేదు. నీవు సమక్షమున నీపద్ధతుల నాతనికిఁ దెలిపితివేని తప్పకయంగీకరించును'

రాజపుత్త్రిఁ డస్మాన్ ముగముపై దృష్టి నిలిపి యిట్లనియె.

"నిష్కపటముగమాటలాడుము. నాహస్తలిఖితమును మహారాజు నమ్మవచ్చును. ఉత్తరము వ్రాసిన జాలదా? నన్నే వెళ్ళుమనెద వెందులకు?"

"విషయ మిది. మహారాజు మాబలమును బాగుగ నెఱుఁగఁడు. అందునుగూర్చి మీరాయనకు నచ్చజెప్పుటకుఁ దగినవారఁట. మీరుమధ్యవర్తిగానుండిరేని కార్యముచక్కఁబడునని మాయాశ. ఉత్తర మంతపనిచేయఁజాలదు. ఇంతేగాక మిమ్ములను విడిచిపెట్టుటయే సంధికి మొదటికారణము.

అందుచే నీసంధికి మీరు యత్నము చేయవలయునని నవాబు గారి యుద్దేశము."

"మాతండ్రిగారి కడ కేగుటకు నాకభ్యంతరములేదు."

"అందులకు నేను చాలసంతసించితిని. కానినాదొక్క మనవియున్నది. మేమనినట్లు సంధి కుదరదేని మీరుమరల మాకోటలోనికి వచ్చెదమని వాగ్దత్త మొనర్పవలయు."

"వాగ్దత్త మొనర్చినంతమాత్రమున నేను మరలవచ్చెదనని మీకు నమ్మకమెట్లు?"

"మాకు నమ్మకమున్నది (చిరునగవుతో) రాజపుత్రులసత్యమాడరను విషయ మందఱెఱింగినదయే"

"మంచిది. నాతండ్రినిజూచిన వెంటనే నేనొక్కఁడను మరల గోటలోనికి వచ్చెదను."

"ఇంక నొకవాగ్దత్త మొనర్పవలయు. దానితో మాకుఁ గావలసినవన్నియుఁ బరిపూర్తియగును. మహారాజును చూడనేగినప్పుడు మేము చెప్పినపద్ధతులను నీవాయనతో విన్నవింపవలయు."

"అస్మాక్! ఈవాగ్దత్తమునుమాత్రము నేనొనర్పఁ జాలను. పఠానులను జయించుటకే చక్రవర్తినన్ను నియమించినాఁడు. వారితో రణమొనర్చి వారిని వశ్యులను గావించుటయే నాపని. ఆతఁడు సంధికార్యములఁ జక్కబెట్టనన్ను నియమింపలేదు. అందుచే మేమెప్పుడును నట్టికార్యములను చేయుఁబోము. అట్టివిషయములను ప్రస్తావింపను."

అస్మాన్ ముఖమున నసంతృప్తియు విచారమునుగన్ప ట్టెను.

"రాజపుత్త్రిలకుఁ దగిన ప్రత్యుత్తరమిచ్చితివి. కాని, యీకార్యము చక్కబెట్టుకున్న నీకు స్వేచ్ఛలేదని తలంచుకొనుము."

"చక్రవర్తికిని నాస్వేచ్ఛకునుసంబంధమేమి? నావంటి రాజపుత్త్రిలాతనికిఁ జాలమందికలరు."

అస్మాన్ విచారకరమైన యాతిమితో నిట్లనియెను.

"నాయాలోచనను గ్రహింపుము. నీ ప్రస్తుతోద్దేశము బరిత్యజింపుము."

"ఏల?"

"నీవీకార్యమును నిర్వహింతువను నమ్మకముతో నవాబు నీయందిట్టిదయావాత్సల్యములఁ జూపియున్నాఁడు. నీవాతని యభిప్రాయమునకు వ్యతిరేకముగఁ బ్రవర్తించితివేని నాతఁడు నీయడఁ జాలక్రౌర్యము వహించును."

"మరల బెదరించుచుంటివా? ఇంత కొక్క నిమిషము నకుఁ బూర్వము నన్నుఁ గారాగృహమున కంపుమని నిన్న డిగియుండలేదా?"

"పడుచువాఁడవు. నీకేమియుఁ దెలియదు. నవాబు నీమెడఁ దృప్తుఁడయ్యెనేని నదినీకు చాల నదృష్టము."

"రాజపుత్త్రిడు ముఖము చిట్లించుకొనియెను.

"ఆతని యనుగ్రహము లేకపోయిన నాకేమికొదువ?

వీరేంద్రసింహుని రక్తప్రవాహము నభివృద్ధినొందించెను. ఇంతయేనా?"

జగత్సింహుని నేత్రము లగ్నిగురియుచుండెను.

"అయినఁ నేఁబోయెదను. నావిధిని నేనునిర్వర్తించితిని. కటుల్‌ఖానుని యుద్దేశము నొకదూతమూలమున నీవు వినఁగలవు" అని యస్మాన్‌ఖాననెను.

కొంతసేపటికొకమనుష్యుఁడు వచ్చెను. అతఁడొక సైనికుఁడు. ఉద్యోగమున పదాతికంటె కొంచె మధికుఁడు. ఆతనితోఁగూడ నలుగురుపదాతులున్నారు.

"నీవు తెచ్చిన వర్తమానమేమి?" అని రాజకుమారుఁడడిగెను.

"నీ నివాసస్థలమును మార్చుకొనవలయు"

"సిద్ధముగ నున్నాఁడను" అనిచెప్పుచు నాతనితోఁగూడఁబోయెను.

---

## పంబదెండవ ప్రకరణము

—::—

### విచిత్రాలంకారము

కటుల్‌ఖానుని జన్మదినమహోత్సవ మతివైభవముతో జరుగుచుండెను. నృత్యము, మధుపానము. హాస్యము, ఆట పాట, దానము ధర్మములతో దినమంతయు వేడుకగా నుండెను. రాత్రి యింతకంటె నుల్లాసముగ నుండెను. ఇప్పుడే

సూర్యాస్తమయమయినది. కోటయంతయు దీపములతోఁ ప్రకాశించుచుండెను సందులు—గొందులు, కోటయంతయు మనుష్యసంకులము, ఉద్యోగులు, సైనికులు, రాజసేవకులు, సేవకులు, యాచకులు, తాగుబోతులు, నటులు, వేషగాండ్రు వేషకత్తెలు, వేశ్యాంగనలు, సంగీతపాటకులు, గారడివాండ్రు ఫలవిక్రయులు, పరిమళద్రవ్యవిక్రయులు, తాంబూలవిక్రయులు నానావిధభక్ష్యవిక్రయులు, విచిత్రవస్తువిక్రయులు, మొదలగు వారలతో దుర్గమంతయు నిండియుండెను. నీ వెక్కడ కేగిన నక్కడనే, సంగీతము, నృత్యము, పరిమళోదకము, తాంబూలము పుష్పములు, గారడీ, వ్యభిచారమును గాంచగలవు. ఈవేడుక లభ్యంతరభాగమునఁగూడ కొంతవఱకు జరుగుచుండెను. నవా బంతఃపురమందిరము లింతకంటె ప్రకాశముగను నింతకంటె నుల్లాసముగను, నింతకంటె శాంతముగను నుండెను. ప్రతిమందిరమును స్వచ్ఛస్ఫటిక వినిర్మిత దీపయంత్ర ప్రకాశితమైయుండెను. పూలకుండ్లు, స్తంభములు, శయ్యలు, కుర్చీలు, మెత్తలు, మనుష్యులు నన్నియు పరిమళ మిళితకుసుమ సంభరితములై యుండెను. మందమలయానిలుండు గొజ్జంగి పూలపరిమళమును మోసికొనుచు నంతటఁ గలయఁదిరుగుచుండెను. బంగారు సరిగ వైచినపట్లు, నలుపు, పసుపు, ఊదా ఎఱుపు వర్ణముల చీనిచీనాంబరములం దాల్చి పరిచారికాసమూహ మటునిటు దిరుగుచుండెను. వారి సువర్ణాలంకారములు దీపప్రకాశమున మెఱయుచున్నవి. పరిచారికలు కొందఱు వారియజమానురాండ్ర నలంకరించు పనియం

దుండిరి. విలాస భవనమున నీరాత్రి నవాబు ప్రతియువతి తోడను విలాసముగాఁ గాలముగడుపును. ప్రతియువిదయు నీనాఁడు వారివారి మనోరథములఁ బొందగలరు. ఒకయువిద తనసహోదరున కుద్యోగ మిప్పింపవలయునను నభిప్రాయముతో శిరోజములను జక్కగదువ్వుకొనుచుండెను. ఇంకొకతె తన కెక్కువ పరిచారికలు కావయునని యడుగుటకై సుందర కుటిలకుంతలముల వక్షస్థలమునఁ జక్కగ వ్రేలాడ వైచుకొనుచుండెను. వేఱొకర్తు క్రొత్తగఁ గలిగినతనయున కరణముమూలమునఁ గొంతయాస్తిని సంపాదింపవలయునను తలంపుతో నామె మెడయును గపోలములును నెఱ్ఱగ బ్రకాశించుటకై రక్తమువచ్చునంతదనుక రాచుకొనుచుండెను. మఱియొకర్తు, ఈనడుమ నవాబు తనకిష్టురాలగు నింకొకతెకాభూషరాజి నిచ్చెనని యసూయనుపొంది కన్నుపొడుగున నడుగు ఱెప్పలకు కజ్జలముంచుకొనుచుండెను. ఒకపరిచారిక, యామె యజమానురాలికి వస్త్రమును గట్టుచు పరాకున నామెదుస్తులను ద్రొక్కెను. ఆమె యజమానురాలామె దౌడపైనొక్క హస్తప్రహార మొసంగెను. ఒకస్త్రీ శిరోజములు వృద్ధురాలగుటచే పాపము కొంచెము పలుచనగనుండెను. పరిచారిక దువ్వుటలో నవికొంతభాగ మూడివచ్చెను. అదిచూచి యా వృద్ధస్త్రీ కపోలములపై బాష్పములు ప్రవహింప నేడ్వనారంభించెను.

ఆరామమందలి స్థలపద్మమువలె, పక్షులలో మయూరముభాతి నొకయువతీమణి యలంకరణము సమాప్తినొందించి

యటునిటుఁ దిరుగుచుండెను. ఆరాత్రియెవ్వరైనను, నెక్కడనైనను, నభ్యంతరములేకుండ సంచరింపవచ్చును. ప్రకృతి తనమాధుర్యము నంతనుఁజేర్చి యీయువిదను నిర్మించియుండెను. కటుల్‌ఖానా మె ప్రత్యవయవమునకుఁ దగిన భూషణముల నన్నిఁటి నిచ్చెను. ఆమె మొగమున నందమునకుఁగాని, యలంకారములకుఁగాని, యీమె గర్వమొందుచున్నట్లు లక్షణములేవియు గాన్పించుటలేదు. ఆమెయుల్లాసముగ లేదు. వికాశముగ లేదు. ఆమెముఖము గంభీరమై శాంతముగనుండెను. ఆమె హృదయమున నగ్ని మండుచున్నట్లు నేత్రములు సూచించుచుండెను.

ఆమె విమల. అక్కడనక్కడఁ దిరిగి తుదకొక సుందర భవనములోని కేగి లోపల తలుపు బిగించెను. ఈయుత్సవ సమయమున నట నొక్కటియే దీపమున్నది. అది చుట్టును గాంతుల నిచ్చుచుండెను. ఆవలిప్రక్క శయ్యపై నఖశిఖ పర్యంతమును దుప్పటమును ముసుగుపెట్టుకొని యెవ్వరో పరుండియుండిరి. విమల యీసమీపమున కేగి "నేనువచ్చితి" ననియెను.

శయ్యనుండి యులికిపడిలేచి ముఖముపైనున్న ముసుంగును దీసివైచి యీమెను జూఁచెను. విమల యనిగుర్తించెను. దుప్పటమునుదీసివైచి కూర్చుండెను. కాని యేమియు మాటాడలేదు.

"తిలోత్తమా! నేను వచ్చితిని" అని విమల మరల ననెను.

తిలోత్తమ మాటాడలేదు. విమలవంక తీవ్రముగఁ జూచుచుండెను.

ఆమె పూర్వమువలె సంతలజ్జావిహితమైయుండలేదు.

వెలవెలపోవుచున్న యావెలుతురున నప్పుడామెను జూచితివా నిజముగ నున్నవయసుకంటె పదేండ్లు పెద్దయని యనుకొందువు. శరీరము కృశించి సన్నముగ నుండెను. ముఖము వైవర్ణ్యమును పొందెను. ఆమె, మలినమైన చిన్న వస్త్రమును దాల్చియుండెను. ఆమెకడ నొక్కనగయైన లేదు. పూర్వము ధరించెడి యలంకారముల గుర్తులు మాత్రముండెను.

"నేను నీతో నననప్రకారము వచ్చితిని. మాటాడవేమి?"

"చెప్పవలసినదేదియో చెప్పితిని. ఇఁక నేమి చెప్పవలయు?"

తిలోత్తమ కంఠధ్వనినిబట్టి యామె యేడ్చుచున్నదని విమల గ్రహించెను. తనహస్తము నామె శిరస్సుపైనుంచి ముఖమును పైకెత్తెను. వదనమంతయుఁ గన్నీళ్ళలో మునిఁగియుండెను. ఆబాష్పోదకములచే వస్త్రమంతయుఁ దడిసిపోయినది. విమల యామె శిరసునుంచి పండుకొనియున్న తలగడనంటిచూచెను. అదియును దడిసిపోయెను.

స్త్రీశరీర ఘూయెడతెగని యుమ్మలికము నెంతకాల మోర్వగలదు.

"ఓర్వకున్న నేమి?" ఇంతకాలము సహించియున్నందుల కే నేను విచారించుచున్నదానను"

విమల మాటలాడకుండ నేడ్వ నారంభించెను. కొంత సేపటికి నిట్టూర్పు విడిచి యిట్లనియెను.

"ఈరాత్రి చేయవలసిన దేమి?"

తిలోత్తమ విమల యలంకారములవంక నయిష్టముతో వీక్షించుచు నిట్లనియెను.

"ఆట్లాలోచించినందువలనఁ బ్రయోజన మేమి?"

"బిడ్డా! నన్నుఁ దృణీకరించకుము. కటులుఖానుని నీవు బాగుగ నెఱుంగవు. సావకాశములేక కొంతయును, మనవిచారము పోవుటకై కొంతయుఁ నింతకాలము మనలను వదలి వైచినాఁడు. ఈవిషయ మింతకుబూర్వము నీతోఁజెప్పి యుంటిని. ఈదినముతో స్వేచ్ఛపరిసమాప్తియగును. నాట్య శాలకేగనిచో మనకేమి సంభవించునో యని తలంచుచున్న దానను."

"మనకింతకన్న వేఱేమి యుపద్రవము సంభవింపఁ గలదు."

"తిలోత్తమా! ఇంతలోనే యింతనిరాశఁ జెందెద వేల? ఇంకను మనకంఠమున జీవములున్నవి. మనము నిర్దోషులము. ఎంతకాలము మనదేహమునఁ బ్రాణములుండునో యంతకాలము మన నిర్దోషత్వమును గాపాడుకొనవలయు"

"అమ్మా! అయిన నీయలంకారముల నన్నిటిఁ దీసి వేయుము. అవి నాకన్నులకు విషప్రాయములుగ నున్నవి"

"విమల చిరునగవుతో బిడ్డా ! నాయలంకారములను బూర్ణముగ జూడకుండ నాగ్రహ మొందెదవేమి?" అని చెప్పుచు నామె దట్టినుండి చిన్నకటారినిదీసి చూపెను. అది యామె దుస్తులలో దాచియుంచెను. అది కన్నులు మిఱుమిట్లు గొలుపుచుండెను. తిలోత్తమ యులికిపడెను. చూడలేక పోయెను.

"దీని నెక్కడనుండి సంపాదించితివి?" అని తిలోత్తమ యడిగెను.

"అభ్యంతరభవనమునకు నిన్నవచ్చిన క్రొత్తపరిచారికను నీవు చూడలేదా?"

"అవును చూచితిని. ఆమె యాషాన్మీ"

"అభిరామస్వామికడనుండి యామెచేఁ దెప్పించితిని"

తిలోత్తమ యాశ్చర్యపడియెను. ఆమెకు గుండెలు కొట్టుకొనసాగెను. కొంచెముసేపుండి యామె యిట్లనియెను.

"ఈరాత్రి నీవేషమును మార్పవా?"

"మార్పను. నీవు నృత్యమునకుగాని, సంగీతమునకుఁగాని రావా?"

"నేను రాను"

"అయినను నినొక్కతెను విడిచిపోలేను"

తిలోత్తమ యేడ్వనారంభించెను.

"ఏడవకుము. వినుము. నీవిటనుండి దాఁటిపోవుటకు నేనొక యుపాయము నారసితిని"

తిలోత్తమ యాతురముతో విమలవంకఁ జూచెను.

విమల యస్మానుఖా నిచ్చిన యుంగరము నామెకిచ్చి యిట్లనియెను.

“దీనిని నీయొద్దనుంచుము. ఆవినోదముల వంకఁబోకుము. అది యర్ధరాత్రిమగువరకును బరిసమాప్తము నొందదు. అంతవఱకును నేను పఠానునకు పనిగలుగఁ జేసెదను. నేను నీసవతితల్లినని యాతఁడెఱుంగును, సంగీతనృత్యములు పూర్తియగుదనుక నేనుండగా నీవు రావని మిషఁజెప్పి యాతనికి నిన్నుఁ జూడవలయునను కోరిక కలుగకుండఁ జేసెదను. అర్ధరాత్రిమయినతోడనే నీవభ్యంతర ద్వారముకడకేగుము. అక్కడ నొకమనుష్యుఁడుండును. ఆతఁడిట్టియుంగరము నొక దానిని నీకుఁజూపును. ఏమియు సంశయింపకుండ నాతనితో నీవేగుము. నీవెక్కడకుఁ బోవలెనన్న నక్కడకాతఁడు నిన్నుఁ గొంపోవును. అభిరామస్వామి కుటీరమునకుఁ దీసికొనిపొమ్మని చెప్పుము.”

అధికాశ్చర్యముచేతనోఁ అధికానందముచేతనో తిలోత్తమ కొంతసేపటివఱకు మాటలాడలేకపోయెను.

“ఇదియేమి? నీకీయుంగర మెవరిచ్చిరి?” అని చాల సేపటి కనెను.

“అది చెప్పుటకుఁ జాలకథయున్నది. సావకాశముగఁ జెప్పెదను. నేఁజెప్పినట్లు చేయుటకు నీవేమియు సంశయింపకుము.”

“మఱినీవో? ఎట్లావలఁ బడెదవు?”

"ఆవిషయమున నీవు విచారమొందకుము. ఏదేని నుపాయముచే నేను విడివడియెదను. తేపటియుదయమున నిన్నుఁ గలిసికొనియెదను."

విమల తిలోత్తమ నీవిధముగ నూఱార్చెను. కాని, తిలోత్తమను గాపాడుటకయి విమల తానువిడివడుమార్గమును వదలివైచెనని తిలోత్తమ గ్రహింపలేకపోయెను.

చాలదినములనుండి తిలోత్తమముఖమున సంతోషమే లేదు. ఈసంతోషవార్త విని యామె పరమానందము నొందెను.

"ఇఁక నేఁబోయెదను" అని విమల యనెను.

తిలోత్తమ బాష్పావృతలోచనయై గద్గదస్వరమున "ఈకోటలోనీ వెఱుంగని ప్రదేశములును నీవెరుంగని విషయములును లేవు. మనస్నేహితులు పరిచయులు నెక్కడెక్కడ నెట్లున్నారో చెప్పెదవా?"

ఇట్టిమహోపత్సమయమునఁ గూడ నామె హృదయమునకు జగత్సింగు జ్ఞప్తియందుండె నని విమల గ్రహించెను. జగత్సింహుని నిర్దయాత్మకమగు నుత్తర మామెకు చేరినది. అందుఁ దిలోత్తమ పేరైన నుదహరించియుండలేదు. విచారముచేఁ బాతాళమున కణగఁద్రొక్కఁబడియున్న తిలోత్తమహృదయమున కీవిషయము మఱెంత విచారజనకమని యామె చెప్పక యూరకుండి యిట్లనియెను.

"జగత్సింహుఁడీకోటలో నారోగ్యముగనున్నవాఁడు."

తిలోత్తమ మాటలాడకూరకుండెను. విమల యామెను ముద్దుపెట్టుకొని వెడలిపోయెను.

---

## పదుమూఁడవ ప్రకరణము

—♦—

### అంగులీయ ప్రదర్శనము

విమల వెడలిపోయినపిదప తిలోత్తమ యొక్క తెయు నామె గదిలో గూర్చుండియుండెను. ఆమె హృదయము విచారోల్లాసభరితమైయున్నది. దుష్టపిశాచము చేతినుండి విడివడుట కిప్పటికి మార్గమేర్పడినదను నాలోచనలు మరల మనసు నాకర్షించినవి. మొట్టమొదటఁ దన్ను ప్రాణాధికముగఁ జూచుకొనుచుండుననియు నామె యనుగ్రహముననే తాను విడివడుచున్నాననియు తలంచెను. ఈయాలోచనలే యామెకుఁ దఱచుగ వచ్చుచుండెను. ఆమెమనస్సున నుల్లాసమొదవెను. నేనావల కేగినప్పుడెటకు బోవుదును? అయ్యో! నాతండ్రిదుర్గమెచ్చటనున్నది? అనియామె విచారింపసాగెను. తత్క్షణము యామెకు బాష్పములుదయించి కపోలముల వెంటఁ బ్రవహింపనారంభించెను. ఒకటి యడంగిన నామెకు మనోవేదనకారణమగు నింకొక యోచన జనియింపఁ దొడంగెను. రాజపుత్త్రుఁడు క్షేమముగ నుండెను. ఎటనున్నాఁడో? ఎట్లున్నాఁడో? ఆతఁడు కూడ ఖైదీయేనా? ఈయాలోచన మరల నామెకు బాష్పములుదయింపఁజేసెను. అయ్యో! దురదృష్టమా! నానిమిత్తమె

కదా యాతఁడు కారాగృహవాసి గావలసివచ్చె. నాప్రాణముల నాతని పాదములకడ విడిచి యాతనిఋణము దీర్చుకొనునంతటి భాగ్యము నాకలవడునా? హా! దైవమా! నేనాతని కేమియొనర్పఁగలను? ఆతఁడు కారాగృహమున నుండెనా? కారాగృహమున నెట్లుండునో? ఎవరును నటకుఁబోరాదా? చెఱియందొంటరిగఁ గూర్చుండి యేమితలపోయుచున్నాఁడో! తిలోత్తమయను నబలయుండె నని యాతనికిప్పుడు జ్ఞప్తియుండునా? అయ్యో! ఉండ కేమి? ఆతని ప్రస్తుతదురవస్థకుఁ గారణమును నేనేకదా! ఆతఁడు నన్నెంతసదూఁగుచుండెనోకదా! అదెట్లు? నేనట్లేల తలంపవలయు? ఆతనికొకరిని నిందించుట తెలియునా? ఎవరిని నిందింపలేఁడు. నిందింపలేడు. కాని, యాతఁడు నన్ను మరచిపోయి యుండు నేమో యని భయమగుచున్నది. లేదా. యవనాంతఃపురవాసినని యాతని హృదయమునుండి నన్నావలకుఁ ద్రోసివైచియుండును. కాదు. కాదు. ఆతఁడట్లుమాత్ర మేలచేయును? ఆతనివలె నేను దుర్గమునకై దిగఁబట్టువడితినికదా! నన్నేల తృణీకరించును? ఆతఁడట్లేయెంచి తృణీకరించిన నేనాతని పాదముల పైఁబడి యిదియంతయు విన్నవించుకొనియెదను. ఆతఁడు తృప్తిపొందఁడా? నిజమని నమ్మఁడా? బహుశా విశ్వసించును. విశ్వసింపఁడేని యాతనికడనే ప్రాణపరిత్యాగ మొనర్చెదగాక! పూర్వపునారీమణు లగ్నిలోఁబడి ప్రమాణములు చేయలేదా? ఈకలియుగమున నట్టిప్రమాణములు లేవా? పోనిమ్ము. ఆతని యెదురనగ్నిబడిన నేమి? అయ్యో! ఆతని నెప్పుడు

చూడఁగందును? అతఁడు చెఱనుండి విడివడుటయెట్లు? నేను విడివడినఁ బ్రయోజనమేమి? మాయమ్మ యీయుంగరమెటనుండి తెచ్చినదో? ఇది యాతనిని విడిపించుట కుపయోగింపనా ఈయంగుళీయక మాతనికంపిన నేమి? నన్ను దీసికొనిపోవుట కచట ఎవ్వరుందురు ? ఆతనిమూలముగ నేనేయుపాయములనైనఁ గనిపెట్టఁజాలనా? అయినను నేనీవిషయమునుగూర్చి యాతని నేమని యడుగుదును? ఆ రాజచంద్రు నింకొక్కసారి చూడ నాకుఁ బ్రాప్తములేదా? ఆతనితో సంభాషించుటకు నే నేమని యవసరమిమ్మని యెట్లడుగుదును? ఆతని యెదుట నాతనిగూర్చి నా పెదవులువిప్పి యెట్లుమాటలాడుదును? ఏమి మాటలాడి యీనిర్భాగ్య హృదయముయొక్క పరితాపమును జల్లార్చెదను?

ఆమెయింకను నాలోచించుచునేయుండెను. ఇంతలో నొక పరిచారిక వచ్చెను. తిలోత్తమ యామె నిట్లడిగెను.

"ఇప్పుడెన్ని గంటలయినది?"

"పండ్రెండుకొట్టినారు"

పరిచారిక యావలకుఁబోవువరకును తిలోత్తమ వేచియుండెను. ఆమెదృష్టిపథమునుండి దాటినపిదప తిలోత్తమ యుంగరమును గైకొని గదినుండి బయలువెడలెను. ఆమెకు భయమధికమయ్యెను. పాదములు వడఁకుచుండెను. హృదయము కొట్టుకొనుచుండెను. ముఖము వెలవెలబారెను. ఏమి రానున్నదో? ఒక్కయడుగు వైచెను. మరల వెనుకకరిగెను. క్రమక్రమముగ ధైర్యమును దెచ్చుకొని తుద కభ్యంతర

మందిర ద్వారముకడ కరుదెంచెను. కోటయందున్నవారును, కొజ్జాలును, నీగ్రోసేవకులును, నందరుల్లాసములో మునిఁగి యుండిరి. ఎవరు నామెను జూడలేదు. ఎవరైన నొకరిద్దఱు చూచినను వారామెనుగూర్చి యాలోచింపనేలేదు. తిలోత్తమమాత్రి మందఱును దన్ను గుర్తించిరనియే యనుకొనియెను. ఎట్లయిననేమి ధైర్యమును దెచ్చుకొని ద్వారముకడ కేగెను. ద్వారపాలకులు మధుపాన మత్తులై నిద్రించుచునో మెలకువగనున్నను స్మృతిలేకయో, అర్ధస్మృతితోడనో, యుండిరి. ఎవరు నామె నానవాలుపట్టలేదు. ద్వారముకడ నొక్క మనుష్యుఁడు మాత్రముండెను. అతఁడుకూడ ద్వార రక్షకుని వేషముతో నున్నవాఁడు. తిలోత్తమనుజూచి "నీకడ నుంగరమున్నదా? అమ్మా!" అని ప్రశ్నించెను. తడఁబాటుతో విమల యిచ్చినయుంగర మాతనికిచ్చెను. అతఁడదిజాగ్రత్తగఁ బరీక్షించి తనవ్రేలినున్నయుంగర మామెకుఁ జూపెను. ఇట్లనియెను.

"అమ్మా! భయములేదు. నాతోరమ్ము",

తిలోత్తమ తొందరగా నాతనితోఁ జనియెను. అభ్యంతరమందిర ద్వారపాలకులవలెనే ప్రమత్తులై యితరద్వార రక్షకులు నుండిరి. ఆరాత్రి ద్వారములన్నియుఁ దీసియున్నవి. ఎవరును వారినేమియు ననలేదు. ఎన్నియో ద్వారములు, ఎన్నియో భవనములు, ఎన్నియో ప్రదేశములు దాఁటి వారు తుదకు కోటయొక్క ప్రధాన ద్వారముకడ కరుదెంచిరి.

"అమ్మా! నీవెటకేఁగెదవు?"

విమల చెప్పిన మాట యామె హృదయమున లేదు. మొదట జగత్సింహునిఁ దలంచెను. నన్ను రాజపుత్త్రినొద్దకు, గొనిపొమ్మని చెప్పనుత్సహించెను. కాని యామె పూర్వవైరియగు లజ్జయామెను నిర్బంధించెను. కంఠముకడ నాఁగిపోయెను. ఆతఁడు మరల నిట్లడిగెను.

"నేను నిన్నెక్కడకుఁ గొనిపోవుదును?"

ఆమె యేమియుఁ జెప్పలేకపోయెను. వివశురాలై యుండెను. హృదయము కొట్టుకొనుచుండెను. ఎందులకో యామెయెఱుంగదు. నేత్రములదృష్టితప్పెను. చెవులు వినఁబడుటలేదు. పెదవులనుండి యేదియో యివ్వాలకువచ్చెను. అది యామెయెఱుంగదు. అది చాల దుర్బలస్వరము. "జగత్సింహుఁడు" అని యన్నట్లాతనికి వినఁబడియెను.

జగత్సింహుఁ డిప్పుడు చెఱలో నున్నాఁడు. అటకెవ్వరును బోరాదు. కాని నీవెచ్చటకుఁ దీసికొనిపొమ్మనిన నటకుఁ గొనిపోవుటకు నేను నియమింపబడితిని. "అమ్మా! నాతోరమ్ము"

అని యాతఁ డనియెను. ఆతడు మరలఁ గోటలోఁ బ్రవేశించెను. తిలోత్తమ యేమిచేయుచున్నదో యెటకుఁ బోవుచున్నదో, యేమియు నెఱుంగదు. వెనుకకుఁ దిరిగి జంత్రపు బొమ్మవలె నాతనితోఁ గూడ బోవుచుండెను. కోటలోని యందఱు ద్వారపాలకులవలెఁ గారాగృహపాలకులు మత్తులై యుండలేదు. వారివారి స్థానముల నతిజాగ్రత్తగ నున్నారు.

"రాజపుత్త్రి యెక్కడనున్నాఁడు" అని యాతఁడు కారాగృహ పాలకునడిగెను.

అతఁడు వ్రేలితోఁ జూపెను.

"ఆతఁడు నిద్రించుచున్నాఁడా? మెలకువగనున్నాఁడా?"

చెఱసాల రక్షకుడు కారాగృహ ద్వారముకడకేగ మరల వచ్చి యిట్లనియెను.

"మెలకువగ నున్నాఁడు. నాకుఁ బ్రత్యుత్తరమిచ్చినాఁడు."

"తలుపుఁదీయుము." ఆతనిని జూచుట కీమె లోనికేగును.

"అదెట్లు? అట్టియధికారము మాకు లేదు"

అస్మాన్‌ఖానుని యుంగరమాతనికిఁ జూపెను. కారాగృహ రక్షకుఁడు దానికి విధేయతను జూపి తలుపుఁ దీసెను.

రాజపుత్త్రి యొకసామాన్యమైన మంచముపై శయనించియుండెను. తలుపుఁదీసిన ధ్వనివిని యాతఁ డత్యాశ్చర్యముతోఁ జూచుచుండెను. తిలోత్తమ తలుపునొద్దకువచ్చెను. ముందునకుఁ బోలేకపోయెను. ఆమెపాదములు వానివిధిని నిర్వర్తించుటలేదు. ఆమె తలుపు పట్టుకొని నిలుచుండియుండెను. తిలోత్తమ చేయుచున్న యాలస్యమును జూచికూడ వచ్చిన యాతఁడు.

"ఇదియేమి? ఇక్కడెందులకాగియుంటివి?" అనియెను.

తిలోత్తమ యింకనుబోలేదు.

"లోపలికిఁబోవ నీకిష్టములేదేని వెనుకకు మరలుము. ఇక్కడ నాలస్యముచేయుట కిది సమయముకాదు.''

తిలోత్తమ మరలుటకు సిద్ధపడియెను. కాని యట్లును చేయలేదు. ఆమె యేమిచేయఁగలదు? కూడ వచ్చినవాఁడు తాలిమిలేనివాఁడు. తొందర యిచ్చుచుండెను. ఇట్లూగులాడుచు తిలోత్తమయొక్క యడుగు ముందునకు వైచెను. అట్లు వైచుట యామెయెఱుంగదు. ఆమె గదిలోఁ బ్రవేశించెను.

ఆమె రాజపుత్త్రుని చూచినదో లేదో? ముందున కడుగిడలేకపోయెను. గోడపట్టుకొని తలుపునొద్ద క్రిందకు వంచి యోచించుచుండును.

జగత్సింహుఁడు మొట్టమొదటఁ దిలోత్తమను గుర్తింపలేకపోయెను. అటకు స్త్రీయెట్లు వచ్చెనని యాతఁడాశ్చర్యమొందెను. ముందునకు రాకుండ నామె యటునిలువఁబడినందులకు మఱింత యాశ్చర్యపడియెను. ఆతఁడు లేచి తలుపునొద్దకువచ్చెను. ఆమెనుచూచి గుర్తించెను.

ఒక్క నిమిషమునకు వారివీక్షణములు కలిసికొనియెను. తత్క్షణమే యామె యవనతాలోకన యయ్యెను. రాజపుత్త్రుని పాదములపైఁ బడుటకుద్యమించిన ట్లామెదేహ మొక్కింత వంగెను.

ఆతఁడు కొంచెము వెనుకకుఁ దగ్గెను. తక్షణమయామె మంత్రబద్ధమైనదానివలె, చిత్తరువువలె, నిలువఁబడిపోయెను. ఒక్క క్షణము క్రింద పద్మమువలె వికసించినయామెహృదయ మిప్పుడట్లె వాడిపోయెను.

"వీరేంద్రసింహుని తనయయా!" అని రాకొమరుఁడనెను. కటారివలె నీవాక్యమామెహృదయమును భేదించి వైచెను. ఆతఁడేమనెను! వీరేంద్రసింహుని తనయయనియా? ఇప్పుడు పిలువవలసిన రీతియేనా యిది! జగత్సింహుడు తిలోత్తమయను పేరును మఱచిపోయెనా? ఇరువురును గొంతసేపు మాటలాడక యూరకుండిరి.

"ఇక్కడి కెందులకు!" అని యాతఁడు ప్రశ్నించెను.

"ఇక్కడి కెందులకు!" ఇదేమిప్రశ్న! తిలోత్తమతల తిరుగనారంభించెను. అన్ని వైపులను, గది, మంచము, దీపము గోడలు అన్నియు చుట్టును దిరుగనారంభించినవి. ఆమె శిరసును గోడకుఁ జేర్చెను.

ప్రత్యుత్తరము వచ్చునేమో యని రాజపుత్త్రుఁడు చాలసేపు చూచెను. కాని ప్రత్యుత్తర మిచ్చువారెవరు ? ఇఁక నాయాశ లేదనుకొని యతడిట్లనియెను.

"పాపము నీవు చాలవిచారించుచున్నదానవు. మరలి పొమ్ము గతమునంతను మఱచిపొమ్ము"

తిలోత్తమ హృదయమునుండి యన్నిసంశయములును వీడిపోయినవి. చెట్టునుండి యెండిపోయిన యాకువలె నామె భూమిపై బడిపోయెను.

—

మూర్ఛ

జగత్సింహుఁడు ముందునకు వంగి యామెపై దృష్టి సారించెను. ఆతడు తనవస్త్రముతో నామెకు విసరుచుండెను. ఆమెకు స్పృహవచ్చిన లక్షణములేవియు గాన్పించుటలేదు. ఆమెతోగూడ వచ్చినవానిని లోపలకు బిలిచెను. ఆతడు లోపలకు వచ్చెను.

"ఈస్త్రీ యాకస్మికముగ మూర్ఛఁజెందినది. ఈమెతోఁగూడ వచ్చిన పరిచారిక యెవరు? ఆమెను వచ్చిచూడుమని చెప్పుము."

"నేనొక్కఁడనే వచ్చితిని"

"నీవా?" అని యత్యాశ్చర్యముతో నడిగెను.

"నేనే, ఇంకెవరును రాలేదు."

—అయిన నిప్పుడు చేయవలసినదేమి? ఈకోటలోని యేపరిచారికతోనైనఁ దెల్పుము."

ఆతఁడు వెడలిపోయెను. రాజపుత్రుఁడాతని మరల లోపలకుఁ బిలిచి యిట్లనియెను.

"ఇదిగో! చూడు! ఈవిషయమునుగూర్చి యెవరితోనైనఁ జెప్పితివా యది క్రిమక్రమముగ వెల్లడియగును. ఈ యుత్సవ సమయమున నీయువిదకు పాపము సహాయము చేయువా రెవరు?"

"ఔను. అదియును నిజమే. అదిగాక కారాగృహ రక్షకులు మఱియొకరి నిందు రానిత్తురా? నేనుమాత్ర మెటులు తీసికొనిరా సాహసింతును?"

"అయిన నేనిప్పుడేమిచేయవలయు? ఇంకొకయుపాయమున్నది. నీవతిత్వరితముగఁ బోయి యొకపరిచారికచే నయేషాకీ సమాచారము నందజేయుము."

ఆతఁడు చెప్పినప్రకార మామనుష్యుఁ డతివేగముగఁ బోయెను. రాజపుత్త్రుఁ డామెకు సాధ్యమయినంతవఱకు నుప చారములఁ జేయుచుండెను. ఆతని హృదయభావము లప్పు డెట్లుండెనో? ఎవరు చెప్పఁగలరు? ఆతని నేత్రముల భాష్పో దయమయ్యె? ఏమో? ఎవరు చెప్పగలరు?

చెఱసాలయం దాతఁడును దిలోత్తమయు నేయుండిరి. ఆతఁడు చాల కలవరపడియెను. "ఆయేషా కీవర్తమాన మం దకపోయిన నెట్లు? అందినను నామె యేయుపాయమును జేయ లేకపోయిన యేమిరానున్నదో?

క్రమక్రమముగఁ దిలోత్తమకు ప్రాణములు తేరు కొనియెను. రాజపుత్త్రునకుఁ దోడనే యామనుష్యునితోఁ గూడ నిరువురుస్త్రీలుకనఁబడిరి. దూరమునుండి మేల్ముసుంగు వైచుకొని వచ్చుచున్న యాస్త్రీ లయ బద్ధగమనమును మనోహర గంభీరరూపమును జూచి యయేషా పరిచారికతో వచ్చుచున్నదనియు నామె యాశాదేవతనుగూడఁ దీసికొని వచ్చుచున్నట్లుండెననియు నాతఁ డనుకొనెను. వారిరువురును కారాగృహ ద్వారముకడకు వచ్చిరి. ఉంగరమును జూపిన యాతనితో కారాగృహపాలకుఁ డిట్లనియెను.

"వీరినిగూడ లోపలకుఁ బోనీయవలసినదేనా?"

"అది నీయిష్టము, నేఁజెప్పలేను"

"మంచిది"అని యాతఁడు వారలఁబోరాదని యభ్యం
తర పెట్టెను.

అయేషా మేల్మొసుంగును దొలఁగించి "రక్షకుఁడా!
నన్నులోపలకుఁ బోనిమ్ము. నీకేదేని యిందుమూలమున నుప
ద్రవము వచ్చెనేని యది నాపైఁ బెట్టుము" అనియెను.

అయేషాను జూచి యాతఁ డాశ్చర్యపడెను. విధేయ
తనుజూపి చేతులుజోడించి "అమ్మా! సేవకు ననుగ్రహిం
పుము. లోపలికేగుటకు మీకభ్యంతరమేమి?"

అయేషా చెఱసాలలోఁ బ్రవేశించెను. ఆమె యెప్పు
డును మందహాసము సేయుచున్నట్లే యుండును. అందు నామె
నవ్వుచున్నట్లు కనుపట్టుచున్నదిగాని నిజముగా నామె మంద
హాసము చేయుటలేదు. అంధకారబంధురమైన యాచెరసాల
కెంతప్రకాశము వచ్చినది? ఇఁక నది చెఱసాలయేకాదు.

అయేషా వందన మొనర్చి రాజపుత్త్రున కిట్లనియె.

"రాజోత్తమా! సంగతులేమి?"

ఆతఁ డేమని ప్రత్యుత్తరమిచ్చును? క్రిందపడియున్న
తిలోత్తమను జూపెను. ఆమెనుజూచి యయేషా యిట్లడిగెను.

"ఈమె యెవరు?"

"వీరేంద్రసింహుని కుమార్తె"

అయేషా తిలోత్తమను లేవఁదీసి తనయొడిలోఁ జేర్చు
కొనియెను. అట్టిస్థితియందయేషాగాక మఱే యేయువతియైన
నయ్యెనేని సంకోచము నొందును. వితర్కించును. కాని

యయేషా యట్లుచేయలేదు. తక్షణమే యామెను లేవదీసి తనయొడిలోఁ జేర్చుకొనియెను.

ఆమె యేమిచేసినను నందముగనే యుండును. ఆమె ప్రతీకారమును మనోహరముగఁ జేయుచుండును. ఆమె తిలోత్తమ నొడిలోఁ జేర్చుకొనుటనుజూచి జగత్సింహుఁడును బరిచారికయు నిట్లు తలంచుకొనిరి. "ఎంత మనోహరముగ నున్నది!"

అయేషా పరిచారికచేఁ బన్నీరుబుడ్లు పర్బత్తులు మొదలగునవి తెప్పించియుంచెను. వానిచే దిలోత్తమ కుపచారము చేయించెను. తిలోత్తమకు స్పృహ కలిగినది. పరిచారిక యామెకు విసరుచుండెను. తిలోత్తమకిదివఱకే కొంచెము కొంచెము స్మృతి వచ్చినది. అయేషా యుపచారములచే పూర్ణముగ స్మృతి కలిగెను.

తిలోత్తమ చుట్టును గలియఁజూచెను. జరిగినదంతయు జ్ఞప్తికివచ్చెను. తటాలున గదియావలకు దాఁటిపోవుచుండెను. కాని మనోవ్యాకులభావమునకుఁదోడు శరీరదార్ఢ్యము కూడ నీరసించి పోవుటచే నడువలేకపోయెను. జరిగిన విషయములు జ్ఞప్తికివచ్చిన కొలఁదిని తల తిరుగుచుండెను. ఆమె కూర్చుండెను.

ఆమెచేతిని బట్టుకొని యయేషా యిట్లనియెను.

"సోదరీ! నీవేల విచారపడియెదవు? నీవు చాల నీరసముగ నున్నదానవు. విశ్రాంతికై నామందిరమునకు రమ్మ, పిదప నీ వెటకుఁ బోవలెనన్న నటకు బంపెదను."

తిలోత్తమ ప్రత్యుత్తరమీయలేదు. అయేషా కూడ వచ్చిన వాని నడిగి యంతయుఁ దెలిసికొనియెను. తిలోత్తమ భయపడుచున్నదని తలంచి యయేషా యిట్లు చెప్పెను.

"నీవు నన్నేల విశ్వసింపవు? నేను నీశత్రుని కుమార్తె ననుమాట నిశ్చయమే కాని యంతమాత్రమున నీనమ్మకము నకు పాత్రురాలను గానని, తలంపకుము నేను నీసంగతిని తెలిసికొంటినని భయపడనక్కఱలేదు. ఈరాత్రిగడవక పూర్వమే పరిచారికాసాహాయ్యమున నీవెక్కడకుఁ బోవలయు నన్న నక్కడకుఁ బంపెదను. ఈవిషయమున నెవ్వరు నేమియు నెఱుంగజాలరు."

అయేషా వాక్యములు చాల మధురముగనున్నవి. ఆమె నిష్కాపట్యవిషయమున దిలోత్తమ కించునేని సందేహము వొడమలేదు. ఇదిగాక యామెకు నడుచుటకు శక్తిలేదు. ఇఁక జగత్సింహునికడ నుండలేదు. ఏమిచేయును? అయేషా చెప్పిన ట్లంగీకరించెను.

"నీకునడువ బలములేదు. పరిచారికా సాహాయ్యమున వెళ్ళఁగలవా? అని యయేషా యడిగెను.

తిలోత్తమ పరిచారిక భుజముపై చేయివైచి మెల్లఁగ నడువ నారంభించెను. అయేషాకూడ వెడలిపోవుటకుద్దేశించి రాజపుత్రునొద్ద సెలవుబుచ్చుకొనఁ బోయెను. ఆతఁడు తన దృష్టి నామెపై సారించెను. ఏదియో యామెతో చెప్పదలఁచుకొనిన ట్లావీక్షణమునఁ గన్పట్టుచుండెను. అయేషా యది గ్రహించి పరిచారికతో నిట్లనియెను.

"ఈయుబలను దీసికొని నీవు నాశయనాగారమునకుఁ బొమ్ము పిదప నన్నుఁదీసికొనిపోవుటకు మరలరమ్ము"

తిలోత్తమయు బరిచారికయు వెడలిపోయిరి. జగత్సింహుఁడు నిట్టూర్పు విడిచి తనలో "ఇదియేకడసారివీక్షణము" అని యనుకొనియెను. తిలోత్తమ దృష్టిపథమున నున్నంతవఱకతఁడామెను జూచుచుండెను. తిలోత్తమ తనలో "ఇదియే కడసారి యనుజ్ఞ"అని యనుకొనియెను. జగత్సింహుఁడు కన బడునని శోఁచినంతవఱకామె వెనుకకుఁదిరిగి చూడలేదు. ఆమె తిరిగి చూచునప్పటి కాతఁడు కనబడలేదు.

---

## పదునేనవ ప్రకరణము

---

### ప్రకటన

తిలోత్తమయు సేవకురాలును నాగది విడిచిపోయిన పిదప నయేషా ముందుకువచ్చి శయ్యపైఁ గూర్చుండెను. అట నింకొక పీఠములేదు. జగత్సింహుఁడు నిలువఁబడియుండెను.

ఆమె తన జడనుండి గులాబీపుష్పము నొకదానినిదీసి దానిపత్రముల నొక్కటొక్కటిగ నూడఁదీయుచునిట్లనియెను.

"రాజపుత్రా! నాతో నేదియో మాటలాడఁదలంపున్నటుల నీవీక్షణమువలనఁ జూపట్టుచున్నది. నాసాహాయ్యము వలన నీకు లేశమైన ప్రయోజనముఁ గలదేని, నీహృదయము

నాకిఁక వెల్లడించుట కించుకేనియు ననుమానింపకుము. నేను నిశ్చయముగఁ బరమానందముతో నీసేవ యొనర్చెదను.

"రాకుమారీ! నాకిప్పుడేదియుఁ బ్రయోజనకారి కానేరదు. స్వప్రయోజనాభిలాషచే నీతో మాటలాడవలయునను నుద్దేశములేదు. నేను చెప్పదలఁచినది, నాయవస్థనుబట్టిచూడ నిన్ను మరలఁ జూడఁగలుగుదుననునాశ నాకులేదు. మన మొకరినొకరు చూచుకొనుటకు బహుశః యిదియేతుది. అయ్యో! నేను నీకు ఋణగ్రస్థుఁడను. ఈవిషయమును మాటలచే నెంతని తెలుపఁగలుగుదును. నాదురదృష్టమును బట్టి యాలోచించిచూడ నీఋణమును నేనెన్నటికైన దీర్చుకొనఁగలుగుదునను నాశ నాకులేదు. కాని, యెప్పుడైన నీకు ప్రత్యుపకార మొనర్పశక్తినాకు గలిగెనేని నదృష్టమెన్నడైన నాయెడఁ బ్రసన్నముఖియయ్యెనేని నాకడ నీయుద్దేశములను వెలిఁబరప సందేహింపకుమీ! సోదరి తనమనోరథముల సహోదరునకు ధారాళముగ నెఱింగింపదా? నీవును నట్లే యొనర్పుము."

జగత్సింహుని కంఠధ్వని దుఃఖభరితమై గద్గదికముతో నుండెను. ఆతఁడు నిరాశ జెందెను. అయేషాహృదయము నీరయిపోయెను. ఇట్లనియెను.

"నిరాశ జెందకుము. అధైర్యపడకుము, ఈదినమున నున్న కష్టములు శేషుండజాలవు"

"నేను నిరాశజెందుటలేదు. కాని యీజన్మమున దేనికై యాశపెట్టుకొని యుండవలయును? నాజీవితము నిక

గాపాడు కోరిక లేదు. ఈలోకమును విడిచిపోవుటకంటె నాకు వేఱుద్దేశమేమియు లేదు. కాని యది యీకారాగృహమున మాత్రముకాదు"

జగత్సింహుని యీదీనోక్తులయేషా హృదయమును నీరుజేసెను. ఆతనిభావప్రకటనమున కామె యాశ్చర్యము గూడ నొందెను. అమె హృదయమును కలతనొందెను. దూరతాభావము, మితభాషణత్వము, తొలగిపోయినవి. అత్యంతప్రేమాస్పదయగు సువిదవోలె నామెస్త్రీస్వభావమగు మృదుకృపార్ద్రీభూతహృదయయై రాజపుత్రుని చేయి పట్టుకొని "జగత్!" అనియెను.

ఆతని ముఖమువంక జూచుచు నొక్కనిమిషమూరకుండి మరల నిట్లనియెను.

"జగత్! ఎందులకింత పరితాపము? నన్ను దూరస్థురాలినిగ భావింపకుము. అనుజ్ఞయయ్యేనేని నినొ్కకప్రశ్న యడిగెదను. వీరేంద్రసింహుని కుమార్తె—

"అనుగ్రహింపుము. ఆప్రసంగమును దేకుము. అది స్వప్నము. అదియంతయు నదృశ్యమైపోయినది."

చాలసే పిరువురును మాటలాడకుండ నూరకుండిరి. ఒకరిహస్తముల నొకరు బట్టుకొనియేయుండిరి. అయేషా తన శిరసును హస్తముపై వంచుకొనియుండెను.

బాష్పబిందు వొకటి రాజపుత్రుని చేతిపై బడియెను. ఆతడులికిపడి తనశిరసును క్రిందకువంచి యామెసుందరవదన

మును వీక్షించెను. బాష్పోదకము లామె మృదుకపోలముల వెంట బ్రవహించుచుండెను. ఆత డాశ్చర్యముతో

"భగవంతుడు తోడగుగాక! అయేషా! ఇదియేమి? ఏడ్చుచున్నా వేమి?" అని యడిగెను.

అయేషా యేమియు బ్రత్యుత్తర మీయకుండ నాతని చేయిపట్టుకొని తీసికొనివచ్చి శయ్యపై దనప్రక్కను గూర్చుండబెట్టుకొనియెను. ఆతడు కూర్చుండిన పిదప మరల నాతనిచేయిని గ్రహించి యిట్లనియెను.

"రాకుమారా! నేను నీకిట్లు చెప్పవలసివచ్చునని కలనైనఁ దలంపఁలేదు. నేనెంతకష్టమునైన ననుభవించెదఁగాని యీపరితాపముతో నిన్ను కారాగృహమున విడిచి నేను బ్రతుకఁజాలను. నాతోఁ గూడరమ్ము. నేను నిన్ను వేఁడుకొనెదను. నాయశ్వశాలనుండి నీకొకగుఱ్ఱము నిచ్చెదను. దాని నధిరోహించి యీరాత్రియే మీతండ్రిగారి కడకేగుము."

జగత్సింహుఁడు తనను రక్షించు దేవత తనను ధన్యాత్మునిఁజేయ సాక్షాత్కరించినను, నింతకంటె నాశ్చర్యమును పొందఁజాలడు. ఆతఁ డాశ్చర్యముతో మాటాడ నశక్తుడయ్యెను.

"జగత్సింహ కుమారా! రమ్ము రమ్ము" అని యామె బలవంతపెట్టెను.

"అయేషా! నీవు నాకు స్వేచ్ఛ నొసఁగెదవా? నన్ను విడిపించెదవా?"

"నిశ్చయముగ, తత్క్షణమే"

"మీతండ్రికి దెలియకుండగ నేనా?"

"భయములేదు. మాతండ్రికి నీవందనేరవని తోఁచిన ప్పుడు వెల్లడిచేసెదను."

"కారాగృహరక్షకు లట్లంగీకరింతురా?"

"ఇదిగో! మనకీరక్ష యున్నదికదా! ఇదియే వారి నొప్పించు" అని యామె తన కంఠహారమునుదీసి రాజపుత్రు నొద్దనుంచెను.

"ఈవిషయము వెల్లడియయినప్పుడు మీతండ్రిగారిచే నీకు చిక్కులు కలుగఁగలవు."

"అదియొక గొప్పవిషయము కాదు."

"వలదు. వలదు. నేను పోనొల్లను"

అయేషా వెలవెలఁబోయి చూచి విచారముతో

"ఏమి?" అని యడిగెను.

"నేనిదివఱకె నీకుఁ జాల ఋణపడి యున్నాఁడను. నాప్రాణ మొసంగినను నాయప్పు తీరునదికాదు, ఇపుడు మరల నీకు కష్టమును దెచ్చిపెట్టెడు కార్యమును జేయఁజాలను"

"నామాటను వినుఁడు. పట్టుపట్టకుఁడు. నిరాకరింప కుఁడు." అని గద్గదస్వరముతో ననిమెను.

"వలదు. వలదు. నీవు వెళ్ళుము."

అయేషా మరల నూరకుండెను. ఆమె బాష్పముల నాపుకొన నెంతయో ప్రయత్నించెను. కాని పాపము! నిష్ఫల మయ్యెను. అవి మరలఁ బ్రవహించుచుండెను.

"అయేషా! నీ వెందులకు దుఃఖించెదవు? చెప్పవా?

అయేషా! మాటలాడవేదు? ఇంకను విచారించుచునే యున్నావు. కారణమును నాకెఱింగింపుము. వానిని దొలఁగింప నాప్రాణములైనను నొసంగెదను. నేను కారాగృహమున నుండిమాత్రమున నీకీ విచారమెందులకు? నీ వెందుకేడ్చెదవు? మీతండ్రిగారి కారాగృహమున నెన్ని వేల కైదీలు లేరు?"

అయేషా ప్రత్యుత్తరమీయకుండ నేత్రములు తుడుచుకొని కొంచెము సేపుండి యిట్లనియెను.

"రాజతనయా! ఇఁక నేను దుఃఖింపను"

ఆమె విచారకారణమును దెలుపనందులకు జగత్సింహుఁడొక్కింతుక చింతించెను. ఇరువురును శిరసులను వంచి కొంతసేపట్లేయుండిరి.

ఇంతలో నెవరో మూఁడవ మనుష్యునియొక్క ఛాయ యాగదిగోడపైఁ బ్రతిఫలించెను. దానిని వీరిరువురును జూడలేదు. ఆతఁడు లోపలికరుదెంచి వారియెదుట నిలువఁబడియెను. చిత్తరువువలె కొంతసేపట్లు నిలుచుండియుండి, క్రోధసంజనిత కంపితస్వరంబున నిట్లనియెను.

"రాకుమారీ! ఇది వధ్యార్హము"

ఇరువురును శిరసులఁ బైకెత్తిచూచిరి ఆతఁ డస్మాన్‌ఖాఁ. అస్మాన్‌ఖాఁ నుంగరమును గైకొని తిలోత్తమతోఁ గూడవచ్చిన యామనుష్యునిచే సర్వమును దెలిసికొనియెను. ఆతఁడయేషాను వెదకుచు నిటకు వచ్చెను. జగత్సింహుఁ డస్మాన్‌ఖానుని జూచెను. కతులుఖానువలనగాని, యస్మాన్

ఖానుని మూలమునఁగాని యమేషా కేమి ముప్పువాటిల్లునో, యేమియాపద మొనఁగూడునోయని యాతఁడు చాల భయ మందెను. అస్మాన్ ఖానుఁ డాగ్రహముతో ననిన యావాక్య మాతనికి మఱింతభయమును కలుగజేసెను. అస్మానుఖానుని వాక్యమందలి భావము నమేషా నిమిషములో గ్రహించెను. మనోహరమైన యామె ముఖలక్షణము లొక్క నిమిష మెఱ్ఱ వడియెను. కాని, ఆమె కడనోర్పులేమిని సూచించు మఱే చిహ్నములును గాన్పించుటలేదు. ఆమె మెల్లఁగా నిట్లని యెను.

"అస్మాన్! ఏదివధ్యార్హము?"

"అర్థరాత్రిమున రాజతనయ యొక ఖయిదీతోఁగూడ నుండుట వధ్యార్హము. చట్టమునకువ్యతిరేకముగ నామె చెఱ సాలలోనికి వచ్చుటకూడ వధ్యార్హమైన నేరమే" అని యాతఁ డాకంఠధ్వనితోడనే ప్రత్యుత్తర మొసంగెను.

అమేషా నిర్దోషురాలు, కళంకరహిత. అస్మాను ఖానుని వాక్యముల కామె సహింపలేకపోయెను. ఆతనివంకఁ దీవ్రముగ దృష్టిసారించి యస్మా నెప్పుడును కనివినియుండ నంత తీవ్రముగు కంఠధ్వనితో నామె యిట్లు చెప్పెను.

"ఇదినాయిష్టము— ఈయర్ధరాత్రిమున చెఱసాలకు వచ్చుటకూడ నాయిష్టము. ఈకయిదీతో మాటలాడుటయుఁ నాయిష్టమే నాస్వభావమునందలి మంచిచెడ్డల నారసి తీర్మా నించుటకు నీవర్హుండవుకావు ఆవిషయమున నీకేమియుఁ బ్రసక్తి లేదు."

ఆతఁ డాశ్చర్యపడియెను. ఆతఁడింకను కోపముతోడనే "రేపుదయమున నవాబుగారియెదుట నాసంగతియంతయు నీవు చూచెదవుగానిలే" అనియెను.

"మాతండ్రి నన్నుఁ బ్రశ్నించినప్పుడు నేను త్తరమిచ్చెదను. ఆవిషయమున నీవు విచారింపఁబనిలేదు." అని యా విధముగానే చెప్పెను.

"నేనడిగిన?" అని యతఁడు యథారీతి కంఠధ్వనితో నడిగెను.

అయేషా పాదములపై లేచి నిలువఁబడియెను. ఆమె దృష్టి యస్మానుపైఁ బఱపెను. ఆమె విశాల నేత్రములు మఱింతవికాసమునుఁబొందెను. ఆమె పద్మసన్నిభవదన మధిక ప్రకాశము నొందుచుండెను. వినీలకుటిల కుంతలములతోఁ గూడ నామెశిరసాక్కింత యొక ప్రక్కకొఱఁగెను. తరంగములచే నాడుచుండెడి శైవలముభాతి నామె హృదయ మభివృద్ధినొందుచున్న మనస్తాపముచేఁ జలించుచుండెను. ఆమె విస్పష్టధ్వనులతో నిట్లు చెప్పెను.

"అస్మాన్! నీవడిగినచో నిట్లు చెప్పెదను. ఈచెఱసాలయందిప్పుడునాయెదుటనున్న యీకయిదీనాహృదయేశుఁడు"

ఆసమయమున నాకస్మికముగ పిడుగుపడినట్లయ్యెను. రాజపుత్త్రుఁడుగాని పఠానుఁడుగాని యెప్పుడును నింతగానులికిపడియుండరు. వారు మహాశ్చర్య నిమగ్నులైరి. రాజపుత్త్రునకు హృదయాంధకారమంతయు నదృశ్యమైనది—అయేషా మాటలాడకుండ నేడ్చినకారణము నంతయు నాతఁడుగ్రహిం

చెను. అస్మాన్ ఖా సింతకుపూర్వ మిదియంతయు నూహించి కొనియున్నవాఁడు. అందుచేతనే యామెతో నట్లు తిరస్కారముగ మాటలాడియుండెను. కాని, తన సమక్షముననే యామె తన ప్రేమ నట్లు ప్రకటించునని యాతఁ డెన్నఁడును దలంపలేదు. అస్మాన్ నిశ్శబ్దముగ నూరకుండెను.

ఆమె యిట్లు మరల చెప్పనారంభించెను.

"అస్మాన్! వినుము, ఈ ఖైదీయే నాహృదయేశుఁడు. ఈకంఠమున నణుమాత్రి మూపిరియున్నను నాహృదయమున నీతఁడు దక్క మఱి యెవ్వరును, నీపఁణ్మాత్రిప్రిదేశమైనను పొందఁజాలరు. ఱేపుదయమున నీతనిరక్తములో వధ్యస్థాన మంతయు మునిఁగిపోవుట సంభవించెనేనియు (ఆమె కంపించెను) ఇంకను, ఇంకను, ఎల్లప్పుడును నాతని మాధురీ విగ్రహమునే నామనమునఁ బ్రతిష్ఠించుకొని యారాధించుచుండ నీవు చూడఁగలవు. మేమిరువురము నొకరినొకరు చూచుకొనుట కీనిమిషమే కడసారియయినను, ఈరాజపుత్త్రి శిరోమణి ఱేపటిదినముననే కారాగృహమునుండి విముక్తిగాంచినను, ఈగాంభీర్యనిధి వందలకొలఁది భార్యలచేఁ బరివృతుడయి యుండినను లజ్జాకరమై యయేపానామ మీప్రపంచమున నానుడిగఁ బరిగణింపఁబడినను, ఇంకను, ఎప్పటికిని, నాకంఠమున ప్రాణముండినంతకాల మీతనినే ప్రేమించుచుండెదను. ఇట నేను రహస్యముగ మాటలాడుచున్న దేమియో నీ వెఱింగితివా? మంచిమాటలచేతనో, బహుమానము నిచ్చియో ద్వారరక్షకుల సమ్మతింపఁజేసి యాతని నీచెఱ

నుండి తప్పించెదననియు, నాయశ్వశాలయందలి యశ్వము నొకదాని నిచ్చెదననియు నీరాత్రి యాతనితండ్రిగారికడ కేగు మనియు నాతనితోఁ జెప్పుచుంటిని. ఈరాజపుత్త్రిరత్నమా మాటకు సమ్మతింపలేదు. కాని, లేకున్న నీపాటికి నీవీతని కాలిగుర్తులైన నిటఁ గాంచలేకపోయియుందువు.''

ఆమెబాష్పములఁ దుడుచుకొని కొంచెము విరతిఁజెంది కంఠధ్వని నొక్కింత మార్చుకొని మరల నిట్లు చెప్పఁదొడంగెను.

"కాని, అస్మాన్! నీకు నేను చాలనొప్పికలుగఁజేసితిని, నన్ను మన్నింపుము. నేనిదె వేఁడుకొనుచున్నదానను. మేమిరువురమును నన్యోన్యప్రేమతోఁ జరించుచున్నారము. నాస్వభావము చాలనిర్దయాత్మకమైన దానివలెఁ గన్పట్టును. కాని నీవు నాపాతివ్రత్యమును గూర్చి యనుమానించితివి. ఇతరదోషము లెన్నియున్నను నయేషాకడ కళంకము మాత్రములేదు. అయేషా యేమిచేసినను నామె ప్రత్యక్షముగ దాని నొప్పుకొనును. ఈవిషయము నిప్పుడు నీకడఁ బ్రకటించితిని. అవసరమైనచోఁ దేపు మాతండ్రిగారికడకూడ నీవిషయమును బ్రకటించెదను.''

ఆమె మరల జగత్సింహునివంకకుఁ దిరిగి "రాజపుత్త్రా! నీవుకూడ నన్ను క్షమింపుము. ఆస్మాన్ ఖా నిట్లునన్ను నొవ్వ నాడకుండునేని, నాహృదయమును దహించుచుండెడి విచారము, నీచెవిని బడకయుండును, నీచెవినేకాదు. ప్రపంచమున నెవ్వరిచెవులను బడియుండదు.''

రాజపుత్త్రుఁడు మాటలాడలేక నిలుచుండియుండెను. ఆతని హృదయము పరితాపాగ్నిచే దహింపఁబడుచుండెను. అస్మాన్ కూడ మాటలాడకుండ నుండెను. ఆయేషా మరల నిట్లనియెను.

“అస్మాన్! నీమనస్సునకు భారముకలుగునటులమాట లాడియుంటినేని నన్ను మన్నింపుము. నేనెప్పుడును నీప్రియ సోదరివలె వర్తించెదను. నీవు నాపైనిప్రేమను దగ్గింపకుము, తగ్గింపకుము. నాదురదృష్టవశమున నేనీసముద్రమునఁబడి మునిఁగిపోవుచున్నదానను. సోదరప్రేమను లేకుండజేసి నా దుఃఖమును మఱింత యభివృద్ధిచేయకుము.”

ఇట్లు చెప్పుచు పరిచారిక తిరిగి వచ్చువఱకు నుండక యామె యతివేగముగ వెడలిపోయెను. ఇంద్రియజ్ఞాన విహీనునివలె నస్మాన్ ఖాన్ మాటలాడకుండ కొంతసేపచటనుండి పిదపఁ దనగృహమునకుఁ బోయెను.

---

## పదునాఱవ ప్రకరణము

ప్రభూ! నీబానిస నీపాదములకడనేయున్నది

కటుల్ ఖానుని యంతఃపురమున నారాత్రి నృత్యము జరుగుచుండెను. మొగలాయీచక్రవర్తులవలె నాతఁడు జన్మ దినమహోత్సవమునాఁడు రాజసేవకుల నడుమను, ఉద్యోగస్థుల నడుమను, ఉల్లాసవినోదములతోఁ గాలము గడపఁడు.

ఆతఁడు స్వభావముగ నధిక స్వార్థపరుఁడు. విషయభోగవాంఛాతత్పరుఁడు. ఆరాత్రి యాతఁడు ప్రియురాండ్రిందరతోఁ గూడి విలాసవిహారము లొనర్చుచుండెను. అటనిఁక వేఱె వేశ్యాంగన లేదు. ఇఁక వేఁగుచూపఱులు లేరు. కొజ్జాలు తప్ప నిఁక నెవ్వరు నటకుఁ బోరాదు. కొందఱు నృత్యము సేయుచుండిరి. కొందఱు సంగీతము పాడుచుండిరి. కొందఱు లయవేయుచుండిరి. మిగిలినవా రాతనిచుట్టును గూర్చుండి వినుచుండిరి.

ఇంద్రియసౌఖ్య మొనగూర్చువస్తువు లక్కడలేని వీ ప్రపంచమున నెక్కడను లేవు. నీవా భవనమునఁ బ్రవేశించితివా చల్లనిమందమలయానిలము నీశరీరమంతటఁ గలయఁబ్రాకును. అది నిరంతరాయముగ వెదచల్లు పరిమలోదకములచే సుగంధబంధురముగఁ జేయఁబడినది. ఆస్ఫటిక పాత్రములు, ఆదంతపాత్రములు, ఆరజితపాత్రములు, నీకన్నులకు మిఱుమిట్లుఁగొలుపును. ఇటపూలగుత్తులు, అట పూలహారములు, ఇంకొకచోఁ బూలరాసులు, పరిమితి లేదు. అవి స్త్రీలశిరోజముల నలంకరించుచుండెను—మఱియు వారికంఠహారములై యొప్పారుచుండెను—కొందఱు పూలవీవనల మోయుచుండిరి—కొందఱు పూలనలంకరించుకొనుచుండిరి— కొందఱు పూలగుత్తుల వేఱొకరిపై విసరుచుండిరి—

ఆకుసుమ పరిమళము, ఆపరిమళద్రవ్యసుగంధము— ఆసుంధ తైలదీపికాసౌరభము—ఆసౌరభసమ్మిళిత కోమల యువతీ జనగాత్ర సంజనితామోదము — వీనియన్నిటితో నచ్చటి మలయానిలముఘుమఘుమాయమానమగుచుండెను.

ఆదీపికా వైభవము, ఆపుష్పసౌభాగ్యము! ఆయాభూషణ విలసనము, ఆసుందరవిలాసినీజననిరంతర కటాక్షవీక్షణ గాంభీర్యము, ఆ వేణువీణానినాదంబు లాకోకిలవాణులనిర్మల మధుర స్వరంబులంగలిసి మలయానిల సమ్మిళితంబు లగుచుండెను. ఒకనాట్యాంగన నడుమనడుమఁ దనమంజీరకలనిస్వనంబుల నిరుపమానకౌతూహలకారిణియై హృదయాకర్షణము గావించుచుండెను.

చదువరీ! అటుచూడుము. అదిగో! ఆకోమలగాత్రి యెట్లు నృత్యము సేయుచుండెనో! తరంగమాలికా సంచలితంబగు జలజస్థితమరాళకామినియుంబోలె నామె యెట్లునాట్యమాడుచుండెనో! పరికింపుము, చుట్టునున్న వారంద ఱామెను దమయుల్లాసవికసిత సుందరవదనంబులఁ జూచుచుండిరి. అదిగో! నీలాంబరధారిణియై యటగూర్చుండియుండిన యాయువతి నీక్షింపుము, నక్షత్రములవలె మెఱయు బంగారు పూలచే నాచీర యెంతమనోహరముగనున్నదో — ఆహా! ఏమి యావిశాలనేత్రద్వయ సౌందర్యము! ఆకసమువలె నవి యెంతకోమలవినీలకాంతులు ప్రకాశించుచున్నవో—విద్యుత్కాంతివలె మెఱయు నా క్రేగంటిచూడ్కులో! ఇంకొకచో లలాటాగ్రభాగమున సీమంతముకడ వజ్రము నలంకరించుకొనియున్న యానారీమణిని జూడుము. ఆమనోహరఫాలభాగమును జూచితివా? అదియెంతగంభీరము—ఎంతవిశాలము! ఎంతనిర్మలము!—భగవంతుఁ డట్టితేజోరాశిని పతానునిభోగభవనమున నుండుటకై సృజించెనా? అదిగో! వేఱొకచో

కుసుమాలంకృతయై విలాసమునంగ్రాలు నాశ్యామలగాత్రిం బరికింపుము. పుష్పాలంకృతములగు నాదుస్తులామె గాత్రమున కెంతవన్నె దెచ్చుచున్నవో చూచితివా? పుష్పములు సౌందర్యవతుల కొఱకే నిర్మింపఁబడినవి. అదిగో! ఆప్రక్క-గూర్చుండియున్న బింబాధరిం జూచితివా? ఆమె యోష్ఠము లొక్కించుక లోనికణఁపఁబడియున్నవి. పరికించితివా? నిర్మలాకాశమునఁ బ్రకాశించు రాకాచంద్రునివలె కోమలనీలాంబర పరివృతంబగు నామె ముఖమండల మెంతమనోహరముగ నున్నదో చూడు! అదిగో! అట మరాళ కాంతుల నీసుకుమార గళసౌందర్యమునఁ గ్రాలు నాసుందరీమణిని జూచితివా? ఆమె మాటలాడుచు నెందులకొ నవ్వుచున్నది! చూడు! చూడు! ఆకర్ణాభరణములెట్లు కదలుచున్నవో! ఓశిరీష కుసుమపేశలమూర్తీ! సుందరశిరోరుహ సందర్శనంబునఁ జూపఱ హృదయాకర్షముఁగావించుచున్న నీవెవతెవు? నీవినీల కుంతలముల, వక్షస్స్థలంబున వ్రేలాడవైచితి వెందులకు? సరోరుహకుట్మలంబునకు సర్పమెట్లు చుట్టుకొనునో చూపించుచుంటివా?

కటుల్ ఖానుని సమీపమునఁగూర్చుండి బంగారు కలశమున నమృతముపోసి యాతనికిచ్చుచున్నావు. సుందరీమణీ! నీవెవతెవు? కటుల్ ఖానుఁడు క్రేగంటిచూడ్కులతో నీపరిపూర్ణవికసిత మనోహరరూప సంపదలఁ జూచుచున్నాఁడు. నీవెవతెవు? అమోఘకటాక్ష నిరీక్షణమున నాతనిహృదయమును దహించుచున్న నీవెవతెవు? ఆకటాక్షమును నే నెఱుఁ

గుదును—నీవు విమలవు —ఆతనికంతగా మధువు నిచ్చుచు న్నా వెందులకు? ఇమ్ము—ఇమ్ము— ఇంకనునిమ్ము—నీదుస్తులలో గటారిని దాచుకొని వచ్చితివా? దాచుకొనివచ్చితివి. నిశ్చయమే. ఆరీతిగా నీకు హాస మెట్లు వచ్చుచున్నది? అయ్యో! అది సర్వసామాన్య హాసముకాదు. కటుల్ ఖాఁ నీముఖము వంకఁ జూచుచున్నాఁడు. అదియేమి! కటాక్షనిరీక్షణమా? అదియేమి? మరలనేమి? ఆమహమ్మదీయుని బాగుగఁ ద్రాగ నిచ్చి యున్మత్తునిగ నొనర్చితివేమో చూడు, నీతంత్రములచే నాతఁడు నినొక్కతెనే ప్రేమించునట్లుగ నొనర్చితివా? అట్లేల గాకుండును? అట్టిహాసము! అట్టివగ! అట్టిమాధుర్యము! అట్టియుల్లాససంభాషణము! అట్టికటాక్షము! మరల మధుపాత్రము కటుల్ ఖాఁ! జాగ్రత్తగనుండుము. కటుల్ ఖా నేమిచేయఁగలడు? కటాక్షనిరీక్షణముతోడ విమల మధుపాత్రమునిచ్చుచుండ నేమిచేయును? హా! ఆధ్వనియేమి? ఎవరు పాడుచున్నారు? అది మర్త్యవనితా కంఠధ్వనియా? లేక అప్సరోంగనా గానధ్వనియా? విమల పాటకులతోఁ గలిసి పాడుచున్నది. ఆకంఠధ్వనియేమి! ఆస్వరములేమి! మనోహరములగు నాలయతాళములేమి! కటుల్ ఖాఁ! ఇదియేమి? హృదయమును వశపరచుకొనినవారెవరు? ఎవరివంక వీక్షించుచున్నాఁడవు? ఆలాపించునపుడు ప్రతిమూర్ఛావస్థ యందును మృదుమందహాసముతో నామె తన కటాక్షముల నీపైఁ బఱపుచుండెనా! ఆమె క్రిగంటిచూడ్కులు వాడి కటారికంటె నధికముగ నీహృదయమును భేదించుచున్నవా?

అది నీవు చూచితివా? కటాక్షనిరీక్షణమే మోహోద్రేక
కరము. అదియిప్పుడు సంగీతమిళితమైనది. ప్రతికటాక్షము
తోడను నామెశిరసెట్లు చలించుచున్నదో చూచితివా!
ఆమె కర్ణాలంకారము లెట్లాడుకొనుచున్నవో చూచితివా!
హా! మరల మధువును పోయుము. మరలపోయుము. దేవుని
కొరకు మరలపోయుము. ఇదియేమి! ఇదియేమి! విమల
లేచినది. నృత్యము సేయుచున్నది. ఆహా! ఎంతమనోహ
రము! ఏమి యానటన! మధుపాత్రిమా! ఏమివ్యక్తి!
ఏమి సుకుమారగాత్రము! కటులుఖా ప్రభూ ఓర్పుతో నుం
డుము! ఓర్పు! ఓర్పు! నీవగ్నిలో నున్నాడవు. ఆహా!
కటులుఖానుని శరీరము మండుచున్నది! మధుపాత్రము!
ఆహా! మధుపాత్రము! హా! మరలనేమిది! మరలహాసము.
మరల కటాక్షము! సారాయము! సారాయము! ఇదియేమి.
అయ్యో! కంకాళి!

ప్రభూ! ఇదియేమి! ఇదియేమి!

చుట్టునున్న స్త్రీలు హాసపల్లవితో లేచి వెడలిపోయిరి.

ఆకస్మికముగ దీపమారిపోయెను. కటులుఖా నిట్ల
నెను.

"మనోహరణీ! నీవెటనున్నావు!"

విమల యాతనిభుజముపై నొకహస్తమువైచి యిట్ల
నియెను.

"ప్రభూ! నీబానిస నీపాదముల కడనేయున్నది"

ఆమె రెండవచేతితో కటారిని బట్టుకొని యుండెను.

కటుల్ ఖానుఁ డామెను దన వక్షస్థలమునఁ జేర్చి బిగ్గఁ గౌఁగిలించుకొనియెను. ఆయుత్తరక్షణముననే యాతఁడు కెవ్వున నార్చెను. ఆమెను దూరముగఁ ద్రోసివైచి శయ్యపైఁ ద్రావాలెను. విమల తనచిన్నకటారి నాతనివక్షమున పిడికంటఁ గ్రుచ్చెను.

"దుష్టహంతకురాలా! మహాపాపాత్మురాలా!" అని గద్గదస్వరముతో నాతఁడనియెను.

"హంతకిని గాను, పాపాత్మురాలనుగాను. కీర్తిశేషుఁడైన వీరేంద్రసింహుని భార్యను."

ఇట్లుచెప్పి యామె వెడలిపోయెను.

కటుల్ ఖానునకు మాటాడుశక్తి నశించిపోవుచుండెను. శక్తికోలఁది నేడ్చుచుఁ బడియుండెను. విమలయు నేడ్చుచు బరుగెత్తుచుండెను. ఆమె యింకొకగదిడ కరిగెను. అక్కడ గొందఱు మాటలాడుకొనుచున్నారు. ఆమె వాయువువలెఁ బరుగెత్తుచుండెను. తరువాత భవనమున కొందఱు రక్షకులను, కొజ్జాలను జూచెను. ఆమెయేడ్పును, తడబాటునుజూచి వారిట్లడిగిరి.

" ఏమిది! ఏమిది!"

" మరణము — నాశనము — తొందరగఁ జనుఁడు. రాజద్రోహులు కొందఱు లోనఁబ్రవేశించిరి. వారు బహుశః నవాబును వధించియుందురు."

వారత్యంత వేగమున నాభవనమువంకఁ బరుగెత్తిరి. విమల యభ్యంతమందిర ద్వారముకడ కరిగెను. అట ద్వారపాలకుఁడు మత్తుచే నిద్రఁబడియుండెను. ఆమెయభ్యంతరము

లేకుండ నాద్వారమును దాఁటిపోయెను. పొడుగునను నిశ్లేపోయెను. ఆమె నిరంతరాయముగఁ బరుగెత్తుచుండెను. ఆమె కడపటి ద్వారముకడకు వచ్చెను. అట ద్వారరక్షకులు మేల్కనియుండిరి. అందొకఁడు విమలతో నిట్లనియెను.

"ఎవరక్కడ? నీవెక్కడ కేగెదవు?"

అభ్యంతరభాగమున నిప్పుడు మహాద్భుతమైన కోలాహల ముప్పతిల్లెను. అందఱు నావంకఁ బరువులెత్తుచుండిరి. నీవిక్కడ నూరకకూర్చుండి యేమి చేయుచున్నాఁడవు? ఆకోలాహలము నీవు వినలేదా?" అని విమల యనియెను.

"అదేమి?"

"నవాబు నెవరో మార్కొనిరి."

ద్వారమును విడిచి రక్షకులు బరువెత్తిరి. విమల యే యభ్యంతరమును లేకుండ దాటిపోయెను. ఆమెద్వారమును గడచి కొంతదూర మరుగునప్పటి కొకచెట్టుకడ నొకమనుష్యుఁడామెకుఁ గన్పట్టెను. విమల తోడనే యాతఁడభిరామస్వామియని గుర్తించెను. ఆమెతో నాతఁ డిట్లనియెను.

"నేను చాల భయపడుచున్నాఁడను. ఆ కోలాహలమేమి?

"నాతప్పిదమునకు నేను పగఁదీర్చుకొంటిని. మన మిక్కడ దడయరాదు. మనకుటీరమునకు శీఘ్రముగఁ బోవలయు. జరిగినదంతయు బిదపఁజెప్పెదను. తిలోత్తమ యటకు వచ్చినదా?"

"ఆమె యాష్మానితోఁగూడ నరుగుచున్నది. మన మిప్పుడే కలిసికొనగలము."

వారు వేగముగ నడిచి కుటీరమును జేరిరి. అయేషా యనుగ్రహముచేఁ దిలోత్తమ యాష్మానితో నప్పుడే యటఁ జేరెను. ఆమె యభిరామస్వామి పాదములపైఁబడి యేడువ నారంభించెను. ఆమె నూరార్చి యాతఁడిట్లు చెప్పెను. "భగవదనుగ్రహమున పాపాత్ములచేతినుండి యీవలఁ బడితివి. ఒక్కక్షణికమైనను మనమిట నిలువరాదు. పఠానులు మనల గుర్తించిరేని వారిప్రభువునకయి మనప్రాణములఁ గైకొని పగదీర్చుకొనఁగలరు. మనమీరాత్రియే యిటనుండి లేచిపో వలయును. అందఱు నటుచేయ సమ్మతించిరి.



## పదునేడవ ప్రకరణము.



### అవసానము

విమల పలాయనమైనతోడనే కటుల్ ఖానుని యుద్యోగస్థుఁడొకఁడు జగత్సింహుఁడున్న చెఱసాలకడకు వచ్చి యాతసితో నిట్లనియె.

"రాజకుమారా! నవాబును కవసానకాలము తటస్థించినది. ఒక్కమాఱు మిమ్ముఁ జూడవలయుననుచున్నవాఁడు"

"అదేమి" అని జగత్సింహుఁ డాశ్చర్యముతో నడిగెను.

"ఎవరో శత్రువులభ్యంతర మందిరమునఁ బ్రవేశించి నవాబును పొడిచి పాఱిపోయిరి. ఆతఁ డిప్పటికి జీవనముతో నున్నాఁడు. కాని, యింక జాలసేపు బ్రతుకఁడు. శీఘ్రముగ రెమ్మ. లేకున్న కార్యము మించిపోవును."

"అట్టిసమయమున నాతఁడు నన్నేలచూడ నభిలషించెను?"

"ఏమో నే నెఱుంగను. మిమ్మ్మఁ దీసికొని రమ్మనిన వచ్చితిని. అంతకంటె నాకేమియుఁ దెలియదు."

జగత్సింహుఁడాతనితోఁగూడ లోపలికిఁ జనియెను. కటులుఖానుని ప్రాణములు కడసారి ప్రకాశమును జూపుచున్నవి. ఇఁకనారిపోవును. శాశ్వతాంధకారమగును. ఆతని చుట్టును తనయులు, పట్టమహిషి, అయేషా, అస్మాన్, ప్రియురాండ్రు, సేవకులు, ఉద్యోగస్థులు, మొదలగువారందఱుబరివేష్టించియుండిరి. ఆప్రదేశమంతయు రోదనప్రలాపములతో నిండిపోయెను. అందఱును దుఃఖించుచుండిరి. శిశువులు విషయము నెఱుంగక యేడ్చుచుండిరి. ఒక్కరు మాత్ర మేడ్చుట లేదు. ఆమె యయేషా దుఃఖబాష్పములామె గండభాగములపైఁ గాల్వలుగట్టి ప్రవహించుచున్నవి. తండ్రిశిరసును తన యొడిలోఁ జేర్చుకొని నిశ్శబ్దముగఁ గూర్చుండియుండెను.

జగత్సింహుఁ డామె విధమునంతయుఁ జూచెను. ఈ షణ్మాత్రవాయుప్రసారము లేని దీపమువలె నామెచలింపకయుండెను.

జగత్సింహుఁడు లోనఁ బ్రవేశించినతోడనే క్వాజా యనురాజసేవకుఁ డాతని హస్తమునుబట్టుకొని కటుల్ ఖానుని ప్రక్కకుఁ గొంపోయి పెద్దగొంతెత్తి యాతనితో నిట్లనియెను.

"రాజా జగత్సింహుఁడు వచ్చినాఁడు. కటుల్ ఖాను రాకుమారునితో నిట్లనియెను. "నేను నీకుశత్రువుఁడను. నాకుఁ గాలము చెల్లినది. ఈలోకమును విడిచిపోవుచున్నాఁడను. వైరమును నాగ్రహమును బరిత్యజింపుము".

"మంచిది. అట్లే చేసెదను."

"నాదొక్కప్రార్థన—వాగ్దత్తము" అని హీనస్వరముతో బలికెను.

"నేనేమి వాగ్దత్త మొనర్పవలయును?"

"నీహస్తము"

అస్మాక్ కటుల్ ఖానుని యభిప్రాయమును గ్రహించి జగత్సింహునిహస్తము నాతనిహస్తమున నుంచెను. జగత్సింహుని శరీరమంతయు వేడియెక్కెను. అగ్నివ్యాపించి నట్లయ్యెను. కాని యాతఁడా యుద్రేకము నాఁపుకొనియెను. కటుల్ ఖానిట్లు చెప్పదొడంగెను.

"అందఱును పిల్లలు—యుద్ధము—దాహము—చచ్చిపోవుచున్నాఁడను."

అయేషా పర్బతు నాతనినోటఁబోసెను.

"లాభములేదు—యుద్ధమువలన—శాంతము."

కటుల్ ఖాను మాటాడకయూరకుండెను. జగత్సింగు ప్రత్యుత్తర మీయలేదు. ప్రత్యుత్తరము నపేక్షించుచు

కటుల్ ఖాన్ జగత్సింహుని ముఖమువంక వీక్షించుచుండెను. రాకుమారుఁడేమియు మాఱుపలుకకుండుట చూచి కటుల్ ఖానుడతి ప్రయత్నపూర్వకముగ—

"అనిష్టమా?" అనియెను.

"చక్రవర్తి యాధిపత్యమునకు పఠానులు లోఁబడెద రేని సంధికొఱకు నే బ్రయత్నింతునని వాగ్దత్త మొనర్పఁగలను."

"ఒరిస్సాయో?" కటుల్ ఖాను సగమస్పష్టముతో ననెను.

జగత్సింహుఁడాతని యుద్దేశమును గ్రహించి యిట్లనియెను.

"ఆవిషయమున నాసాధ్యమయినంతవఱకుఁ బ్రయత్నించెదను. నాప్రయత్నము విఫలముగాదేని మీాతనయు లొరిస్సాను విడచిపోనక్కఱలేదు."

మరణబాధచే వైవర్ణ్యమైయున్న యాతనిముఖ ముల్లాసముచే వికసించెను. ఇట్లనియెను.

"నీవు—స్వేచ్ఛ—భగవంతుఁడు —మేలు"

జగత్సింహుఁడు వెడలిపోవుచుండెను. అయేషా శిరసు నువంచి తండ్రి చెవియందేదియో చెప్పెను. కటుల్ ఖాన్ మొదట క్వాజాయిసా మొగమువంకను, పిదప వెడలిపోనుద్యుక్తుడయి యున్న రాజపుత్రుని వంకను వీక్షించెను. క్వాజా రాజపుత్రునితో నిట్లనియెను.

"నవాబు మీతోనింకను నేమియో చెప్పదలఁచు కొనినట్లున్నాఁడు."

రాజపుత్రుడు వెనుకకుమరలెను.

"నీచెవి"

రాజపుత్త్రుఁడాతని యుద్దేశమును గ్రహించి సమీప మునకువచ్చి తనకర్ణము నాతని పెదవులయొద్ద నుంచెను.

"వీర—" అని యస్పష్టముతో నవాబనియెను.

కొంచెముసేపూరకుండి మరల "వీరేంద్రసింహ— అయ్యో నోరెండిపోవుచున్నది." అనియెను,

అమేషా మరల షర్బత్తునుపోసెను.

"వీరేంద్రసింహుని తనయ"

జగత్సింహునకు విషసర్పదష్టమైనట్లయ్యెను.

"నిరాధారురాలు — నేను పాపాత్ముఁడను — దాహము"

అమేషా పదింబదిగ షర్బత్తు నిచ్చుచుండెను. ఆత నికి మాటలాడుట కష్టమయ్యెను. ఉచ్ఛ్వాసనిశ్వాసములు కఠినముగా వచ్చుచుండెను.

"నేను దహింపఁబడుచున్నాను— నేనుదహింపఁబడు చున్నాడ—పతివ్రత—నీవుచూడఁగలవు"

"ఏమిది?" అని రాజు ప్రశ్నించెను.

ఆతని కంఠధ్వని కటుల్‌ఖానుని చెవియందు దుబుము వలె గింగురుమనియెను. కటుల్‌ఖానుఁడిట్లు చెప్పదొడంగెను.

"ఎప్పుడునుజూడఁబోను—అట్టిమహాపతివ్రత—చూ డలేదు—ముట్టుకొనలేదు—నీవు — దాహము—ఎట్లు—

బిడ్డా!—చచ్చిపోవుచున్నాఁడను—చచ్చి పోవుచున్నాఁడను. అయేషా?''

ఇదివఱకే శక్తినిమించి పనిచేసెను. ఇఁకమాటలేదు. శిరసును గ్రిందకు వ్రేలవైచెను. అతఁడీ ప్రపంచమున నుడివిన కడపటిమాట "అయేషా'' తటాలున గప్పుమని యూదీపమారిపోయినది. మరణాంధకారమువ్యాప్తమయ్యెను, ప్రాణములు ప్రపంచమును నాతనినుండి విడిపోయినవి.



పదునెనిమిదవ ప్రకరణము



ద్వేషము.

జగత్సింహుఁడు చెఱసాలనుండి విడివడియెను. మానసింహునికడకేగెను. కటుల్‌ఖానునితో చేసినవాగ్దత్తమును జెల్లించెను. మొగలులకును, బఠానులకును, సంధిజరిగెను. పఠానులు చక్రివర్తిప్రభుత్వము నొప్పుకొనుటకును, నొరిస్సా పఠానుల వశమున నుంచుటకును. ఇరువురును సమ్మతించిరి, సంధిపద్ధతులను వివరముగఁ దెలియఁగోరు చదువరులు చారిత్రమును జూచికొనియెదరుగాక! మేమిప్పు డావిషయమును వివరముగఁ బ్రస్తావింపఁబోము. ఒడంబడిక జరిగినపిదపఁ గొన్నిదినము లెచ్చటనున్న వారచ్చటనుండిరి. క్రొత్తగాఁ గలిగిన యీ స్నేహ బంధమును దృఢము చేయవలయునను నుద్దేశముతో నొకనాఁడు ప్రధానమంత్రియగు ఖాల్‌జాయును, సేనాధిపతియగు నస్మాన్‌ఖానును, మానసింహుని

జూడనేగిరి, కటుల్ఖానుని కుమారులగూడఁ దీసికొనిచనిరి. ఏఁబదిమదగజములను నింక ననేకయమూల్య పదార్థములను నాతనికి కానుకగ నర్పించిరి. మానసింహమహారాజు గౌరవ పూర్వకముగ వాని నందుకొని వారిని గౌరవించి పంపెను.

రాజపుత్రికల మటనుండి బయలుదేరుటకుఁ గొన్ని దినములుపట్టినవి. తుదకొకనాఁటి సాయంతనము పాట్నాకుఁ బోవుటకు స్థిరపఱుపఁబడియెను. ఆమధ్యాహ్నమున జగత్సింహుఁడు తగిన పరివారముతోఁ బఠానుల కోటలోనికిఁ బోయెను. అస్మాన్ఖానునితోడను, తదితర పరిచయుల తోడనుజెప్పిపోవలయునని యాతనియుద్దేశము. చెఱసాలలోఁ గలిసికొనిన యారాత్రినుండియు నస్మాన్ రాజపుత్రునెడల నుపేక్షాభావముఁ జూపుచువచ్చెను. ఆతఁడిప్పుడు కొన్ని సన్మానవాక్యములతో రాజపుత్రుని సాగనంపెను.

కొంచెము విచారకరమైన హృదయముతో జగత్సింహుఁడచటి నుండి మరలెను. ప్రధానమంత్రినిజూచి పిదప నయేషాభవనమునకుఁబోయి ద్వారపాలకునిచే నామె కీరీతిగ సమాచారమంపెను. "నవాబు కాలధర్మము నొందినపిదప మరల నిన్నుఁజూచు నదృష్టము నాకు లభింపలేదు. నేనిప్పుడు పాట్నాకుఁ బోవసిద్ధముగ నున్నాఁడను. నీదర్శనభాగ్యము మరల నాకెన్నటికోగాని కలుగదు. అందుచే నొక్కసారి నిన్నుఁజూచి నీకడ ననుజ్ఞఁగొని యేగవలయునని యత్యాత్రముతో నున్నాఁడను."

ద్వారపాలకుఁడు తిరిగివచ్చి యిట్లు చెప్పెను.

"రాజోత్తమా! మా ప్రభుతనయ యిట్లు నీతోఁ జెప్పు మనినది.

ఇప్పుడు మిమ్ము దర్శింపఁజాలను. ఇట్లన్నందులకు క్షమింపుఁడు".

రాజపుత్త్రుఁడు మఱింత చిన్నపుచ్చుకొనియెను. ఆతని నివాసమునకుఁ బోవ బయలువెడలి కోటగుమ్మము కడకువచ్చెను. అక్కడ ఉస్మాన్ ఖాను తనకొఱకు నిరీక్షించు చుండెను. జగత్సింగు నాతనికి మరల వందనముచేసి బయలు దేరెను. ఉస్మాన్ ఖాన్ కూడవచ్చుచుండెను. రాజపుత్త్రు డిట్లనియెను.

"సేనాధినాయకా! నావలన నీకేదైనపని గావలసి యుండెనేని నెఱింగింపుము. నీమనోరథము సత్యానందముతో నెఱవేర్చెదను."

నీతోరహస్యముగ నొకవిషయము మాటలాడవలసి యున్నది. ఇందఱినడుమ నీతో నది చెప్పవలనుపడదు. వారిని ముందునకు సాగిపొమ్మనుము. నాతోఁగూడరమ్ము"

జగత్సింహుఁ డించుకేని సందియమొందక తన పరి వారమును పొమ్మని యాజ్ఞయొసంగి తానస్మానుతోఁగూడఁ జనియెను. ఉస్మానాతని గుఱ్ఱమునధిరోహించెను. ఇరువురును కొంతదూరమేగిరి. ఉస్మాన్ సాంద్రమయిన సాలారణ్యము ను ప్రవేశించెను. రాజపుత్త్రుఁడు నాతనితోఁగూడ నేగెను. అట శిథిలమైన భవనమొకటియున్నది. బహుశః పూర్వకాల మున నెవఁడో రాజద్రోహి యీయరణ్యముననుండి యుండ

వచ్చెను. అస్మాన్ గుఱ్ఱమునొకసాలవృక్షమునకుఁగట్టి లోనికి బోయెను. ఆమధ్యమున నొక విశాలమైన పెరడున్నది. అం దొకప్రక్కను శవమునుపాతు గొయ్యియొకటి త్రవ్వఁబడి యుండెను. అది క్రొత్తగ త్రవ్వఁబడినది. కాని శవము మాత్రముచట లేదు. రెండవప్రక్కను చితియొకటి పేర్చియుం డెను. అక్కడ మృతకళేబరములేదు.

జగత్సింహుఁడు లోపల ప్రవేశించి యిట్లనియెను.

"ఇదియేమి? ఎందుకో అరు?"

"ఇది నాయాజ్ఞనుసారము సిద్ధపఱుపబడినవి. ఈ దిన మున నేను మృతిజెందితినేని నన్ను అదిగో ఆసమాధిలో బాతిపెట్టింపుము. ఎవ్వరును గ్రహింపజాలరు. నీవు మరణిం చితివేని బ్రాహ్మణులచే నీయుత్తరక్రియలు చేయించెదను. ఎవ్వరును తెలిసికొనజాలరు."

"నీమాటలు నాకర్థముకాలేదు."

"నేనుపఠానుడను. మాహృదయముల నగ్నిప్రజ్వ రిల్లెనేని మాకు న్యాయాన్యాయములుండవు. ఈప్రపంచమున నయేషాయొక్క ప్రేమకు రెండుస్థానములుండరాదు. అందుచే మనయిరువురియం దెవ్వరైన నొకరిప్పుడంతమొంది తీరవల యును."

రాజపుత్త్రుడు సర్వమునుగ్రహించి యిట్లనియెను.

"అయిన నీయుద్దేశమేమి?"

"నీవును నాయుధపాణివి. నాతో రణ మొనర్పుము

నాప్రాణములను గైకొని నీవు సుఖముగ నుండుము. లేదా నీప్రాణముల నిట నర్పించి నాకు మార్గమును జూపుము.''

ఇట్లు చెప్పుచు ప్రత్యుత్తరమున కైన నవకాశమీయ కుండ నాతడొఱనుండి ఖడ్గమును బెఱికి రాజపుత్త్రునిపై కురికెను. తనను గాపాడుకొనుటకై రాజపుత్త్రున కతిశీఘ్రముగ గత్తిని దీయవలసివచ్చెను. అస్మాన్‌ఖా ననేకపర్యాయములు రాజపుత్త్రుని ప్రాణముల దీయ బ్రయత్నించెను. కాని జగత్సింహుఁడొక్క దెబ్బయైనను తనశత్త్రువుపై విసరలేదు. ఆతని దెబ్బ తగులకుండమాత్రము కాపాడుకొనుచుండెను. ఆయుధవిద్యయందిరువురును బరిపూర్ణులే. జయాపజయములు లేకుండ నిరువురును సమానముగ జాలసేపు పోరాడిరి. కాని, పఠానుఁడొనరించిన గాయములచే రాజపుత్త్రుని శరీరము రక్తములో మునిగియుండెను. పఠానుని శరీరమున నొక్క గాయమైన లేదు. రాజపుత్త్రుఁ డాతనిని ముట్టుకొన నైన లేదు. తాను రక్తహీనుడై పోవుచున్నాననియు నిట్టి యసమాన యుద్ధమున నిఁక దనకు మరణముతప్పదనియు రాజపుత్త్రుఁడు నిశ్చయించుకొనియెను. ఇట్లనియెను.

''చాలు—విడువుము — నేనోడింపబడితినని యొప్పుకొనుచున్నాఁడను.''

అస్మాన్‌ఖాన్ నవ్వుచు నిట్లుత్తరమిచ్చెను.

'హా! రాజపుత్త్రుఁడు మరణమునకు భయపడునని నేనెన్నఁడును వినియెఱుంగను—రణమొనర్పుము—రణమొనర్పుము—నేను నిన్ను సంహరించెదను— నిన్ను క్షమింపను—

నీవు జీవించియుంటివేని అయేషా మెన్నఁడును నాయయేషా కాదు"

"నాకయేషాపై వలపులేదు"

"లేదు. నీవు ప్రేమించుటలేదు. కాని, యయేషా నీ యెడ ననురాగయై యున్నది—యుద్ధమొనర్పుము—క్షమార్పణలేదు—"అని ఖడ్గకాంతులు మెఱయుచుండఁ ద్రిప్పుచు జెప్పెను.

రాజపుత్త్రుఁడు తనయాయుధమును దూరముగ విసరివైచి యిట్లుచెప్పెను.

"నేను రణమొనర్పను, నాదురదృష్ట దినములలో నీవు నాకుఁ జాలసాహాయ్యమొనర్చితివి. అందుచే నేను నీతో యుద్ధమును జేయను."

కోపావేశ పరవశుఁడై యస్మానుఖాను రాజపుత్త్రుని వక్షస్థలమున నొక్కతన్నుఁ దన్ని యిట్లనియెను.

"మరణమునకు భయపడిన వీరులతో నేనిట్లే యుద్ధమొనర్చెదను."

రాజపుత్త్రుని ధైర్యంతయు నశించిపోయెను. పాఱవయిచిన యాయుధము నతిశీఘ్రముగ నందుకొని నక్కకఱచినసింగపు గొదమవలె ముందునకు లంఘించి పఠానుని దాఁకెను. మహాద్భుతమైన యాతని తాఁకుడును పఠానుఁడు సహింపలేకపోయెను. రణరంగమున నిలువునఁ బడిపోయెను. రాకుమారుఁ డాతనివక్షముపైఁ గూర్చుండి యాతనిచేత

నున్న కత్తిని బెఱికిఁకొని యాతని కంఠస్థలమునబెట్టి యిట్లనియెను.

"ఇప్పుడేమనియెదవు? నీరణవాంఛ తృప్తినొందెనా?'

"నేను బ్రతికియుండగఁగాదు"

"నీప్రాణము నిప్పుడు నాశనమొందింపగలను."

"అట్లుసేయుము. లేకున్న నీప్రాణశత్రువు జీవించియుండును."

"బ్రతికియుండనిమ్ము. రాజపుత్త్రుఁ డందులకు భయపడఁడు నేను నిన్ను వధించియుందును. కాని నీవు నాప్రాణమును గాపాడితివి. అందుచే నీప్రాణములను నేను కాపాడుచున్నాఁడను"

రాజపుత్త్రుఁ డస్మానుని చేతులును, గాళ్ళను గట్టి యొక్కటొకటిగ నాతని యాయుధముల నన్నిఁటిని దీసిపాఱవైచి, యాతని నిరాయుధునిగఁ జేసెను. పిదప నాతని బంధవిముక్తుని జేసి యిట్లనియెను.

"నీవు నెమ్మదిగ నీయింటికిఁబొమ్ము. నీవు యవనుఁడవైయుండియు రాజపుత్త్రిని వక్షస్స్థలమునుదన్నితివి. అందుచే నీకీదురవస్థఁ గలుగఁజేయవలసివచ్చినది. లేకున్న రాజపుత్త్రులెప్పుడును దమకు మేలొనర్చినవారియెడ గృతఘ్నులై ప్రవర్తింపరు.

అస్మానుఁ డేమియుఁ బ్రత్యుత్తరమీయకుండ నశ్వారోహణముజేసి దుర్గమువంకఁ బరుగెత్తెను.

రాజపుత్త్రుఁడు తనవస్త్రమును నూతిలోఁ దడిపి శరీర మంతయుఁ గడిగికొనియెను. ఆతఁడు గుఱ్ఱము నధిరోహించి కళ్ళెమును బుచ్చుకొనెను. ఆకళ్ళెమునకు నాకులు లతలు చుట్టఁబడియున్నవి. వానిని దీసివేయ శిరోజములతోఁ గట్టఁబడిన యుత్తర మొకటి కనఁబడియెను. దానిపై నీవిధముగ లిఖింపఁబడియుండెను.

"అయ్యా! రెండు దినములవఱకు నీయుత్తరమును విప్పకుము. విప్పితివేని దీనియుద్దేశము కొనసాగనేరదు."

రాజపుత్త్రుఁ డొక్కింతుక యాలోచించి లేఖరియభిప్రాయము నంగీకరించెను. విప్పలేదు. దానిని తాయెతులో భద్రపఱచెను. గుఱ్ఱము నొక్కదెబ్బకొట్టి నివాసమునకై మరలెను.

ఇంటికిఁ జేరిన మూఁడవనాఁ డాతనికొకదూత మఱియొకయుత్తరమును దెచ్చియిచ్చెను.

దానినిగూర్చి తరువాత ప్రకరణమున ముచ్చటించుకొందము.

---

## పందొమ్మిదవ ప్రకరణము

### అయేషా యుత్తరము

అయేషాయుత్తరము వ్రాయఁ గూర్చుండెను. ఆమె ముఖలక్షణము, తదేకధ్యానమును, గంభీరమును, సూచించు

చుండెను. ఆమె వ్రాయఁబోవు నుత్తరము జగత్సింహునకు, చిన్నకాగితము నొకదానిని గైకొని వ్రాయఁ దొడంగెను. మొదట "ప్రాణాధికప్రియా" అని వ్రాసి వెంటనే దానిని తుడుపుపెట్టెను. మరల "రాజకుమారా!" అని వ్రాయుచుండ నేత్రముల బాష్పములుదయించి కపోలములవెంటఁ బ్రవహించి యాకాగితముపైఁ బడియెను. అయేషా దానిని చించి పాఱవైచి మఱియొక క్రొత్త కాగితమును గైకొని వ్రాయుచుండెను. ఎన్నియో పంక్తులు వ్రాయలేదు. దానిపైకూడ నట్లేబాష్పములు స్రవించెను. ఆమె దానినికూడఁ బాఱవైచెను. మూఁడవసారి కన్నీళ్ళచే మరక పడకుండ నుత్తరమును బూర్తిచేసెను. వ్రాసినదానిని చదువనారంభించెను. అశ్రువులామెను చదువనీయలేదు. అక్షరములుకనఁబడలేదు. అతికష్టముమీఁద నెట్లో చదివి యుత్తరమును మడచి దూతకిచ్చెను. ఆతఁడు రాజపుత్త్రసైన్యము విడిచియున్న ప్రదేశము వంకకుఁ బోయెను. అయేషా యొక్కతెయు శయ్యపైఁ బడి యేడ్చుచుండెను.

జగత్సింగుత్తరమును విప్పి యిట్లు చదివెను.

"రాజకుమారా! నా మనోధైర్యమునందు నాకు నమ్మకమున్నది. ఆవిషయమున నాకేమేని భయముండినిన్ను జూడరాకపోలేదు. అయేషాకు తాలిమి తక్కువయని యెన్నఁడును దలంపకుము. ఆయుద్దేశము నాకుఁ జాలబాధాకరము. అస్మానుఖాఁ నాతనిహృదయమునఁ గ్రోధాగ్నిరగుల్కొల్పినాఁడని నీవెఱుంగుదువు. మరల నాతని హృదయమునకు

బాధకలుగఁ జేయవలసివచ్చు ననెడియుద్దేశముతో నేను నిన్నుఁ జూడరాలేదు. నీదర్శనమును నిరాకరించినందులకు నీవన్యథా తలంపవని యనుకొనెదను. నాకష్టసుఖములన్నియు భగవంతునిపై వైచితిని. నీసమక్షమున నేను నీకనుజ్ఞ నొసంగి యుంటినేని నావిచారమునంతయు సులభముగా భరింపఁగలిగి యుందును. నేను నీదర్శనముఁ జేయలేకపోవుటచే, జాతితో నిర్మింపబడిన స్త్రీనై పోయితిని.

అయిన నిప్పుడీయుత్తరమెందులకని యడుగవచ్చును. నాదొక్క ప్రార్థనమున్నది. సోదరీప్రేమతోఁగంటె నన్యథా నన్ను నేను ప్రేమించియుంటినని నీకుఁ దెలిసెనేని దానిని మఱచిపొమ్మ. ఈజీవితమున నేనా విషయమును గూర్చి యేమియుఁ దెలుపకుండుటకై మొదట నిశ్చయము జేసికొంటిని. కాని భగవంతుఁడన్యథా యొనర్చినాఁడు. అయిననిఁక దానిని జ్ఞప్తియందుంచుకొనకుము.

నిన్ను ప్రేమించునంతటి భాగ్యమునకై నేను నోఁచి పుట్టలేదు. నేను దేనినినీకీయవలసియుండెనో దానినినీకర్పించి వైచితిని. దానికి బదులుగ నేనేమియుఁగోరను. నీహృదయమును బడయఁగలుగుదునను నాశలేకపోయినను నాప్రేమ బలమున నిర్విచారముగఁ గాలము గడుపఁగలను. ఇప్పుడా విషయమగు ప్రస్తావనమంతయు ననావశ్యకము.

నేను నిన్ను దురవస్థలోఁ జూచితిని. నీకదృష్టదినములు సంప్రాప్తమైనప్పు డయేమాకుఁ దెలియపఱుపుము. కాని యట్లుచేయ నీకిష్టములేకపోయెనేని చేయకుము. ఎప్పుడైన

నీహృదయమునకుఁ గష్టము కలిగినేని యప్పుడయేషా జ్ఞప్తి యుండునా ?

నీకీయుత్తరము వ్రాసినందులకిప్పుడుగాని ముందుగాని లోకులు నన్ను నిందింపవచ్చును. నేను నిర్దోషురాలను. లోకులాడుకొను దానినిగూర్చి నీవంతగా పాటి సేయనక్కఱ లేదు. నీకెప్పుడైన నిష్టముకలిగెనేని నాకుత్తరము వ్రాయుము.

నీవిప్పుడు వెడలిపోవుచున్నాఁడవు. ప్రస్తుతమీప్రదేశమును విడిచి యేగుచున్నాఁడవు. పఠానులు శాంతస్వభావులుకారు. అందుచే నీదేశమునకు మరల నీవు రావలసి యుండును. కాని నీవిఁక నెప్పుడును నన్నుఁ జూడబోకుము. నేనా విషయమును చాలదూరము యోచనచేసి యట్లు నిశ్చయించితిని. స్త్రీలహృదయమునందు విశేషముగ నమ్మకముంపరాదు. దానిని వశ్యము జేసికొనుట స్వభావసిద్ధముగఁ జాలకష్టము.

నిన్నిఁక నొకమాఱు మాత్రము చూడవలయునని నాకభిలాషకలదు. ఈదేశమున నీకుఁ బరిణయమగునేని యప్పుడా విషయమును నాకెఱిగింపుము. నేను స్వయముగ నీవివాహమున కరుదెంచెదను. నీయర్ధాంగిగాఁ గానున్న యా నారీశిరోమణినిమిత్తము కొన్నిభూషణములను దాఁచియుంచితిని. ఆ సమయమును నే నెఱుంగఁగలిగితినేని నాహస్తములతో నాయలంకారముల నామె గాత్రమున కలంకరించెదను.

ఇంకొకమనవి. అయేషా లోకాంతరమున కేగెనని నీకు సమాచారము వచ్చినప్పుడు నీవొక్కమారు ఇక్కడకు రమ్ము. నీపేరువ్రాసి పెట్టెలో నుంపబడినవేవి నీకగపడునో వానిని నీవు నాకొఱకంగీకరింపుము. ప్రేమాస్పదుఁడగు నా తండ్రివలన నేను తనయనైనను కొంతద్రవ్యముఁ బడసి యున్నదానను. అది స్వల్పముగ గాన్పించినను, బీదదేశములోఁ జాలగొప్పగఁ బరిగణింపఁబడును. అబ్నీరు రాజపుత్రివంశజులు కది గ్రహింపఁదగనిదైనను దానిని నీవు స్వాధీనము చేసికొనవలయునని నాప్రార్థన.

దానపత్రమును నీవాపెట్టెయందే కాంచఁగలవు.

ఇఁక వ్రాయుట కేమియున్నది? ఇంకను నెంతయో వ్రాయవలయునని నాకభిలాషకలదు. కాని దానివలన లాభమేమి? భగవంతుఁడు నీకెప్పుడును సౌఖ్యమొసగూర్చుఁగాక! అయేషా విషయమై నీ కెప్పుడును నసౌఖ్యమొనఁగూర్పకుండుఁగాక!"

ఉత్తరమును జదువుకొని జగత్సింహుఁ డేడువదొడంగెను. ఆయుత్తరమును జేతఁబట్టుకొని చాలసేపటునిటు పచారుసేయుచుండెను. పిదప నాతఁడు శీఘ్రముగనొక కాగితమును గైకొని యీదిగువ మాటలను వ్రాసి దానిని మోతి కిచ్చి పంపెను.

"అయేషా! నీవు నారీలోకమునం దంతకుఁ బ్రకాశనీయురాలవు. ప్రపంచమునుదృష్టములలోఁ ద్రోయుచుండుట భగవదుద్దేశముకాఁబోలు! నీయుత్తరమునఁదల్లి యేమమత్వము

నకును నేను బ్రత్యుత్తర మీఁజాలను — నీయుత్తరముచే నేనవశుఁడ నైపోతిని. నిన్ను నేనెప్పుడును బ్రియతమయగు సోదరి వలెఁ జూచుకొనుచుంకునని మాత్రమే దీనివలన నీ వెఱుంగ వలయును.''

దూత యాయుత్తరమును గైకొనిపోయి యయేషా కిచ్చెను.

---

## ఇరువదియవ ప్రకరణము

—♦—

### ఆరిపోవుచున్న దీపము

అయేషాకడ సెలవుఁ గైకొని యాస్మానితోఁ గూడ తిలోత్తమ వెడలిపోయినపిమ్మట నామె యెటనున్నదో యెవ్వ గును జెప్పలేరు. తిలోత్తమ యాస్మానీ, అభిరామస్వామి, విమలను గూర్చిన సమాచారము లెవ్వరికిని దెలియుట లేదు. సంధికార్యములు సమాప్తమయినపిదప మొగలాయీ లును, బఠానులునుగూడ వీరేంద్రసింహుని దారుణవధను గూర్చియు నాతని కుటుంబమునకు సంఘటిల్లిన దురవస్థం గూర్చియుఁ జాలపరితపించిరి. జాలినొందిరి. ఆతనిభార్యను, తనయను వెదకించి తీసికొనివచ్చి గరమందరమున మరల వారిని నిలుపవలయునని నిశ్చయించిరి. తదనుసరణముగ నస్మానును క్వాజాయిసాయును మానసింహుఁడు మొదలగు వారును జాలశ్రద్ధచేసి వారిని వెదకించిరి. కాని, యయేషా

కడనుండి యష్మానీర్లో వెడలుటతప్ప తిలోత్తమ సమాచారముల నెవ్వరును నెఱుంగజాలరైరి. మానసింహుఁడు తన ప్రయత్నములన్నియు విఫలములయిపోవఁదుదకుఁదనకు నమ్మకమైనవాని నొకనిని గరమందరమున నుంచి యాతనికిట్లాజ్ఞాపించెను.

"వీరేంద్రసింహుని భార్యను, తనయను వెదకింపుము. వారిని నీవు కనుగొంటివేని గరమందరమును వారికొప్పగించి నాకడకురమ్ము. నీకు బహుమానముగ నేనొక జాగీరు నిచ్చెదను."

ఈవిధముగ గరమందర వ్యవహారము నంతను నెఱవేర్చి మానసింహుఁడు పాట్నాకుఁబోవ సిద్ధపడియెను.

కటుల్ ఖాను చచ్చిపోవుచుఁ జెప్పినవాక్యములు జగత్సింహుని హృదయమున కేమేని మార్పును గలిగించెనో లేదో చెప్పలేము. ఆయువిదలను గనుగొనుటకై యాతఁడు మనుష్యులను బంపుటలోఁగాని ద్రవ్యమును వెచ్చించుటలోఁగాని యేమియు లోటుచేయలేదను మాటమాత్రము వాస్తవము. కాని, యీ ప్రయత్నములు చేయవలయునను నుద్దేశమాతనికి గతమునంతను జ్ఞప్తికిఁదెచ్చుకొనుటవలనఁ గలిగెనో మానసింహుఁడు మొదలగువారిని ప్రేరేపించిన యుద్దేశము లే యితనిని ప్రేరేపించుటవలనఁ గలిగెనో, పూర్వపు ప్రేమయంతయు మనసున మరల నుద్భవించుటవలనఁ గలిగెనో, మనము చెప్పలేము. కారణమేదియయినఁ గానిమ్ము. ఆతని ప్రయత్నములన్నియు నిష్ఫలములైపోయినవి.

మానసింహుని సేనలన్నియు నచటినుండి బయలు దేరు ప్రయత్నముతో నున్నవి. తేపటిదినమున వారుబయలు దేరి పోయెదరు. ఈదినముననే గుజ్జముకళ్ళెమునకుఁ గట్టఁబడిన యుత్తరముఁ జదువలసిన సమయము, రెండుదినములును గడచి పోయినవి. అత్యాత్రముతో జగత్సింహుఁ డుత్తరమును విప్పి యీదిగువ యంశములను జదివెను.

"నీవు సదుద్దేశము గలవాఁడవై పాపమునకు భయపడెదవేని, బ్రాహ్మణుని శాపమునకు నీవుభీతిఁజెందెదవేని, నీయుత్తరమునందలి విషయములను జదివినతత్క్షణమే నీవొంటరిగ నిటకు రావలసినది. ఇంతేసంగతులు."

"ఒకబ్రాహ్మణుఁడు"

రాజపుత్త్రి యాశ్చర్యపడియెను. ఒకమారిట్లు యోచించెను. "ఇది శత్రువుల మోసకృత్యమయి యుండవచ్చును. నేను వెఱ్ఱివచ్చునా?" మరల నిట్లు తలంచెను. "ఈయుత్తరమ్ము స్వచ్ఛమయిన దేవనాగరాక్షరములలో వ్రాయఁబడియున్నది." తుదికిది తప్పక బ్రాహ్మణుని యొద్దనుండియే వచ్చియుండునని నిశ్చయించెను. తక్కిన యన్నిటికంటె బ్రాహ్మణశాపమునకు రాజపుత్త్రిల కెక్కుడు భయము. అందుచేత నాతఁడు గట్టిగా నిశ్చయించుకొనియెను. తరువాత పరివారముతో నాతఁ డిట్లు చెప్పెను.

"మీరు బయలుదేరుటలో [illegible] నేను [illegible] గలిసి [illegible] నా నిమిత్తము [illegible]

మీరు ముందుకుపోయినను నిబ్బంది లేదు. బరడ్వాను కడఁ గాని, రాజమహాలునందుగాని, మిమ్ముఁ గలిసికొనెదను."

ఇట్లు వారికిఁజెప్పి యొక్కఁడును సాలారణ్యము వైపు నకుఁ జనియెను. మునుపటివలెనే శిథిలమైయున్న యాభవన ద్వారముకడకుఁ బోయి యశ్వము నొక సాలవృక్షమునకుఁ గట్టి చుట్టును జూచెను. ఎవ్వరును గనఁబడలేదు. పిదప నాతఁడు లోపలికేగెను. అక్కడ నొకప్రక్క సమాధికై త్రవ్వఁబడిన గోరియు నొకప్రక్క శవదహనమునకై యేర్ప ఱుపఁబడిన చితియునుండెను. అవి యిదివఱకు తాను చూచి నవియే. ఆచితిపై నొక బ్రాహ్మణుఁడు కూర్చుండి యుం డెను. ఆతఁడు తలవాల్చుకొని యేడ్చుచుండెను,

"అయ్యా! నన్నిక్కడకు రావలయునని కోరినది నీవేనా?"

బ్రాహ్మణుఁడు తలపైకెత్తెను. రాజకుమారుఁ డాతని జూచెను. ఆతఁడభిరామస్వామి.

ఆశ్చర్య సంతోష వినోదము లొక్కుమ్మడి రాజ పుత్రుని హృదయమునావరించెను. బ్రాహ్మణున కాతఁడు వినయపూర్వకముగ వందన మొనర్చి యిట్లడిగెను.

"మిమ్ముఁజూడవలయునని నేనెన్ని ప్రయత్నము లొన ర్చితినో యిప్పుడెంతని చెప్పుదును. మీరెందుల కిక్కడ నున్నారు?"

అభిరామస్వామి నేత్రములు తుడుచుకొని యిట్లని యెను.

"ప్రస్తుతము నేనిక్కడనే యున్నాఁడను."

ఆతఁడామాట వినియు విననితోడనే ప్రశ్నపై ప్రశ్న వైచి యడుగనారంభించెను.

"నన్నిక్కడఁ జూడఁగోరిన దెందులకు? మీరు విచారించుచున్నా రెందులకు?"

"నిన్నిటకురమ్మనుటకును నాకన్నీళ్ళకును, నొక్కటే కారణము. తిలోత్తమ మరణశయ్యపై నున్నది."

రాజపుత్త్రుఁడు మెల్లఁగ జేయానుకొని క్రిందఁ గూర్చుండెను. ఆతని హృదయమున కన్నియు జ్ఞప్తికివచ్చెను. చాలకష్టపడియెను. దేవాలయమునందలి ప్రథమావలోకనము;—శైలేశ్వర సన్నిధానమున నొనర్చిన శపథము—ఆశ్రంగారభవనమునఁ బ్రథమసమావేశ సమయమున గాఢానురాగముచేనైన భాష్పోదయము—గాఢాంధకార మయమగు నారాత్రి సంభవించిన దురవస్థ — ఆమూర్ఛావస్థయందలి తిలోత్తమవదనము-యవనాంతఃపుర గుహాయందలి యామె కష్టము—చెఱసాలయందు తానుచూపిన నిర్దయ—తుదకీమరణశయ్యపై నుచ్ఛ్వాసనిశ్వాస నిర్గమనము—అన్నియు-జ్ఞప్తికి వచ్చెను. ఆతని హృదయమున కివి తుపాను వేగమున వచ్చి తట్టెను. పూర్వపుటగ్ని పదిరెట్లభివృద్ధిఁజెంది యాతని హృదయమును దహించుచుండెను.

అతఁడు చాలసేపు మాటలాడకుండ నూరకుండెను. అభిరామస్వామి యిట్లు చెప్పుచుండెను.

"ఆనాఁడు, విమల తననాథుని జంపినందులకయి పగ

తీర్చుకొనినది మొదలు నేను నాతనయను నాతనయతనయను దీసికొని యిల్లురహస్యముగ నొకచోనుండక యీదేశము నాదేశము తిరుగుచున్నాఁడను. మహమ్మదీయుల భయముచే నిట్లు చరింపవలసివచ్చినది. ఆనాఁటినుండియు తిలోత్తమ వ్యాధిపీడితురాలై యున్నది. వ్యాధికారణమును నీవు బాగుగ నెఱుంగుదువు."

రాజపుత్త్రిని హృదయమున శూలము గ్రుచ్చినట్ల య్యెను.

"అప్పటినుండియు నామె ననేకప్రదేశములయందుంచితిని. అనేకవిధముల వైద్యమొనర్చితిని. నాయౌవనమునుండియు నేను రోగలక్షణశాస్త్రమును బాగుగఁ జదువుకొన్నాఁడను. అనేక వ్యాధులకు వైద్యముజేసితిని. ఎవ్వరునెఱుంగని యనేకౌషధముల నేనెఱుగుదును. కాని హృదయమున బాగుగ వేళ్లుపాఱియున్న విచారముచే బాధపడుచుండు రోగికేవైద్యుఁడు వైద్యముఁ జేయగలడు? ఈప్రదేశము రహస్యముగనున్నదని యెంచి ఈభవనమునం దొకరహస్య స్థానమున నొకవారము దినములనుండి నివసించియున్నారము. అదృష్టవశమున నిన్నిటఁ గనుగొని నీయశ్వము కళ్లెమున నుత్తరమును గట్టితిని. ఆమెవ్యాధిని నేను కుదుర్పలేకపోయినచో నవసానకాలమున నామెకు శాంతిగలుగుటకై, నిన్నొక్కమాఱామెకడకుఁ గొనిరావలయునని నేనెప్పుడును తలంచుచుంచెడివాఁడను. ఇందుకొరకే నీకు నేనీయుత్తరము వ్రాసితిని. అప్పటికామె జీవితవిషయమున నాకుఁగల యాశాలత

లన్నియుఁ దెగిపోలేదు. ఇఁక రెండుదినములలోపలఁ గొం
చెముగుణము గాన్పించదేని యామెతప్పక మరణించునని
యప్పుడనుకొన్నాఁడను. అందుమూలముననే యీయుత్త
రమును రెండుదినములు గడచినపిమ్మట చదువవలయునని
వ్రాసియుంటిని. ఇప్పుడవసానము తటస్థించినది. ఆమె బ్రతు
కునను నాశలేదు. అయ్యో! ఆదీపము కడసారి ప్రకాశ
మును జూపుచున్నది.''

ఆతడు మరల నేడ్చెను. జగత్సింగుకూడ నేడ్చు
చుండెను.

"నీయంతట నీవాకస్మికముగ తిలోత్తమ యెదుటకు
రాకుము. మిక్కిలి కృశించియున్న యామె హృదయమొక్క-
మాఱుగ నీయత్యధికానందమును భరింపజాలదు. ఒక్క
మాఱు వచ్చిచూడవలయునని వర్తమాన మంపితిననియు,
నీవురానున్నావనియు నామెతో జెప్పియున్నాడను. ఇప్పుడు
నేనేగి నీరాక నెఱింగించెదను. నీవామెను పిదప జూడ
వచ్చును.''

ఇట్లు చెప్పుచు నాత డాశిథిల భవనమునందలి లోపలి
భాగమునకు జనియెను. పిదప కొన్ని నిమిషముల కాతడు
మరలవచ్చి "రమ్ము'' అనియెను.

రాకుమారుఁ డాతనితోఁగూడ లోనికిఁ జనియెను. ఆ
గదియంతయు, నిశ్శబ్దముగనుండెను. అందొకప్రాతమంచము
పైఁ జాలకృశించినను నింకను మనోహరముగనున్న తిలో
త్తమపండుకొనియుండెను. పూర్వలావణ్యముయొక్క యస్వ

ష్టకాంతులింకను నామె నావరించియుండెను. సూర్యోదయా త్పూర్వ మాకసమున నించించుక కాంతులఁ బ్రసరింపఁ జేయుచు న స్తమింపనున్న మనోహర నక్షత్రంబుఁబోలె నామెయట బరుండియుండెను. ప్రక్కనొకయనాథస్త్రీ కూర్చుండి తన హ స్తముచే నామెశరీరముపై మెల్లఁగ రాచుచుండెను. ఆమె శరీరమున నలంకారములులేవు. ఆమె యేకాకినియు మలిన దేహయునగు వితంతువు. మొట్టమొదట నామెనురాజపుత్త్రి డానవాలుపట్టలేకపోయెను. ఎట్టులానవాలు పట్టఁగలడు? ఆతఁడు చూచునప్పటికామె నిరంతర యౌవనవతి. ఇప్పుడో వృద్ధాంగన.

రాజపుత్త్రుఁడు లోపలికేగి తిలోత్తమ శయ్యకడ నిలువఁబడునప్పటి కామె నేత్రములు మూఁతవడియుండెను. అభిరామస్వామి యామెనుపిలిచి యిట్లుచెప్పెను.

"తిలోత్తమా! కుమారజగత్సింహుఁడు వచ్చినాడు"

ఆమె కనులువిప్పి జగత్సింహునిఁజూచెను. ఆవీక్ష ణము కోమలముగ నుండెను. అందుఁ దిరస్కారసూచకము లేశమైనను లేదు. ఆతనిజూచియుఁ జూచుటలో నామెనేత్ర ములు క్రిందకు వాల్చెను. క్రమక్రమముగ నశ్రువులు కపోల ములవెంటఁ గాల్వలుగట్టసాగెను. ఆతఁ డికఁ సహింపలేక పోయెను. లజ్జయును గంభీరభావమును దొలఁగిపోయినవి. ఆమెపాదములపైఁబడి బాష్పధారలచే నామె కుసుమగాత్ర మంతయుఁ దడుపుచుండెను.

---

స్వప్న పర్యవసాన మసత్యబోధకము

తండ్రిలేని నిరాధారురాలగు బాలిక వ్యాధిపీడితయై మంచముపట్టియుండెను. జగత్సింహుఁ డామె ప్రక్కనున్నాఁడు. పగలుగడచినది. రాత్రిగడచినది. మరలఁ బవలు వచ్చినది. మరల గడచిపోయినది. మరల రాత్రియే తెంచినది. రాజపుత్త్రిరత్న మామె ప్రక్కనే కూర్చుండియుండి యామె కుపచారము:లు సేయుచుండెను. ఆమె కుపచారము సేయుటలో గతభర్తృకయగు నాయువిద దఱచుగ సాహాయ్యము సేయుచుండెను. తిలోత్తమ తన ముఖమువంకఁ జూచునా? పూర్వమువలె మందహాసాలంకృతమై యామె వదనము మాధుర్యమును వెలిగొలుపుచుండునా?

అని యాతఁడామె వదనమును బలుమాఱుచూచుచుఁ గూర్చుండియుండెను.

సైనిక పటకుటీరము లెటులున్నవి? సైనికు లెట నున్నారు? వారాప్రదేశమును విడిచిపోయి యిప్పుడు పాట్నాలో నున్నారు. జగత్సింహుని స్వపరివార మెచటనుండెను? వారు దారుకేశ్వరనదీతీరమున తన ప్రభుని రాకనునిరీక్షించుచున్నారు. ప్రభు వెక్కడనున్నాఁడు? నిర్దయాత్మకములగు మధ్యాహ్నసూర్యుని వేఁడి కిరణములచే వాడి కృశించిపోవ సిద్ధముగనున్న శిరీషకుసుమమునకు నేత్రహారి కరములగు బాష్పోదకములచే మరల జీవము పోయుచున్నాఁడు.

ఆ మృదుకుసుమము మరల బ్రతికినది. మోహామెక్కటియే యీప్రపంచమున సర్వకార్య నిర్వాహకమైన

మంత్రము. మోహజ్వరమును గుదుర్చు వైద్యుఁడు మన్మథుఁ డొక్కఁడే. అతఁడుదప్ప నావ్యాధినిగుదుర్చువార లెవ్వరు?

మంచితైలమును గ్రొత్తగఁబోయుటచే గ్రమక్రమముగఁ బ్రకాశించు దీపమువలెఁ గ్రీష్మర్తు భానుకిరణములచే వాడిపోయి తొలకరివాన చినుకులచే మరల నేపుఁజెంది చిగిర్చుచితీఁగవలె, జగత్సింహుని సహవాసముచేఁ దిలోత్తమ యారోగ్యమునొందుచుండెను.

ఆమె శయ్యపైఁగూర్చుండుటకు శక్తిగలిగెను. నడుమ నడుమ విమల యావలికేగునప్పుడామె తనహృదయము నాతనికడ విప్పి యేమేమియో చెప్పుచుండెను. ఎన్నివిషయములో చెప్పినది. హృదయమునను న్న యనేకములగు తప్పయిన యభిప్రాయములన్నిఁటిని దెల్పినది. ఆమెమనసున నుద్భవించి నాశనమైన యాశలన్నియు నెఱింగించినది. నిద్రించుచున్నప్పుడు మెలఁకువగనున్నప్పుడామె కనిన స్వప్నకథల నన్నిఁటిన నుడివినది. వ్యాధిపీడితయై స్పృహలేకుండ పడియున్నప్పుడు తనకొకనాఁడు వచ్చిన యీక్రిందిస్వప్నము నాతనికిఁ జెప్పెను.

వసంతకాలమున నంకురములు మొదలగు వానిచేఁ జక్కఁగనలంకరింపబడియున్న యొకపర్వతముపై నామెయు రాజపుత్త్రుఁడును నాటలాడుకొనుచుండిరి. ఆమె పువ్వులనేరి దండలుగాఁ గూర్చెను. ఆమె రెండు దండలనుగ్రుచ్చి యందొకటి తనకంఠమున నలంకరించుకొని రెండవది జగత్సింహుని కంఠమునవైచెను. రాజపుత్త్రుని నిశితఖడ్గమునకుఁ

దగిలి యాతనిహారము తెగిపోయెను. "నేనిఁక నేహారమును నీకంఠమున నలంకరింపను. నీపాదములకు సంకెలలఁ దగిల్చి కట్టివైచెదను." అని తిలోత్తమ యనియెను. పిదప నామె పూలతోఁ సంకెలఁ జేసెను. ఆమె యాసంకెలలం దగుల్ప నాతనికడ కేగెను. ఆతఁడు కొంచెము వెనుకకరిగెను. తిలోత్తమ యాతనిఁబట్టుకొనుటకై శీఘ్రముగ నడచెను. ఆతఁడింకను దూరమరిగెను. తిలోత్తమ పరుగెత్తెను. జగత్సింహుఁడు వేగముగాఁ బర్వతము నెక్కనారంభించెను. అక్కడ చిన్నకాలువ యొకటి యుండెను. జగత్సింహుఁడు దానిని దాఁటెను. తిలోత్తమ స్త్రీయగుటచే దాఁటలేకపోయెను. ఆకాలువ యెటసన్నముగానుండునో యక్కడనుండి దాఁటవలెనని యామె యాప్రక్కగాఁ బోయెను. వెళ్ళినకొలఁది నాయేఱు సన్నమగుటకు బదులు వెడల్పయ్యెను. క్రమక్రమముగ నదియొక చిన్న నదియయ్యెను. తుదకది పెద్ద నదియయ్యెను. ఇఁక జగత్సింహుఁ డగపడలేదు. ఆనది గట్టెత్తుగ నుండెను. భయంకరములైన మెరకపల్లములచే సమానముగా లేకుండబోయెను. ఇఁక నడచుటకు సాధ్యముకాదు. ఇంతలో తిలోత్తమ నిలుచుండియుండిన గట్టుమహాధ్వనిచేయుచుగూలి నదిలోఁబడిపోయెను. క్రింద నొకభయంకరమయిన సుడిగుండమున్నది. తిలోత్తమయటనుండి యెగిరి పర్వతము నెక్కబోయెను. కాని, తిలోత్తమ బిగ్గఱఁగ నేడ్వనారంభించెను. అకస్మికముగ భయంకర స్వరూపుఁడగు కటుల్ ఖాను సమాధినుండి వచ్చియామె కడ్డముగ నిలిచెను. తత్క్షణమే యా

పూలదండ యినుపసంకెలగ మాఱిపోయెను. ఆమెహస్తమున నున్న పూలసంకెల యదృశ్యమై యామెపాదముల కినుపసంకెలయయ్యెను. ఆకస్మికముగ నామె శరీరమునిలువఁబడిపోయెను. కటుల్‌ఖాను మెడఁబట్టుకొని యామె నాప్రవాహమధ్యమునఁ బడవైచెను.—

తిలోత్తమ నేత్రములు బాష్పావృతము లగుచుండ "రాకుమారా! కల వట్టి కలకాదు. నీకొఱకుఁ గూర్చిన యాపూలసంకెల నాపాదముల కినుపసంకెలయై నిజమును ఋజువుచేసెను — నీకంఠమున నేనలంకరించిన యాపూలహారము నీవు కత్తితో ముక్కలుచేసితివి."

రాజపుత్త్రునకు నవ్వువచ్చెను. ఆతఁడు తనకత్తినందుకొని యామెపాదములకడ నుంచి యిట్లనెను.

"తిలోత్తమా! ఇదిగో! నాఖడ్గమును నీకిచ్చివైచితిని, ఇఁక నొక్కమాఱు పుష్పహారమును నాకంఠమున నలంకరింపుము. ఈహస్తములతో నీకత్తిని రెండుముక్కలుచేసివైచెదను."

తిలోత్తమ యూరకుండెను. రాజపుత్త్రుఁడు "తిలోత్తమా! పరిహాసముకాదు." అనియెను.

ఆమె సిగ్గుచేఁ దలవంచుకొనియెను.

ఆసాయంకాలమభిరామస్వామి యింకొకగదియందుఁ గూర్చుండి ప్రదీప ప్రకాశ సాహాయ్యమున వ్రాఁతగ్రంథమునొకదానిని చదువుకొనుచుండెను. రాజపుత్త్రుఁ డటకువచ్చి యతివినయమున నిట్లనియెను.

"అయ్యా! నాదొక్క ప్రార్థనము. తిలోత్తమ కిప్పుడు ప్రయాణశ్రమను సహింపదగినంత శక్తి కలిగినది. ఇంక నీ శిథిలభవనమున నుండి కష్టమనుభవించు టెందులకు! రేప శుభదినముగా దేని, గరమందరమునకుం గొనిరమ్ము. నీకిష్టము గలదేని తిలోత్తమ నబ్నీరు రాజపుత్ర వంశమునకుం గోడలిగం జేసి నాకు సౌఖ్య మొసంగూర్పుము."

పుస్తకము నటబెట్టి లేచి యభిరామస్వామి యాతనిని గాంగిలించుకొని పరవశుండై పోయెను. ఆపవిత్ర గ్రంథమును కాలితోం ద్రొక్కుచుండెను.

రాజపుత్రుం డభిరామస్వామికడ కరుదెంచుచున్నప్పు డేదియోయూహించివిమలయు, నాస్మానీయునాతని వెనుకనే వచ్చిరి. వెలుపలనుండి యంతయువినిరి. రాజపుత్రుండివ్వాలకు వచ్చి విమలను జూచెను. ఆమె విధమంతయు నాకస్మికముగ మారియుండెను. ఆమెయ దేపనిగ నవ్వుచుండెను. ఆస్మానీని జుట్టుపట్టుకొని కొట్టుచుండెను. ఆ దెబ్బలను లక్ష్యముచేయక ఆస్మానీ విమలయొద్ద నాట్యము నేర్చుకొనుచుండెను. రాజపుత్రుండు మెల్లగ నటనుండి జారిపోయెను.



## ఇరువది రెండవ ప్రకరణము



### పుష్పము వికసించినది

అభిరామస్వామి గరమందరమున కేగి జగత్సింహునకును దిలోత్తమకును బరిణయ మతి వైభవముతో జరుపుచుండెను.

జగత్సింహుఁడు తనపరిణయమునకు జహానబాదునుండి మిత్రులను, బరిచయులను నాహ్వానముచేసి రప్పించెను. తిలోత్తమతండ్రి బంధుమిత్రులుకూడ నరుదెంచి యామహోత్సవము నతివైభవముగఁ గావించిరి.

జగత్సింహుఁ డయేషాకుఁగూడ సమాచారమంపెను. ఆమె సహోదరునితోడను, బరివారముతోడను, నామహోత్సవమున కేతెంచెను.

ఆమె మహమ్మదీయ యువిదయయ్యు జగత్సింహుని యందును, దిలోత్తమయందును దనకుఁగల ప్రేమాతిరేకమునఁ బరిచారికలతోఁగూడ దుర్గాభ్యంతర మందిరద్వారమున కరుదెంచెను. విచారసాగర నిమగ్నయగు నయేషాయట్టి యుత్సవమునకట్టి మహోల్లాసమును జూడరాఁజాలదని చదువరులాఁలోచింపవచ్చును. కాని యామె యట్టిదికాదు. అయేషా యుల్లాసభరితమయిన హృదయముతో శరద్రాకాశ చంద్రకిరణ ప్రకాశమున సంపూర్ణ వికసితమై నిర్మలోదకము పైఁ దేలియాడుచు చూపఱుల నానందపరవశులం జేయు కుసుమ రాజంబుపోలిక నందఱ నానందింపఁ జేయుచున్నది. ఆమె మందహాస కాంతులఁ జుట్టును బ్రకాశింపఁ జేయుచున్నది

వివాహ కార్యములు పూర్తియగునప్పటికి రాత్రి రెండుజాములైనది. అయేషా తన పరివారముతోఁ గూడ మరలిపోవ బ్రయాణమయ్యెను. హాసమొనర్చుచు నామె విమలకడ సెలవుఁగైకొనియెను. అయేషా హృదయమును విమల యేమియు నెఱుంగదు. ఆమెయిట్లనియెను.

"అయేషా! నీవివాహమునకు మరల మమ్ముఁ బిలువవలెనుసుమీ! మేము తప్పక వచ్చెదము."

విమలను విడిచి యామె తిలోత్తమకడకువచ్చి యామెనొక యేకాంతభవనమునకుఁ గొంపోయెను. ఆమెచేయిపట్టుకొని యిట్లనియెను.

"సోదరీ! నేనిప్పుడు వెళ్ళిపోయెదను. భగవంతుఁడు నీకు చాలకాలము సుఖమొసఁగుఁగాక! ఇదియే నా మనఃపూర్వకమైన ప్రార్థనము."

"మరల నిన్నెంతకాలమునకుఁ జూతును."

"అయ్యో! మరల నిన్నుఁజూచు నాశ నాకెక్కడిది?"

"తిలోత్తమ విచారము నొందెను. ఇరువురు నూరకుండిరి.

"మనము మరలఁ జూచి కొనినను జూచికొనకున్నను నయేషాను నీవు మఱచిపోయెదవా?"

తిలోత్తమ నవ్వుచు నిట్లనియెను.

"అయేషాను నేను మరచినచో రాకుమారుఁడు నన్ను మన్నించునా?"

"నీమాటలు నాకు సంతోషమునిచ్చుటలేదు. రాకుమారునికడ నీవెప్పుడును నాపేరుతలపెట్టకుము. అట్లుచేయనని నాకు వాగ్దత్తమొసఁగుము" అని కఠినముగాఁ జెప్పెను.

అయేషాయొక్క భావిసౌఖ్యము సంపూర్ణముగఁ దన నిమిత్తమై నాశనము చేయఁబడెనని జగత్సింహుఁడు విచారించుచున్నవాఁడనియు, నామెపేరు తలపెట్టినంతమాత్రమున

నాతనికావిచార మతిశయిల్లుచుండునని యు నయేషా గ్రహించెను.

తిలోత్తమయట్లుశపథ మొనర్చెను. అయేషాయిట్లనెను.

“అయినను నన్నుమాత్రము మీరు మరచిపోవలదు. జ్ఞప్తికొఱకు నేనొసంగిన వస్తువులను బరిత్యజింపకుము”

పిదపనామె పరిచారికనుబిలిచి యాజ్ఞయొసంగెను. ఆమె యలంకారములుంచిన దంతపుపెట్టెను దీసికొనివచ్చెను. అయేషా పరిచారికనుబంపి, యామె మృదుహస్తములతోఁ తిలోత్తమనలంకరింప నారంభించెను.

తిలోత్తమకూడ నొక భాగ్యవంతుని తనయయే, అయినను నాయలంకార నిర్మాణకుశలతయు నారత్నప్రకాశతయు గాంచి చాలగ నాశ్చర్యపడియెను. అయేషా తన తండ్రిచేనీయబడిన సొత్తుచే దిలోత్తమనలంకరించుటకయి యాయాభూషణములన్నియు జేయించియుంచెను. తిలోత్తమ యాభూషణముల నెంతయో శ్లాఘించెను. అయేషా యిట్లనియెను.

“సోదరీ! నీవినంతగా శ్లాఘింపకుము. నేఁడేరత్నముచే నీహృదయాలంకార మొనర్చుకొంటివో దానితోఁ బోల్చినప్పుడిది ముచ్చుబంగారమునుగాదు.”

ఇటులఁజెప్పునప్పటి కామె నేత్రములఁ బాష్పోదయమయ్యెను. తిలోత్తమ యేమియు నెఱుంగదు.

అలంకరించుట పూర్తియయినతోడనే యయేషా తిలోత్తమ రెండుచేతులనుఁబట్టుకొని యామె ముఖముపై

దృష్టిసారించి తనలో నిట్లనుకొనెను. "నేనెవనిని ప్రేమించి తినో యీ రాజకుమారుఁడీనిష్కపటమనోహర ముఖమండల ముతో నెప్పుడును సుఖములనందుచుండుఁగాక! నాప్రాణావసానసమయమునఁగూడ భగవంతునిఁగూర్చి రాజపుత్త్రిఁడీ బాలికతో సుఖమొందునట్లనుగ్రహింపుమని నేనొక్కప్రార్థనమే యొనర్చెదను."

"తిలోత్తమా! నీమనోహరుఁడేదేని వ్యాపారతత్పరుడై యుండును. ఆతనికడ సెలవుఁగయికొనుటకయి కాలహరణ మొనర్పను. భగవంతుఁడు నీకు దీర్ఘాయు వొసంగునుగాక! ఈయలంకారములను ధరింపుము. మఱియునా—నీయలంకార రాజమును నీహృదయమున నలంకరించుకొనుము"

నీయలంకార రాజమను నప్పటికామె గద్గదకంఠ యయ్యెను. ఆమెనేత్రములు బాష్పపూరితములయియుండెనని తిలోత్తమచూచెను. తిలోత్తమహృదయముకఱఁగి "అయ్యో నీవు దుఃఖించుచున్నావేమి?" అని యడిగెను.

తత్క్షణమ బాష్పోదకపూరితనేత్రద్వారములు తెఱవబడెను. ఆయేషా యేమియుఁజెప్పలేదు. ఒక్కక్షణికమైన నటనుండలేదు. అతిశీఘ్రముగ నీవలకువచ్చి పల్లకీయెక్కెను.

ఆమె యింటికివచ్చుసరి కింకను రాత్రియున్నది. ఆమె దుస్తులను మార్చుకొనెను. తనభవనమున గవాక్షమునఁ గూర్చుండియుండెను. ఆ గవాక్షమువెంట చల్లనిమందమల యానిలము వచ్చుచుండెను. ఆకాశము మినుకుమినుకుమను చున్న నక్షత్రములతో నామె యిప్పుడేమార్చివైచిన దుస్తు

లకంటె కొంచెము నీలమైమనోహరముగ నుండెను. మలయా నిలముచే నెండుటాకులు మరమరధ్వనులు సేయుచుండెను. దుర్గముయొక్క పైభాగమున గుడ్లగూబ కీచుమని ధ్వనిచేయు చుండెను. కోటగోడక్రింద నయేషాగది ప్రక్కను నిర్మలవారి పూరితమై యాకాశచ్ఛాయను బ్రతిఫలింపఁజేయుచుఁ గందక మొకటియుండెను.

అయేషా గవాక్షమున నాలోచనానిమగ్నయైకూర్చుం డియుండి యామె తనవ్రేలినుండి యుంగరము నొక దానిని దీసెను. అందలంకరింపబడినరత్నము విషనివాసమైన వజ్రము. ఆమె యిట్లు యోచించెను.

"ఈరత్నము నఱుగఁదీసి మ్రింగి నాకెన్నఁటికి నిఁక దాహము లేకుండఁ జేసికొనఁగలను."

ఆమె మరల నిట్లు యోచించెను.

"భగవంతుఁడీప్రపంచమున నన్నిందులకే సృజించెనా! నేనీమాత్రము కష్టమును సహింపలేక పోయితినేని, స్త్రీనై యేలజన్మింపవలయు? ఇది వినెనేని జగత్సింహుఁ డేమని తలంచును?"

ఆమె మరల నుంగరమును బెట్టుకొనియెను. ఆమె మరల నేదియో యోచించి దానిని మరలఁదీసెను.

"ఈమనోవికారము నడంచుటకు స్త్రీల కసాధ్యము. దీనిని దీసిపాఱవైచెదను."

ఇట్లు చెప్పుచు నాయుంగరమును గందకములోఁ బాఱ వైచెను.

సమాప్తము

---

# ANDHRA UNIVERSITY

## Part II Telugu, March, 1951

B (a) దుర్గేశనందిని కథాకాలమునాటి రాజకీయ పరిస్థితి.

(b) విమల జీవితచరిత్రము

## Part II Telugu Sept. 1951

B (a) అయేషా ఆదర్శప్రేమ

(b) అస్మానుఖాను కృతజ్ఞత.

---

* అయేషా తరువాతి వృత్తాంతమేమైనది ?
* జగత్సింహునికి మానసింహుఁడేల యావజ్జీవ కారాగార శిక్ష విధించెను ?
* తిలోత్తమ గతియేమయినది ?
* విమల జీవితశేష మెట్లు గడచినది ?
* గజపతి విద్యాదిగ్గజుని సామాచార మి ?
* అస్మాన్ ఖాన్ ప్రణయపర్యవసాన మెట్టిది ?

289

# శ్రీ వేంకట పార్వతీశ్వర కవుల రచనలు.

| | | |
|---|---|---|
| రవీంద్రునిగోరా | -- 400 పేజీలు. రు | 3—50 |
| మాతృమందిరము | ... ... | 2—50 |
| ఆరణ్యక ... | ... ... | 1—00 |
| అశోకుడు ... | ... ... | 1—00 |
| పుణ్యవిజయము | ... ... | 1—25 |
| సిద్ధార్థుడు | ... ... | 0—94 |
| భారతవీరుడు | ... ... | 1—00 |
| ఏకాంకికలు (కథలు) | ... ... | 1—25 |
| బృందావనము | ... ... | 1—50 |
| చిత్రకథాసుధాలహరి | ... ... | 1—00 |
| భావసంకీర్తనము | ... ... | 1—00 |

కావ్యకుసుమాంజలి

ఏకాంతసేవ

ఇతర నవలలు ముద్రణమగుచున్నవి.

(క్యేటలాగు ఉచితము)

ఆంధ్రప్రచారిణి లిమిటెడ్.,

రామచంద్రపురం - తూర్పుగోదావరిజిల్లా

